4-9-04 (శుక్ర)



# రంగుల సంగీతం

ఫీచర్

ఆకాశం నుండి రాలిపడే వాన చినుకును తాగిన కాంతికిరణం విశ్లేషణం చెంది ఏడు రంగులై పొంగుతుంది. ఇంద్రధనుస్సుగా మారుతుంది.

ఇంద్రధనుస్సు రంగుల్ని పరావర్తనం చెందిస్తూ ప్రకృతి చిత్రవిచిత్ర వర్ణాలలో తననుతాను ఆవిష్కరించుకుంటుంది. తెలుపు నలుపుల ఛాయలనుండి మనల్ని... మనోహరమైన రంగుల లోకంలోకి నడిపిస్తుంది.

విశ్వాంతరాళంలో విరాజిల్లే సూర్యుడు ఓ అద్భుతమైతే ఆ సూర్యుడు వెదజల్లే కళ్లు మిరిమిట్లు గొలిపే స్వచ్ఛమైన ధవళకాంతి మహాద్భుతం. ఈ తెల్లని కాంతి సప్తవర్ణాల సమ్మిళితం అన్న సత్యం మరీమరీ అద్భుతం.

ఈ ధవళకాంతిని 'ది ఫాదర్ ఆఫ్ ది కాస్మస్' అనీ, 'ది లైట్ ఆఫ్ క్రైస్ట్' అనీ అంటారు. ఇది మహాశక్తికీ పవిత్రతకూ ప్రతీక. ఇంద్రియ జ్ఞానాభివృద్ధిలో కీలక పాత్ర పోషిస్తుంది.

అది మొక్కగానీ జంతువుగానీ మనిషిగానీ ఏదైనా సరే సూర్యరశ్మి సోకని ప్రాణి దేహం వ్యాధిగ్రస్తమవుతుంది.

ఫోర్బ్స్ విన్స్‌లో అనే శాస్త్రవేత్త అంటాడు- "ఒక వ్యక్తిని కొంతకాలం పాటు సూర్యరశ్మికి దూరంగా వుంచినప్పుడు అతని శరీరంలోని ఫైబ్రిన్, ఆల్బుమిన్, ఎర్రరక్తకణాల సంఖ్య గణనీయంగా పడిపోతుంది. శరీరంలోని ఫ్లూయిడ్స్ శాతం (నీటిశాతం) పెరిగిపోయి ఎర్రరక్తకణాల స్థానంలో తెల్లరక్తకణాల ఉత్పత్తి జరిగిపోతుంది. ఇదిలాగే కొనసా

కవర్ ఫొటోగ్రాఫర్: మధు మోడల్: రజని



గితే అతనికి లుకేమియా కూడా అటాక్ కావచ్చు"

దీన్నిబట్టి సూర్యకాంతి సజీవుల దేహం మీద గొప్ప ప్రభావాన్ని చూపుతుందని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఏళ్లతరబడి గాలి, వెలుతురుకు దూరమైన ప్రాణులు ముఖ్యంగా మనుషులు భౌతికంగానేకాదు మానసికంగా కూడా బలహీనులైపోతారు.

పాల్‌బ్రంటన్ రచించిన 'ఎ సెర్చ్ ఇన్ సీక్రెట్ ఇండియా' అనే పుస్తకంలో కాంతి ప్రాణాధారం అన్న విషయాన్ని నిరూపిస్తూ ఓ సంఘటనను ఉదహరిస్తాడు.

కాశీకి చెందిన విషుదానంద అనే ఋషి నేలకు ఒరిగి పోయి ప్రాణాలు వదిలిన ఒక పక్షని చూస్తాడు. దాన్ని తన వెచ్చని అరచే తుల్లోకి తీసుకుని ఒక సాధారణమైన పాకెట్ కాన్సన్‌ట్రేటింగ్ లెన్స్‌ను ఉపయోగించి సూర్యకాంతిని ఆ ప్రాణం లేని పక్షి కళ్లలోకి ఫోకస్ చేయగా అది తిరిగి ప్రాణం పోసుకుని ఒక అరగంట సేపు ఎగిరి ఆ తరువాత చనిపోతుంది.

ఈ శతాబ్దం ఆరంభంలో ఇటలీలో జరిగిన 'ది ఇంటర్నేషనల్ కాంగ్రెస్ ఆఫ్ మీటింగ్'లో ఒక విషయాన్ని డాక్టర్లు నిర్ద్వంద్వంగా ప్రకటించారు.

అది 'ప్రపంచంలోని అన్ని రకాల యాంటిసెప్టిక్స్‌లోకీ... వైట్‌లైట్ అతిశక్తివంతమైన యాంటిసెప్టిక్' అని.

ఈ తెల్లని కాంతిలో నిక్షిప్తమైన ఏడు రంగులూ మన శరీరంలోని అతి ముఖ్యమైన సెంటర్స్‌నీ ప్రభావితం చేస్తూ మనసు మీదకూడా పెత్తనం చెలాయిస్తున్నాయన్న విషయాన్ని తెలుసుకున్న మనిషి... 'కలర్ హీలింగ్' అన్న సైన్స్‌ని తెరమీదకు తెచ్చాడు. దీన్నే క్రోమోపతీ అంటారు.

అయితే ఈ సైన్స్ ఈనాటిది కాదు. దీని ఆరంభం గోల్డెన్ ఏజ్ ఆఫ్ గ్రీస్ నుండే జరిగింది. ఏన్షియంట్ ఈజిప్ట్‌లో హీలియోపోలిస్ అనే చోట... 'లైట్ అండ్ కలర్ హీలింగ్' టెంపుల్స్ వుండేవట. మన ప్రాచీన నాగరికతలో చైనా జీవనసరళిలో కూడా ఈ రంగుల ట్రీట్‌మెంట్ ప్రస్తావన వుంది.

భక్తి ప్రపత్తులతో మనం చేసే సూర్యనమస్కారాలకు అర్థం, ఫ్యాషనబుల్ సన్ బాత్‌ల పరమార్థం... కలర్‌హీలింగే.

సోలార్ పవర్‌తో రన్నయ్యే మోటార్స్ లాగే మానవ శరీరంలోని ఆర్గాన్స్ కూడా సూర్యకాంతికి ప్రభావితం కాబడి శరీరం అనే యంత్రాన్ని సజావుగా నడిపిస్తాయి. కేవలం భౌతిక శరీరాన్నేకాదు స్పిరిట్యువల్ బాడీ (ఆత్మసంబంధమైనది)నీ, మెంటల్



బాడీ (మానసికమైనది)నీ కూడా ప్రభావితం చేస్తుందీ సూర్యకాంతి.

లెక్కలేనన్ని నక్షత్రమండలాలతో అసంఖ్యాకమైన సూర్యకుటుంబాలతో ఆవృతమైన అంతులేని ఈ విశ్వం మేక్రోకాస్మిక్ యూనివర్స్ అనుకుంటే పంచభూతాల కలయికతో ప్రాణం పోసుకున్న మానవ శరీరాన్ని మైక్రోకాస్మిక్ యూనివర్స్ అనుకోవచ్చు.

అంత పెద్ద విశ్వాన్నీ ఇంత చిన్న శరీరాన్నీ కూడా ప్రభావితం చేస్తున్నాయి రంగులు.

వైట్ లైట్‌లోని అంశాలైన వైలెట్, ఇండిగో, బ్లూ, గ్రీన్, ఎల్లో, ఆరెంజ్ మరియు రెడ్ (VIBGYOR) కలర్స్‌లో ఏది లోపించినా (దీన్నే కలర్‌స్టార్వేషన్) దాన్ని తిరిగి శరీరంలోకి సప్లిమెంట్ చేసుకునే పద్ధతులు కలర్‌హీలింగ్‌లో వున్నాయి.

మన దైనందిన జీవితంలో అతి మామూలుగా ఒక భాగంగా నిశ్శబ్దంగా కలిసిపోయిన రంగుల్ని గురించి కాసిన్ని వివరాలు తెలుసుకుందాం.

## ఎరుపు (రెడ్)

మనిషి శరీరం మీద ఎరుపురంగు చూపే అసాధారణ ప్రభావాన్నిబట్టి ఆ రంగుని 'గ్రేట్ ఎనర్జయిజర్' (మహాశక్తి ప్రదాయిని) అనీ 'ఫాదర్ ఆఫ్ వైటాలిటీ' అనీ పిలుస్తారు.

ఇది ఆల్కలైన్, నాన్ ఎలెక్ట్రిక్, నాన్‌స్ట్రింజెంట్ రంగు. ఎరుపురంగులో కనబడని భాగమైన ఇన్‌ఫ్రా రెడ్‌రేస్ థర్మల్ రేస్. ఎరుపురంగు ఆర్టీరియల్ రక్తానికి వెచ్చదనాన్నిచ్చి రక్తప్రసరణ సక్రమంగా జరిగేలా చూస్తుంది.

ఈ రంగు మానవ శరీరంలోని అడ్రినల్ గ్లాండ్స్‌ని వుత్తేజపరిచి అడ్రినాలిన్ అనే హార్మోన్ విడుదలకు సహకరిస్తుంది. అడ్రినాలిన్ మనిషిని మెంటల్ స్ట్రెస్ మరియు ఫిజికల్ స్ట్రెస్ (మానసిక శారీరక వత్తిళ్ళు) నుండి కాపాడుతుంది. కోపం, బాధ, భయం లాంటి ఎమోషనల్ ఫీలింగ్స్‌ని కంట్రోల్ చేస్తుంది. ఎర్ర రక్తకణాల ఉత్పత్తిని పెంచి శరీరానికి అవసరమైన శక్తి ఉత్పాదనలో తోడ్పడుతుంది. దీర్ఘకాల జలుబు సంబంధిత వ్యాధులనుంచీ చలి నుంచీ ఈ రంగు రక్షణనిస్తుంది.

మానసిక ప్రభావాన్ని పరిగణనలోకి తీసుకుంటే విల్ పవర్‌నీ, ఆత్మస్థైర్యాన్నీ పెంపొందించి పిరికితనాన్నీ... అపనమ్మకాన్నీ పోగొడుతుంది.

రక్తప్రవాహంలోని రుగ్మతలైన ఎనిమియా (రక్తహీనత), డెబిలిటీ (నిస్సత్తువ), లాసిట్యూడ్, జలుబు, పక్షవాతంలాంటి వ్యాధుల్ని ఎరుపుకాంతి నయం చేస్తుంది.

మెంటల్ డిప్రెషన్, మెలాంకొలియా



వంటి మానసిక వ్యాధులతో బాధపడేవారికి ఎరుపురంగు స్వాంతననిస్తుంది. ఆ రంగుకి గల వార్మింగ్ యాక్టివిటీ (వెచ్చదనాన్నిచ్చే గుణం) వారిలోని నిరాశా నిస్పృహలను పారదోలి ఆత్మవిశ్వాసాన్ని ఇస్తుంది.

అమెరికాలాంటి దేశాల్లో పక్షవాతాన్ని కలర్‌హీలింగ్ ద్వారా పోగొడుతున్నారు.

ఈ ఎరుపురంగులేమితో బాధపడే వారి మీదకు రెడ్‌లైట్‌ని (రుబీల్యూమ్) ప్రొజెక్ట్ చేయడం, రెడ్ సోలారైజ్డ్ వాటర్ని (రుబిగో) ఇవ్వడం, రుబీగ్యాస్, రుబీ షవర్ లాంటివి ఉపయోగించడం ఈ 'ట్రీట్‌మెంట్'లోని కొన్ని పద్ధతులు. గాఢమైన ఎరుపురంగులో వుండే కూరగాయల్నీ, పండ్లనీ తీసుకోవడం కూడా ఈ చికిత్సా విధానమే. ఉదా: బీట్‌రూట్, రెడ్‌క్యాబేజీ మొదలైనవి.

## ఆరెంజ్ (నారింజపండు)

శారీరకంగా... మానసికంగా

చికాకు కలిగినప్పుడు ఆరెంజ్ కలర్ రిఫ్రెష్‌మెంట్‌ని ఇస్తుంది. కాబట్టి దీన్ని రిఫ్రెషింగ్ కలర్‌గా చెప్పొచ్చు. ఇది వార్మింగ్, చీరింగ్, నాన్-ఎలెక్ట్రిక్ మరియు నాన్-స్ట్రింజేంట్ కలర్.

శారీరక శక్తిని మేధాసంపత్తిలో జతపరిచి మన ఆలోచనా సరళిని ఉత్తమ మార్గానికి మళ్ళిస్తుంది. మనోవికారాలను అణచివేసి మనసులో జ్ఞానజ్యోతిని వెలిగిస్తుంది. ఇంద్రియ నిగ్రహశక్తిని ప్రసాదిస్తుంది.





అందుకే ఈ రంగుని సాధువులూ... సన్యాసులూ ఎంచుకునేది.

ఇది మానవ శరీరంలోని స్ప్లీనిక్ సెంటర్‌ని కంట్రోల్ చేస్తుంటుంది.

మనసులో సరికొత్త ఆలోచనల పుట్టుకకు, మానసికోల్లాసానికీ, విశాల భావాలను పెంపొందించుకోవడానికీ కరెక్ట్ కలర్ ఇదే.

జీవన పోరాటంలో అలిసిపోయిన మనిషి మనసును నిస్సత్తువ (మెంటల్ డెబిలిటీ) ఆవరించినప్పుడు ఈ రంగు సమస్యల్ని తట్టుకునే ధైర్యాన్నిస్తుంది. సహనశక్తినీ, మనోధైర్యాన్నీ ఇస్తుంది.

ఈ ఆరెంజ్ కలర్ ట్రీట్‌మెంట్‌తో బ్రీతింగ్ ప్రాబ్లమ్స్, ఎపిలెప్సీ, రిమాటిజమ్, బ్రాంఖైటిజ్ లాంటి వ్యాధుల్ని కలర్‌హీలర్స్ నయం చేస్తున్నారు. మన ఇండియన్ కలర్ హీలర్ జ్వాలా ప్రసాద్ దాదాపుగా చావు అంచులకు వెళ్ళిపోయిన కలరా పేషెంట్‌ని ఆరెంజ్ ట్రీట్‌మెంట్‌తో తిరిగి శ్వాసించే స్థితికి తీసుకువచ్చాడని చెబుతారు.

ఈ రంగు లేమితో బాధపడేవారికి ఆరెంజ్ (ఆరెంజ్ సోలారైజ్డ్ వాటర్), ఆరెంజ్ ల్యాంప్ (ఆరెంజ్ లైట్), ఆరెంజ్ గ్యాస్‌లాంటివి ఉపయోగించి ఉపశమనం కల్గించవచ్చు

## పసుపు (ఎల్లో)

నరాలకు మంచి శక్తినిస్తుంది. మనలో నిద్రాణమైన శక్తిని మేలుకొల్పి... ఉన్నత మానసిక పరిణితిని .తీసుకొచ్చి సెల్ఫ్ కంట్రోలింగ్ పవర్‌ని పెంచుతుంది.

ఈ ఎల్లో కిరణాలు ముఖ్యంగా పాజిటివ్ మేగ్నటిక్ కరెంట్స్‌ని కలిగివుంటాయి. ఇది నాన్‌స్ట్రింజెంట్ కలర్.

పసుపురంగు మానవ శరీరంలోని సెంట్రల్ నర్వస్ సిస్టమ్‌ని ప్రభావితం చేస్తుంది. మన శరీరంలో సూక్ష్మరంధ్రాలను పరిశుభ్రపరుస్తుంది. తద్వారా చర్మ కాంతిని ఇనుమడింపజేస్తుంది.

ఆరెంజ్ కాంతిలాగే పసుపు కాంతులు కూడా మనలో జ్ఞానజ్యోతిని వెలిగిస్తాయి. జ్ఞానాన్వేషణకు పురిగొల్పుతాయి. ఈ రంగు భౌతికమైన శరీరంమీద వాంఛ నశించేలా చేసి ఆత్మసౌందర్యాన్ని వెలిగింపచేస్తుంది.

ఈ ఎల్లోలైట్ ఉదర, కాలేయ, జీర్ణక్రియలకు సంబంధించిన సమస్యలనుంచి ఉపశమనాన్నిస్తుంది. ఈ రంగులేమితో బాధ



పడేవారికి అంబర్ ల్యాంప్ (ఎల్లోలైట్), అంబరో (ఎల్లో సోలారైజ్డ్ వాటర్), అంబర్ గ్యాస్ లాంటి వాటిని ఉపయోగించి ట్రీట్‌మెంట్ ఇస్తారు.

పసుపురంగుని ప్రతిఫలించే ఆహార పదార్థాలు సేవిస్తే ఈ ఎల్లోకలర్ స్టార్వేషన్నుండి బయట పడవచ్చు. అరటిపండు, మామిడి, నిమ్మ వగైరా.

## గ్రీన్ (ఆకుపచ్చ)

పచ్చదనం చూస్తే ప్రాణం లేచి వస్తుందంటారు. ఈ రంగుని 'ది కలర్ ఆఫ్ నేచర్' అనీ ఈ రంగుకాంతిని 'ది రే ఆఫ్ లవ్' అనీ అంటారు.

ఈ రంగు ప్రకృతి సమతౌల్యతకూ ప్రశాంతతకు ప్రతీక. మానవ శరీరంలోని అత్యంత కీలకభాగాలైన మెదడు, హృదయాలమీద ఆధిపత్యం వహిస్తుందీ రంగు. మెదడులో చెలరేగే ఆలోచనల ప్రకంపనలను ప్రశాంత పరుస్తుంది. భగ్నప్రేమికుల హృదయాలకు మందురాసి గాయాల్ని మాన్పుతుంది. అందుకే దీన్ని 'నేచర్స్ కలర్ టానిక్' అంటారు.

ఇది కూలింగ్ నాన్-స్టింజంట్ రే.

ఈ గ్రీన్‌లైట్ బ్లడ్‌ప్రెజర్ మీద అసాధారణ ప్రభావం చూపిస్తుంది.

ప్రకృతిలోని అన్ని రంగుల్లోకీ ఆకుపచ్చరంగు అతిముఖ్యమైనది. ఒక్కమాటలో చెప్పాలంటే ప్రకృతికే హృదయం లాంటిది. అందుకే ఆ రంగు మన హృదయంమీద కూడా అంతటి పట్టుని కలిగివుంటుంది. అందుకే కాబోలు నగరాల్లో బతికేస్తూ... సిమెంటూ... ఇసుకా... ఇటుకల కట్టడాల్ని చూసీ చూసీ... విసిగిపోయిన కళ్ళు పచ్చటి ప్రకృతిని చూడగానే అరమోడ్పులయ్యేదీ... అలసిన మనసు మరో లోకాలకు వెళ్ళిపోయేది!

ఆసక్తికరమైన విషయం ఏంటంటే... కొందరు సైంటిస్టులు ఆకుల్లోని క్లోరోఫిల్‌ని (పత్రహరితాన్ని) కాన్‌సన్‌ట్రేట్ చేసి మాత్రలు తయారుచేస్తున్నారట. ఈ కలర్ టాబ్లెట్స్ గుండె పనితీరును సక్రమమార్గంలో వుండేలా నియంత్రిస్తాయట.

హార్ట్‌ట్రబుల్స్, న్యూరాల్జిక్ హెడేక్స్, అల్సర్స్ వంటి వ్యాధులకు గ్రీన్‌లైట్ సరయిన రెమెడీ.

ఈ రంగులేమితో బాధపడేవారికి.. వర్డిల్యాంప్, వర్డిగో... వర్డిగ్యాస్ అప్లికేషన్ చేస్తున్నారు కలర్‌హీలర్స్. ఆకుపచ్చ కూరగాయలూ పండ్లూ విధిగా తీసుకోవాలి.

## బ్లూ (నీలం)

నీలికాంతి గొప్ప యాంటిసెప్టిక్ రే. ఈ రంగుని సత్యానికీ, నిజాయితీకీ, విశ్వాసానికీ ప్రతీకగా చెబుతారు. అందుకే ఈ రంగు గురించి 'బ్లూయాజ్ హెవెన్స్', 'ట్రూబ్లూ', 'బ్లూ బ్లడెడ్' అన్న నుడికారాలు వాడుకలో వున్నాయి.

నీలిరంగు లారింజయల్ సెంటర్ లేదా త్రోట్ సెంటర్ని ప్రభావితం చేస్తుంది. త్రోట్ సెంటర్ని 'పవర్ సెంటర్' అనీ, 'క్రియేటివ్ సెంటర్' అనీ అంటారు. కారణం ఒక్క మాటతో వినాశనాన్ని కొనితేవచ్చు ఇంకో మాటతో ప్రపంచశాంతిని సృజించవచ్చు.

బాధతోనో, భయంతోనో, అవమానంతోనో ఆందోళనకు గురైన మనసు కుదుటపడాలంటే నీలిరంగే సరైన మందు. అతలాకుతలమై అల్లాడుతున్న మనసుకు గొప్ప విశ్రాంతినీ, శాంతినీ ప్రసాదిస్తుంది.

గొంతుకు సంబంధించిన వ్యాధుల్ని సెరిల్యూమ్ (నీలికాంతి) సెరిలే (బ్లూ సోలారైజ్డ్ వాటర్) లాంటివి వుపయోగించి నయంచేస్తారు కలర్ హీలర్స్.



## ఇండిగో

ఇండిగోని 'ది రే ఆఫ్ డివోషన్' అనీ, 'ది రే ఆఫ్ హోలీఘోస్ట్' అనీ అంటారు. ఇది ఎలెక్ట్రిక్, కూలింగ్, యాస్ట్రింజెంట్.

ఇండిగోలైట్ రక్తాన్ని శుభ్రపరిచే శక్తివంతమైన ప్యూరిఫయ్యర్. సైకిక్ ప్రాబ్లమ్సనుండి కాపాడే రంగు కూడా ఇదే.

ఇది మానవశరీరంలో 'థర్డ్ ఐ'గా పిలవబడే ఫ్రాంటల్ సెంటర్ని (ఐ బ్రోస్ వెనక భాగాన్ని) కంట్రోల్ చేస్తుంటుంది. ఫిజికల్ మరియు హయ్యర్ విజన్స్‌మీదా శ్రవణం మరియు ఆఘ్రాణంమీద ప్రభావం చూపిస్తుంది. పీనియల్ గ్లాండ్స్ పనితీరుని పర్యవేక్షిస్తుంది.

డివోషన్, (ఏకాగ్రత) క్లియర్ లాజికల్ థాట్ (విచక్షణ)లాంటి లక్షణాలకు ప్రోది ఈ రంగు.

లోకల్ అనస్థీషియానూ, ఒక్కోసారి టోటల్ అనస్థీషియానూ ఇండ్యూస్ చేస్తుంది.

సైకిక్ బ్రెయిన్‌లోని అబ్సెషన్స్, డెలీరియమ్, ట్రెమర్స్, అడ్జస్టింగ్ ఫియర్స్, ప్రస్ట్రేషన్స్, పెర్‌వర్షన్స్ తొలగించే రంగు ఇది.

ఈ కలర్ స్టార్వేషన్‌కి ఇండిగోల్యూమ్, ఇండిగోలోలాంటివి ఉపయోగించి బాడీని ఇండిగోతో సప్లిమెంట్ చేస్తారు. యూనివర్స్‌లో పీచీ పింక్ బ్రీతింగ్ అఫిర్మేషన్ కూడా కలర్ హీలర్స్ ఉపయోగించే చికిత్సా విధానమే.

## వైలెట్ (ఊదారంగు)

ఊదారంగు మొత్తం శరీరాన్నే ఏలే రాజులాంటిది. హయ్యర్ మైండ్ మీద అథారిటీ చేస్తుంది. పిట్యూటరీ గ్లాండ్‌మీద ప్రభావం



ఫేమస్ పెయింటర్ మరియు ది గ్రేటెస్ట్ ఇన్వెస్టిగేటర్ ఆఫ్ సైన్స్ ఆఫ్ కలర్స్ 'లియోనార్డో-డా- విన్సి' ప్రకారం ఊదారంగు కాంతిలో కూర్చుని మెడిటేషన్ (ధ్యానం) చేసినపుడు మన ధ్యాన శక్తి పదింతలుగా పెరుగుతుంది.

మరో సంగీతకారుడు వేంగర్ శక్తివంతమైన స్పిరిట్యువల్ మ్యూజిక్‌ని కంపోజ్ చేసేటప్పుడు తన బట్టలూ, కర్టెన్లూ, పరిసరాలూ, మిగతా అన్ని వస్తువులూ ఊదారంగుమయంగా వుంచుకుంటాడు. ఇన్‌సోమ్నియా, న్యూరోసిస్, షిజోఫ్రేనియా, స్ప్లిట్ పర్సనాలిటీలాంటి సైకిక్ ప్రాబ్లమ్స్ ట్రీట్‌మెంట్‌లో ఈ కలర్‌ని వాడతారు.

చూపిస్తుంది. ఈ ఊదాకాంతి సేవాతత్వరతకీ, నిస్వార్థతకీ, ఆత్మత్యాగానికీ ప్రతీక.

వైలెట్ లైట్ ఎలెక్ట్రో కెమికల్ పవర్ కలిగిన కాంతి. ట్రాన్స్-వైలెట్ లేదా ఆల్ట్రా వైలెట్ కిరణాలు మాత్రం నాన్- ఎలక్ట్రికల్ మరియు థర్మిక్ (హీటింగ్) స్వభావం కలిగినవి.

గాఢమైన ఊదా కాంతి మానవ శరీరంలోని నర్వస్ సిస్టమ్‌ని ఇన్‌ఫ్లూయన్స్ చేస్తుంది.

ఈ కాంతి చిత్రలేఖనం, సంగీతం, రచన, శిల్పకళలాంటి ఫైన్ ఆర్ట్స్‌ని స్టిమ్యులేట్ చేస్తుంది. అందుకే ఈ వైలెట్‌లైట్‌ని "స్టిమ్యులేటరాఫ్ హయ్యర్ హ్యూమన్ ఐడియల్స్" అని పిలుస్తారు.

## ది రెయిన్‌బో

"ఏడు రంగుల ఇంద్రధనసూ... ఈడు వచ్చిన నా వయసు... ఏడు రంగులు ఏకమైనా మల్లెరంగూ నా మనసు" అన్నారో సినీకవి.

ఇది అక్షర సత్యంకదూ!

ధగధగలాడే ధవళకాంతి నీటిబిందువుల్ని ముద్దాడి ఇన్ని రంగులై చింది ప్రకృతి ఒంటి మీద ఒయ్యారంగా ఒదిగిపోయి మన మనసునీ తనువునీ మెస్మరైజ్ చేస్తోంది. అన్నట్టు ప్రకృతిలోని ఖనిజాలు, రసాయనాలే కాదు, ప్రకృతి అంశ అయిన మానవ శరీరంలో సూక్ష్మస్థూల ఖనిజాలు కూడా నిరంతరం రంగుల్ని విరజిమ్ముతుంటాయ్. క్షణ కణానికీ ఓ యింద్రచాపాన్ని సృష్టిస్తూనే వుంటాయ్.

అందుకే వయసూ మనసూ, మొత్తం మన జీవితమే రంగులమయం.

ఈ రంగులు సుప్రీమ్ ఆర్టిస్ట్ ఫిజిషియన్ (భగవంతుడు) మనకిచ్చిన వరం.

– సరోజాసింధూరి

# చతుర ప్రపంచం

## నేత్రోత్సవం చేసే అపురూప మైన మ్యూజియంలు

ప్రపంచవ్యాప్తంగా అనేక మ్యూజియంలు ఉన్నా వాటిల్లో అపురూపమైన, అద్భుతమైన 2 మ్యూజియంలు అమెరికాలో నెలకొల్పబడి కళాకారులను, కళాభిమానులను, ప్రేక్షకులను విశేషంగా ఆకర్షిస్తున్నాయి.

వాటిల్లో 'అమెరికన్ మ్యూజియం ఆఫ్ నాచురల్ హిస్టరీ' ఒకటి. రెండవది 'మెట్రోపాలిటన్ మ్యూజియమ్ ఆఫ్ ఆర్ట్'. ఈ మ్యూజియంలో ఎన్నెన్నో కళాఖండాలు ఉన్నాయి. వాటిల్లో తల మానికమైనవి మనదేశానికి చెందినవే. రాజులు, రారాజులు, సంస్థానాధీశులు, కోటీశ్వరులకు చెందినవే. ఆనాటి రాజుల ఔన్నత్యాన్నీ, కళాభినివేశాన్నీ అవి చాటుతున్నాయి. శిల్పుల, చిత్రకారుల, ఎందరో కళాకారుల నైపుణ్యాన్నీ, ప్రతిభా విశేషాలను అవి అద్భుతంగా చాటుతాయి. ఆ కళాఖండాలు నాటి నాగరికతను, ఆచారాలను, భక్తిభావాన్ని ద్యోతకం చేస్తాయి. విదేశాల్లోని ప్రముఖులు ఎందరో ధరించిన అతి ఖరీదైన నగలు, వజ్రాలు, వైడూర్యాలు, మరకత మాణిక్యాలు మనల్ని ముగ్ధుల్ని చేస్తాయి. ఆ మ్యూజియంలలో కొలువుతీరి వున్న వాటిల్లో 5 వేల అపురూపమైన ముత్యాలు వివిధ సైజుల్లో, రంగుల్లో మనకు దిగ్భ్రమ కలిగిస్తాయి. వాటితోపాటు అనేక నెక్లెస్‌లు మనకు ఆనందాన్ని ఇస్తాయి.

స్కాట్స్ రాణీ మేరీ, వెన్నెలబొమ్మ మార్లిన్‌మన్రో, విఖ్యాత నటి ఎలిజబెత్‌టేలర్ యొక్క డైమండ్స్, రూబీ, ముత్యాల నెక్లెస్‌లు ముగ్ధుల్ని చేస్తాయి. ఫ్రాన్స్ రాణి జోసఫైన్ ధరించిన వజ్రాలతో కూడిన తల పాగా ఎంతో ఆకర్షిస్తుంది. మొఘల్ చక్రవర్తుల అత్యంత విలువైన కళాత్మకమైన వజ్ర వైభవం, అద్భుతమైన పనితనంతో కూడిన నగలు గొప్ప అనుభూతిని కలిగిస్తాయి.

మొఘల్ ప్రభువులకు చెందిన 56.7 క్యారెట్ల పెండెంట్‌తో కూడిన వజ్రం మన




మెప్పుపొందుతుంది. అచ్చట ప్రసిద్ధి చెందిన కుందన్ టెక్నిక్‌తో రూపొందించబడిన నగలు అత్యంత మనోజ్ఞంగా ఉండి మనకు ఆహ్లాదం కలిగిస్తాయి. కుందన్ ప్రక్రియలో అత్యంత ఖరీదైన ఎమ్రాల్డ్, రూబీలు నయనానందకరంగా తీర్చిదిద్దబడ్డాయి. ఏలినవారు తలపాగాలకు సొగసుగా అలంకరించు కొన్న వస్తువులు, అనేక నెక్లెస్‌లు, బ్రాస్‌లెట్లు, ముచ్చటైన నగల పెట్టెలు వాటిపై వున్న రూబీలు, పచ్చలు, రమ్యమైన ఉంగరాలు, రత్నాలు తాపడం చేసిన బాకులు, కత్తులు,

కటార్లు, ఎనామిల్ బౌల్స్ నేత్రోత్సవం చేస్తాయి. వాటిని రూపొందించడం కొరకు అత్యంత ప్రతిభగల 500 మంది కళాకారులు, చెయ్యి తిరిగిన పనివారు ఒకటిన్నర సంవత్సరాలపాటు అమిత శ్రద్ధాసక్తులతో వాటిని తయారుచేశారు.

అచ్చట గల మగువలకు అతి ప్రీతిపాత్రమైన దుద్దులు, లోలకులు, బులాకులు, ముక్కుపుడకలు, నెక్లెస్‌లు మనస్సులను రసప్లావితం చేస్తాయి.

---

## మంచు ఎలుగు

ఐశ్వర్యవంత దేశమయిన అమెరికా అనేక విషయాల్లో పరిశోధనలు జరపడానికి ఏటా కోట్లాది డాలర్లని ఖర్చుచేస్తోంది. అమెరికన్ ప్రభుత్వం ఇందుకోసం కొంత నిధిని కేటాయిస్తుంటే నేషనల్ జియోగ్రాఫిక్ మ్యాగజైన్ లాంటి కొన్ని పత్రికలు రీసెర్చెస్‌ని ప్రపంచంలోని నలుమూలలకూ పంపి పరిశోధనలను నిర్వహింప చేస్తున్నాయి.

ఇటీవల జరిగిన అలాంటి రీసెర్చ్‌లలో ఒకటి అంటార్కిటికాలో నివశించే పోలార్‌బేర్ మీద జరిగిన ఒక పరిశోధన. బయోలాజిస్ట్‌లు పూర్తిగా మంచుగల అంటార్కిటికా చేరుకుని అక్కడ గుడారాలు వేసుకుని బసచేస్తూ పోలార్ బేర్‌మీద రీసెర్చిచేసి అనేక విషయాలు కనుగొన్నారు.

అంటార్కిటికాలో సుమారు 25000 పోలార్ బేర్‌లున్నాయి. తక్కువ ఎత్తులో ఎగిరే హెలికాప్టర్‌నుంచి ఎయిర్‌గన్‌తో పోలార్‌బేర్ మీదకి మత్తుమందుగల కాట్రిడ్జ్‌ని కాలుస్తారు. అది తగలగానే ఆ బేర్ గంటపాటు స్పృహ కోల్పోతుంది. అప్పుడా హెలికాప్టర్‌ని ఆపి దిగి దాని బరువును తూస్తారు. దాని శరీరాన్ని, పంజాలని, నోట్లోని దంతాలని క్షుణ్ణంగా పరీక్షించి ఫొటోలు తీస్తారు. తర్వాత దాని రక్తాన్ని నమూనాగా తీసుకుంటారు. చివరగా దాని మెడకి రేడియో తరంగాలను ఎడతెరపి లేకుండా 3,4 ఏళ్లపాటు పంపే కాలర్‌ని తగిలిస్తారు.

బయోలాజికల్ ఫోరెన్సిక్ ల్యాబ్‌లో ఆ రక్తాన్ని పరీక్షించి దాని ఆరోగ్య పరిస్థితి, జెనెటిక్ సమాచారం, అది ఆహారం తీసుకుని ఎంతకాలం అయిందీలాంటి వివరాలను సేకరిస్తారు. తరువాత రేడియో రిసీవర్ ద్వారా తరుచు అది ఎక్కడుందో కనుక్కుని వెళ్లి దాని ప్రవర్తనని, ఆహారపు అలవాట్లని, అది జతకట్టడాన్ని, పిల్లల పెంపకం, మొదలైన వివరాలను సేకరిస్తారు.




పోలార్ బేర్ ఎప్పుడూ నడుస్తూనే వుంటుంది. నిద్రపోయినపుడే అది విశ్రాంతి తీసుకుంటుంది. అలాస్కానుంచి గ్రీన్‌లాండ్ దాకా 3500 మైళ్లు నడిచి వెళ్లడాన్ని రీసెర్చెస్ దాన్ని వెంబడించి కనుగొన్నారు.

ఆడ ఎలుగుకన్న మగ ఎలుగు రెట్టింపు బరువు వుంటుంది. బాగా ఎదిగిన ఆడ ఎలుగు బరువు 750 పౌన్లు వుంటే, మగ

ఎలుగు బరువు 1500 పౌండ్లు. ఆడ ఎలుగు తక్కువలో తక్కువ 2నుంచి 5 వరకు పిల్లల్ని పెడుతుంది. రెండేళ్ల దాకా ఆ పిల్లలు తల్లినే అంటిపెట్టుకుని వుంటాయి. ఆ రెండేళ్లూ తల్లి మళ్లీ గర్భం ధరించకుండా జాగ్రత్తపడుతుంది.

ఇవి సీల్ జంతువులను తిని బతుకుతాయి. దట్టమైన తెల్లటి లేదా లేత పసుపు రంగు వూలు కలిగిన దాని చర్మంవల్ల మంచుమీద తిరిగినా చలి కలగనివ్వదు. మంచు ఎలుగుకి సహజ శత్రువులంటూ ఎవరూలేరు-ఒక్క మనిషి తప్ప. దాని చర్మంకోసం మనిషి దాన్ని చంపుతాడు.

---

## మైక్రోచిప్‌తో...

అనేకమంది ఇళ్లల్లో కుక్కలనూ, కుందేళ్లనూ, పావురాళ్లను పెంచుతూ ఉంటారు. అవి క్రమేపీ వారి కుటుంబ సభ్యులలో ఒకటిగా కలిసిపోయి, వారి ప్రేమాభిమానాలతో హాయిగా జీవిస్తూ ఉంటాయి.

అటువంటి పెంపుడు జంతువులు, పక్షులు అకస్మాత్తుగా ఇళ్లనుంచి కనిపించకుండా ఎటో వెళ్లిపోయినా, రోడ్లమీద సంచరించే సమయంలో ఎవరైనా వాటిని తస్కరించినా, వాటిని పెంచేవారి మానసిక స్థితి ఏవిధంగా ఉండేదీ మనం ఊహించగలం. ఆ కుటుంబ సభ్యులందరికీ, అంతవరకూ ప్రేమతో పెంచుతున్న జీవాలు కనుమరుగు కావడంతో కలిగే వేదన దుర్భరంగా ఉంటుంది.

పెంపుడు జంతువులకు మెటల్‌ట్యాగ్స్, కాలర్స్, బెల్టులు వేసినప్పటికీ అవి కొన్నాళ్లకు తుప్పుపట్టి పోతాయి. లేదా వాటిపై అక్షరాలు కనపడకుండా ఉంటాయి. అందువలన అవి ఎటువంటి సమాచారాన్నీ అందించలేవు. అనేకసార్లు కొన్ని పరిస్థితుల్లో ఆయా జంతువులకు వాటివలన గాయాలు కూడా ఏర్పడతాయి. ఈ విషయాలను దృష్టిలో పెట్టుకొని, ప్రస్తుతం మైక్రోఛిప్ ఐడెంటిఫికేషన్ సిస్టమ్ (యమ్ ఐ యస్) వాడుకలోకి వచ్చింది. ఈ ప్రక్రియ వలన ఇళ్లకు దూరమైన పెంపుడు జంతువులు, పక్షులు తిరిగి ఆయా ఇళ్లకు క్షేమంగా చేరుకొని కుటుంబ సభ్యులందరికీ ఆనందాన్ని చేకూరుస్తాయి. పశువుల హాస్పటల్లో వైద్యులు ఒక అతిచిన్న కంప్యూటర్ చిప్‌ను ఇంజక్షన్ సూది ద్వారా జంతువుల చర్మంలోకి ప్రవేశపెడతారు. ఆ కంప్యూటర్ చిప్ మీదున్న నెంబర్ డేటా




బేస్ పైన నమోదు అవుతుంది. ఇందువలన ఆ జంతువుగానీ, పక్షిగానీ ఎక్కడ ఉన్నదీ సులభంగా వాటి యజమానులకు, పశువుల ఆస్పత్రిలోని డేటాబేస్ ద్వారా తెలుస్తుంది.

జీవాల శరీరంలో వున్న చిప్ పాడవడంగానీ, పోవడంగానీ జరగదు. ఇందువలన ఆ జంతువుగానీ, పక్షిగానీ బతికున్నంత కాలం, దానికి రక్షణ ఏర్పడుతుంది. ✤

# చతుర

సంపుటి: 27

సంచిక: 8

320వ సంచిక

సెప్టెంబర్: 2004

గలగలపారే సెలయేరులా నిండుగా సాగిపోయే ఆమె జీవితంలో హఠాత్తుగా తుఫాను భీభత్సం ఎదురయింది. ప్రాణానికి ప్రాణంగా ప్రేమించే భర్త కాళ్ల పారాణీ ఆరకుండానే అసువులు బాశాడు. దిక్కుతోచని స్థితిలో వున్న ఆమె తండ్రి ప్రోత్సాహంతో బయటి ప్రపంచంలోకి అడుగుపెట్టింది. అందానికి అందం, అణుకువా గల ఆమెకి ఎదురయిన అనేక అనుభవాలు ఆమె జీవన నౌకను ఏ దిశకు మళ్లించాయి?

మోడువారిన ఆమె జీవనోద్యానంలో వసంత మేఘాలే వర్షించాయో, వడగాడ్పులే విరుచుకుపడ్డాయో... అన్న ప్రశ్నలకు సమాధానమే కొలపల్లి ఈశ్వర్ రచన

**'మేఘన'** ఈనెల చతుర సమగ్ర నవల.



అతని కళ్లలోకి గారంగా చూస్తూ అంది మేఘన "నేను జాబ్ చెయ్యాలనుకుంటున్నానండీ"

అడగరానిదేదో అడిగినట్టు అదోలా చూశాడు రఘు ఆమె వంక. "ఉహూ... నాకిష్టం లేదు" ఆ సమాధానం ఆమె వూహించనిది.

తనేమడిగినా కాదనని భర్త ఇప్పుడిలా మాట్లాడటం చిత్రంగా అన్పించిందామెకు.

"ఎందుకిష్టంలేదు? " అడిగింది.

"ఇష్టం లేదంతే"

"మీ గురించి నేనేమో అనుకున్నా. ఆడపిల్ల జాబ్‌చేస్తే సహించలేని ఆర్డినరీ మగాడేనా మీరుకూడా" అంది కోపంగా చూస్తూ.

"అట్లాగే అనుకో. అయినా నేను ఎక్స్‌ట్రా ఆర్డినరీ అని ఎప్పుడూ చెప్పలేదే నీకు"

"చెప్పలేదు కానీ చేసి చూపిస్తున్నారుగా"

"ఏం చేసి చూపించానో" గమ్మత్తుగా పెదవి విరిచి భుజాలు ష్రగ్ చేశాడు.

"ప్రతిరోజూ నాకోసం స్వీట్స్ తెస్తారు"

"మన ఫస్ట్‌నైట్ రోజు చెప్పావుగా స్వీట్సుంటే ఇష్టమని. అందుకే తెస్తున్నా"

"ఒక్కరోజు కూడా పూలు తేవడం మర్చిపోరు"

"ఇవాళ మర్చిపోతాలే"

మేఘన నవ్వబోయి తమాయించుకుంది. తనిప్పుడు హాట్‌గా వుంది. స్వీట్‌గా నవ్వకూడదు.

"అడక్కుండానే సినిమాలకీ, షికార్లకీ తీసికెళ్తారు. అవసరం లేకపోయినా చీరెలు కొని పెడతారు"

"బాప్‌రే... ఇవన్నీ తప్పులా? " అమాయకంగా పెట్టాడు ముఖం.

ఆ ఫేషియల్ ఎక్స్‌ప్రెషన్స్ చూడగానే మేఘన కోపం హుష్‌కాకీ అయిపోయింది. గుండెల్లో వూరిన ప్రేమ కళ్లల్లో పొంగుతుండగా చటుక్కున అతని నుదుటి మీద ముద్దుపెట్టుకుంది.

"ఇవన్నీ తప్పులుకాదు. బంగారు పూలతో పూజచేసుకున్న స్త్రీకి మాత్రమే లభించే వరాలు"

"వరాలిచ్చేది దేవుళ్లు కదమ్మాయ్" చిలిపిగా నవ్వాడు.

"మీరు దేవుడే... నా దేవుడు" మేఘన కూడా నవ్వి అతని షర్ట్ బటన్స్ విప్పుతూ పెడుతూ తిరిగి గారాలు పోయింది. "అందుకే ఇంకొక్క 'వరం ప్లీజ్"

"ఉద్యోగ వరం తప్ప" అన్నాడు యముడు సావిత్రితో 'అదియు నీ పతి ప్రాణంబుదక్క' అన్న స్టయిల్లో.

పోయిన కోపం తిరిగి మేఘన ముఖం మీద వాలింది. "నేను ఉద్యోగం చేసి తీరతాను"

"ఒప్పుకునే ప్రసక్తే లేదు" అతనూ అదే రేంజ్‌లో అన్నాడు.

"చేస్తే ఏం చేస్తారు? "

"చెయ్యి అప్పుడు తెలుస్తుంది"

"ఏం ఇంట్లోంచి తరిమేస్తారా? విడాకులిచ్చేస్తారా? " నిరసనగా చూసింది.

"ఆ రెండూ చెయ్యను" నిర్లక్ష్యంగా చెప్పాడు.

"ఇంకేం చేస్తారూ? "

"నా ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి ఇంట్లో కూర్చుంటాను. మిస్టర్‌పెళ్లాం సినిమాలో రాజేంద్రప్రసాద్‌లా వంట చేస్తాను"

"కేరేజ్ కూడా సర్దిస్తారా? " ఆశగా అడిగింది.

"నేను సీరియస్‌గా అంటున్నా" ముఖం ముడుచుకుని అన్నాడు.

"నేనూ సీరియస్సే" మేఘన కూడా ముఖాన్ని ముడుచుకుంటూ అంది.

"ఆఫీస్‌కి టైమైంది. నే వెళ్తున్నా" రఘు చెప్పులేసుకున్నాడు.

"నేనూ ఇంటర్వ్యూకి వెళ్తున్నా. ఎప్పటికొస్తానో తెలీదు. తాళం పక్కింటి రోజారాణికిచ్చి వెళతాను. కలెక్ట్ చేసుకోండి"

"ఆ పని చేశావో తాళం కలెక్ట్ చేసుకోవాల్సిన అవసరమే లేదు నాకు"

"మరి? "

"పక్కింట్లోనే వుండిపోతా"

"ఐసీ" ఆమె సీరియస్‌గా చూసింది. "రోజారాణి వాళ్లాయన, కరణం మల్లీశ్వరికి దగ్గరి బంధువన్న విషయం మీకు తెలీదేమో! ఫర్ యువర్ కైండ్ ఇన్‌ఫర్మేషన్ వంద కేజీల బరువును చిటికెన వేలితో ఎత్తుతాడంట"

"నిన్న వాళ్లావిడకి పిండి రుబ్బిపెడుతూ చిటికెన వేలు పచ్చడి చేసుకున్నాట్టలే. నేవెళ్తున్నా" రఘు వెళ్లిపోయాడు.

మేఘన పళ్లు పటపటకొరుక్కుంది. గిన్నెలు ఎత్తెత్తివేస్తూ కిచెన్ సర్దింది.

"నిజంగానే ఇంటర్వ్యూకి వెళ్తాను. ఏం చేస్తాడో చూస్తాను" అనుకుంటూ చకచక చీరె మార్చుకుంది. జడల్లుకుంది. టేబుల్ సొరుగులోంచి ఇంటర్వ్యూకి ఆహ్వానిస్తూ వచ్చిన కవర్ అందుకుంది.

బయటకొచ్చి ఇంటికి తాళం పెట్టి పక్క పోర్షన్ కాలింగ్‌బెల్ నొక్కింది.

రోజారాణి తలుపు తీసి "మీరా రండి రండి" అంది.

"బయటకెళ్తున్నా. మా వారొచ్చేలోపు రాగలనో లేదో, తాళాలు మీ దగ్గర ఇద్దామని" అంటూ మేఘన తాళం చెవులు రోజారాణికిచ్చింది.

"అలాగే" రోజారాణి నవ్వుతూ అంది.

"వస్తాను" వెనక్కి తిరిగిన మేఘనకు 'తాళం కలెక్ట్ చేసుకోవల్సిన అవసరం లేదు నాకు. పక్కింట్లోనే వుండిపోతాను' అన్న రఘు మాటలు చప్పున గుర్తుకొచ్చాయి.

ఒక్కసారి ఆగి రోజారాణి వంక చూసింది. ఆమె ఇంకా నవ్వుతూనే వుంది గుమ్మంలో నుంచుని. ఆ నవ్వులో ఏదో సమ్మోహనాస్త్రం వున్నట్టుగా అన్పించింది.

"చూడండి రోజాగారు! మావారు తాళం చెవికోసం వస్తే లోపలికి రండీ, కాఫీ తాగండీ అంటూ మర్యాదలేం చెయ్యకండి. నేరుగా తాళం ఇచ్చేసి పంపించెయ్యండి" నిర్మొహమాటంగా అంది మేఘన.

"అదేంటలా అంటున్నారు? " తెల్లబోయి చూసింది రోజారాణి.

"అబ్బే ఏం లేదు. మా వారికి గేస్ట్రిక్‌ట్రబుల్. కాఫీ, టీలంటే కక్కుర్తిపడతారు. తాగి ఆనక నా ప్రాణం తీస్తారు" చెప్పింది మేఘన.

రోజారాణి తెల్లముఖంలోకి కలరొచ్చింది.

"వస్తానండీ" అంటూ వెళ్లిపోయింది మేఘన.

ఆటో పట్టుకుని స్టాండర్డ్ పేకేజింగ్స్ ఆఫీసు ముందు దిగి ఆటోఫేర్ ఇవ్వటం కోసం పర్స్‌లో చెయ్యిపెట్టబోతున్న మేఘన "నేనిస్తాలే" అన్న స్వరం విని ఉలిక్కి పడి చూసింది.

రఘు పర్స్‌లోంచి డబ్బు తీసి ఫేర్ చెల్లించి తిరిగి పర్స్‌ని జేబులో పెట్టుకుంటుండగా మేఘన జేవురించిన ముఖంతో అంది "మరీ ఇంత కుళ్లుమోత్తనమా"

రఘు ఓ నవ్వు నవ్వాడు.

"పెళ్లాల్ని ఉద్యోగం చెయ్యొద్దంటూ ఇంటి దగ్గరే కట్టడి చేసే మగాళ్లని చూశాంగాని ఇట్లా ఆఫీసుల దగ్గర కూడా ప్రత్యక్షమై అరడిపెట్టేవాళ్లని మిమ్మల్నే చూస్తున్నా"

రఘు ఈసారి పకపక నవ్వేశాడు.

"మరీ అంతలా నవ్వకండి. నేను ఉద్యోగం చేసి మీకు రిపార్టీ ఇచ్చేరోజు తప్పకుండా వస్తుంది" రోషంగా చూసింది.

"ఒట్టి రిపార్టీనేనా? టీపార్టీ ఇవ్వవా? "

ఫస్ట్‌ఫ్లోర్‌లో వున్న ఆఫీస్ మెట్లు చరచర ఎక్కుతున్న మేఘన ఆగి వెనకాలే వస్తున్న రఘుకేసి ప్రశ్నార్థకంగా చూసింది.

రఘు అటూ ఇటూ చూసి చుట్టుపక్కలెవరూ లేరని నిర్ధారణ చేసుకున్నాక మేఘన చేతిని తన చేతిలోకి తీసుకుని పెదవులతో సున్నితంగా స్పృశించి చెప్పాడు. "ఇక్కడ మేనేజర్ నాకు ఫ్రెండే. నీకే ఉద్యోగం వచ్చేలా రికమండ్ చేస్తానని నాకు ప్రామిస్ చేశాడు"

సచిత్ర విచిత్రం

# అందాల కళాకృతులు



కొబ్బరి చెట్టు కల్పవృక్షంలాంటిది. ఆ చెట్టులోని ప్రతిభాగం మనకు ఉపయోగపడేదే. కొబ్బరి పీచునుంచీ, వాటి చిప్పల నుంచీ ఎన్నెన్నో వస్తువులు తయారవుతున్నాయి. అనేక అందమైన బొమ్మలు, గృహోపకరణములు తయారవుతున్నాయి. చెయ్యి తిరిగిన కళాకారులు రూపకల్పన చేసిన కళాఖండాలు తిలకించండి. కొబ్బరి నుంచి కుక్కీస్, చిప్స్, పాలు, జామ్, సాస్, వెనిగర్, మిల్క్‌పౌడరు తయారవుతున్నాయి. ఇక ఆరోగ్యప్రదాయిని అయిన కొబ్బరి నీరు వుండనే వుంది. ఈ పై బొమ్మలన్నీ ఆ చెట్టుకి సబంధించిన వాటితో తయారయినవే.

"మరి ఇంటి దగ్గర అట్లా.."

"దటీజాల్ ఎ స్వీట్ డ్రామా. నువ్వు సరదాగా జాబ్ చెయ్యాలనుకుంటున్నావా సీరియస్‌గా డిసైడ్ అయిపోయావా తెల్సుకోవడానికి ప్లేచేసిన ట్రిక్"

"బాగుంది మీ మాటల్ని సీరియస్‌గా తీసుకుని మా వారికిష్టం లేదులే అని సరిపెట్టుకుని నేనింట్లో కూర్చుని వుంటే" చిరుకోపంగా చూసింది.

"ఓ అరగంట చూసి నేనే వచ్చి పికప్ చేసుకొచ్చేవాడ్ని"

కృతజ్ఞత నిండిన కళ్లతో చూస్తూ "యు ఆరె స్వీట్ హజ్బెండ్" అంది.

"నో...నో... ఐయామ్ నాటెట్ డయాబెటిక్" అన్నాడు.

ఇద్దరూ నవ్వుకుంటూ పైకి వెళ్లారు.

మేఘన అదృష్టమో రఘు రికమండేషన్ ఫలితమోగాని ఆమెకు ఉద్యోగం వచ్చింది.

ఇంటర్వ్యూ అయిపోయిన వారం తర్వాత స్టాండర్డ్ పేకేజింగ్స్ నుంచి అప్పాయింట్‌మెంట్ ఆర్డర్ అందుకుందామె.

ఇంకో రెండు రోజుల్లో తను జాయిన్ కావాలి. ఆర్డర్ వచ్చిన రోజు మేఘన అత్తగారు పాయసం చేసి చుట్టుపక్కల అందరికీ పంచింది. రఘు తమ్ముడు రెండు సినిమా టికెట్స్ తెచ్చి అన్నకీ వదినకీ ప్రెజంట్ చేశాడు.

ఇద్దరూ సినిమాకెళ్లి హోటల్లో భోంచేసి వచ్చారు. ఆ రాత్రంతా ఆనందమే.

ఆ మర్నాడు రఘు ఆఫీసుకి బయల్దేరుతూ అన్నాడు మేఘనతో "ఇన్నాళ్లూ పివిలియన్ సీటు ఖాళీగా వుంది. రేపట్నుండీ తమరు అలంకరిస్తారేమో? "

"డైలీ నన్ను డ్రాప్ చెయ్యడం మీకు వీలు పడుతుందా! మా ఆఫీస్ అటూ మీ ఆఫీస్ ఇటూ కదా? మీకు దూరం అవుతుందేమో"

"నో ప్రాబ్లెమ్. నీకోసం ఇంకో లోకానికి రమ్మన్నా వస్తాను. ఈ దూరం ఒక లెక్కా"

అంటూ స్కూటర్ స్టార్ట్ చేసుకుని వెళ్లిపోతున్న రఘుని చూస్తూ "హౌలక్కీ ఐయామ్" అనుకుంది.

అయితే ఆమెకు తెలీదు రఘు వెనక స్కూటర్ మీద కూర్చుని వెళ్లి ఉద్యోగం చేసే భాగ్యం తనకు లేనేలేదని. అసలా ఉద్యోగమే తను చెయ్యబోవడంలేదని.

అట్లా వెళ్లిన రఘు... రఘు...

"అక్కా ఎనిమిదైంది. తలుపు తెరువ్"

శ్రీలత తలుపుమీద దబదబ బాదడంతో తుళ్లిపడి లేచింది మేఘన.

గతంలోకి వెళ్లిపోయి వర్తమానంలోని దుఃఖాన్ని మర్చిపోయి జ్ఞాపకాల తోపుల్లో పచార్లు చేస్తున్న ఆమె మనసు అయిష్టంగా ఆమె శరీరాన్ని చేరుకుంది.

మేఘన లేచి తలుపు తీసింది. "అమ్మ లేపమంది. నువ్వివాళ ఆఫీస్‌కెళ్లాలటకదా" అంది శ్రీలత తనామెనెందుకు లేపిందో సంజాయిషి ఇస్తూ.

నిట్టూర్చింది మేఘన.

ఆనాడు చెయ్యాలనుకున్న ఉద్యోగం ఒక కమ్మని కల. ఈనాడు చెయ్యబోతున్న ఉద్యోగం కఠిన వాస్తవం.

కల కరిగిపోయింది. కఠిన వాస్తవం ఎదురైంది.

తప్పదు. ఈ చేదునిజాన్ని ఎదుర్కోక తప్పదు. ఆమె తన కళ్లలోని అశ్రువులు చెల్లెలికి కనబడకుండా దాచుకుంటూ బాత్‌రూమ్‌వైపు వడివడిగా వెళ్లిపోయింది.

★ ★ ★

"నేనిక బయల్దేరుతాను నాన్నా"

నరసింగరావు వాల్ క్లాక్‌కేసి చూసి "తొమ్మిది దాటింది. రాహుకాలం పోయింది. నువ్విక బయల్దేరొచ్చమ్మా" అన్నాడు.

మేఘన తండ్రి ముఖంలోకి చూసింది. విషాదంతో కూడిన ఓ నవ్వు ఉబికిరాబోతుంటే ఆమె అతికష్టంమీద ఆ నవ్వుని ఆపుకుంది. ఆ నవ్వు చూస్తే ఆయన బాధపడ

తాడు, కొద్దిగా ఇబ్బందిగా ఫీలవుతాడు.

"వెళ్లొస్తానమ్మా" తల్లికి చెప్పింది.

"ఆc! .... జాగ్రత్త" అంది సుగుణమ్మ.

తన బిడ్డకి ఎంత వయసొచ్చినా తల్లికి మాత్రం లోకం తెలియని పసిపాపగానే కని పిస్తుందేమో! అందుకే బయటకెళ్లే తన బిడ్డకు ప్రతి తల్లి జాగ్రత్తలు చెపుతూనే ఉంటుంది.

"అలాగేనమ్మా" అన్నాక, చెల్లి ముఖంలోకి చూసి తలాడించి బయటకు నడిచింది.

వీధిగేటు దాటి రోడ్డు మీదకు అడుగుపె డుతుంటే ఒకవిధమైన ఉద్విగ్నత మనసును కుదిపేసింది.

ఏ మనిషికయినా ఉద్యోగంలో చేరే మొదటిరోజు ఇంట్లోనుండి బయల్దేరగానే ఇలాంటి ఫీలింగ్ సహజమేనేమో!

ఉద్యోగ పర్వంలో మొదటిరోజు చాలా ఆనందం. కాసింత టెన్షన్, ఎంతో కొంత ఉత్సాహం కలగలసిపోయి గుండె వేగం పెంచుతాయి.

మేఘన రెండు వీధులు దాటి సెంటర్‌కి చేరుకుంది.

అక్కడున్న బస్టాప్ దగ్గర బస్సుకోసం ఎదురుచూస్తూ ఓ నిముషం నిలబడ్డాక యధాలాపంగా చుట్టూ పరిశీలనగా చూసింది.

బస్టావ్‌లో సుమారు యాభైమంది వరకూ జనం ఉన్నారు. యాభైమందిలో ఇంచుమించు పాతికమంది ఆడవాళ్లే ఉన్నారు. ఆ పాతికమందిలో కనీసం ఇరవై మంది వర్కింగ్ ఉమెన్ అయి ఉంటారని ఖచ్చితంగా చెప్పొచ్చు. వాళ్ల భుజాలకు వేలాడుతున్న బ్యాగులు, రిస్ట్‌వాచ్‌కేసి చూసుకుని అంతలోనే చిరాకుగా రోడ్డుమీ దకు సారించే చూపులు, టైమయిపోతుండ డంతో వాళ్ల ముఖాలలో కదలాడే కంగారు, వాళ్ల గురించి చెప్పకనే తెలిసిపోతుంది.

తను ఎన్నోసార్లు ఈ బస్టావ్‌లో నిలబ డింది కాని ఎప్పుడూ తనింత పరీక్షగా చూడలేదు. ఈ సిటీలో... ఈ సిటీలో మగాళ్లతో సమాన సంఖ్యగా ఆడవాళ్లు ఉద్యోగాలు చేస్తున్నారని తనకిప్పుడే తెలి సింది.

ఆలోచనలను కట్‌చేస్తూ ఆమె ఎక్కవల సిన బస్సు వేగంగా వచ్చి బస్టాప్‌కి కాసింత దూరంలో వెళ్ళి ఆగింది.

అందరితో పాటే తనూ పరుగెత్తుకెళ్లి గుంపులో దూరి, బస్సులో చొరబడింది.

జనం మధ్య ఇరుక్కుపోయి వత్తిడి, తొక్కిడి మధ్య అదోరకమైన నరకాన్ని అను భవిస్తూ పావుగంట ప్రయాణం సాగించాక దిగాల్సిన స్టాప్ వచ్చింది.

మేఘన బస్సు దిగింది.

బస్టాప్‌కి వందగజాల దూరంలోనే కనిపి స్తోందా కమర్షియల్ కాంప్లెక్స్.

ఆ కమర్షియల్ కాంప్లెక్స్ థర్డ్‌ఫ్లోర్‌లోనే తను ఉద్యోగంలో చేరబోతున్న ఆ ఆఫీసు.

రాహుల్ కంప్యూటర్స్ ప్రైవేట్ లిమిటెడ్.

మేఘన బస్టాప్ నుండి అటు నడిచింది.

లిఫ్ట్‌లో థర్డ్‌ఫ్లోర్ చేరుకున్నాక ఆ ఆఫీసు లోకి అడుగుపెడుతుంటే అదోరకమైన ఫీలింగ్ మనసును కుదిపేయసాగింది.

ఆమె డోర్ తెరుచుకుని లోపలికి అడుగు పెట్టింది.

లోపల దృశ్యం రిచ్‌గా, అందంగానూ వాతావరణం ఆహ్లాదంగానూ అనిపిం చాయి.

సెంట్రల్లీ ఎయిర్‌కండీషన్డ్ ఆఫీసు అది. హాలు ముందు రిసెప్షన్ ఉంది. ఆమె ముందున్న టేబుల్ మీద మూడు ఫోన్‌లు న్నాయి. హాలుని సగభాగం పార్టిషన్ చేస్తే, ఆ సగ భాగంలో మూడు క్యాబిన్‌లు న్నాయి.

మేఘన రిసెప్షనిస్ట్ ముందుకెళ్ళి ఇంగ్లీ షులో చెప్పింది. "గుడ్‌మార్నింగ్. నా పేరు మేఘన. నిన్న మీ సెంట్రల్ ఆఫీసులో జరి గిన ఇంటర్వ్యూలో అకౌంట్స్ అసిస్టెంట్‌గా సెలక్టయ్యాను. ఇది నా అపాయింట్‌మెంట్

ఆర్డర్"

రిసెప్షనిస్ట్ ఆ అపాయింట్‌మెంట్ ఆర్డర్ అందుకోకుండానే చెయ్యి ముందుకు సాచి పలికింది. "కంగ్రాచ్యులేషన్స్ మేడమ్... నా పేరు దీపిక. గ్లాడ్‌టు మీట్ యూ"

"థాంక్యూ"

దీపిక మేఘనతో ఓ క్యాబిన్ చూపిస్తూ చెప్పింది. "మీరు ఆ క్యాబిన్‌లోకి వెళ్లండి. అక్కడ అకౌంటెంట్‌గారున్నారు"

"సీ యూ" అన్నాక మేఘన అటువైపు నడిచింది.

క్యాబిన్ డోర్ కొద్దిగా తెరిచి లోపలికి తొంగిచూస్తూ "మే ఐ కమిన్ సార్" అంది.

తల వంచుకుని పనిచేసుకుంటున్న ఆ వ్యక్తి తలెత్తి చూసి "యస్ కమిన్" అన్నాడు.

ముప్ఫయ్ ఏళ్లలోపే ఉంటాయి అతడికి. మనిషి అందంగా, హుందాగా ఉన్నాడు.

అతడు తనకేసి ప్రశ్నార్థకంగా చూస్తుండడం చూసి ఆమె రిసెప్షనిస్ట్‌తో చెప్పిన మాటలనే ఇక్కడా వల్లెవేసింది. "నమస్తే సార్! నా పేరు మేఘన. నిన్న మీ సెంట్రల్ ఆఫీసులో జరిగిన ఇంటర్వ్యూలో అకౌంట్స్ అసిస్టెంట్‌గా సెలక్టయ్యాను. నన్ను ఈ బ్రాంచ్‌లో జాయిన్ కమ్మని పంపించారు. ఇదిగోండి నా అపాయింట్‌మెంట్ ఆర్డర్"

తన చేతిలోనుండి అపాయింట్‌మెంట్ ఆర్డర్ అందుకుంటున్నప్పుడే అతడు తనను పరిశీలనగా చూడడం మేఘన గమనించింది.

అతడు అపాయింట్‌మెంట్ ఆర్డర్ అందుకుని దాన్నోసారి పరిశీలనగా చూశాక ఆమెతో చెప్పాడు "కూర్చోండి"

"థాంక్యూ సార్" ఆమె అతడికి ఎదురుగా కూర్చుంది.

అతడు కుర్చీలో వెనక్కు వాలాడు. "మీ పేరు మేఘన"

"అవును సార్"

"శ్రీమతి మేఘన... అంటే మీరు మేరీడ్ అన్నమాట"

"యస్ సార్"

అతడు చిన్నగా నవ్వి, పలికాడు "కానీ... యునో, మీరలా కనిపించరు తెలుసా? మీకు పెళ్ళయిందంటే నమ్మరెవ్వరూ"

ఆ టాపిక్ ఇష్టంలేనట్టు ఆమె పెదవులు బిగపట్టింది.

కానీ అతడు ఊరుకోలేదు. "మీవారేం చేస్తుంటారు? "

మేఘన దీర్ఘంగా నిశ్వసించింది. అయిష్టమే అయినా చెప్పక తప్పదన్నట్టు తలొంచుకునే చెప్పింది. "మావారు... మావారు లేట్..."

అతడు పెదవులు బిగపట్టడంతో పాటు, వెంటనే కళ్లు మూసుకున్నాడు.

మూడు సెకనుల తర్వాత టేబుల్‌మీదకు వంగి "సారీ... సారీ మేడమ్" అన్నాడు అపాలజిటిక్‌గా.

"ఇట్సాల్‌రైట్ సార్"

"ఓకే" ఇక అసలు విషయంలోకి వచ్చేస్తున్నట్టు అతడు భుజాలెగరేశాడు "అన్నట్టు నా పేరు చెప్పనేలేదుకదూ? ఐయామ్ ధీరజ్... ధీరజ్‌కుమార్"

ఆమె తలెత్తి విష్‌చేస్తున్నట్టు నవ్వింది.

"మీకు వర్క్ ఎక్స్‌పీరియన్స్ ఉందా? "

"లేదు సార్! ఇదే నా మొదటి ఉద్యోగం"

"ఐసీ..." అతడు కొద్దిసేపు సాలోచనగా తన అరచేతికేసి చూసుకున్నాడు. "నో ప్రాబ్లమ్! నేను డే బుక్ మెయిన్‌టెనెన్స్, లెడ్జర్ పోస్టింగ్, ఎంట్రీలు వేయడంలాంటివి చెపుతాను. కామర్స్ స్టూడెంట్‌గా మీరు తెలుసుకున్నదానికి, ఇక్కడ ప్రాక్టికాలిటీకి కొంత తేడా ఉంటుంది. ఆ తేడా-అర్థమయిపోతే నో ప్రాబ్లమ్... వర్క్ చాలా ఈజీగా చేసుకుంటూ వెళ్ళిపోవచ్చు"

"అలాగే సార్"

మేఘనకు తన పక్కనే ఉన్న మరో టేబుల్ చూపించి, అక్కడ కూర్చోమని చెప్పాక

అతడు కొన్ని ఫైల్స్ తీసుకొచ్చి ఆమె ముందుంచాడు. ఓ అకౌంట్ బుక్ ఇచ్చి "ఫైల్స్‌లోని బిల్స్‌ని ఇందులో ఎంట్రీచేయండి" అన్నాడు.

ఆమె తలాడించి పనిలో లీనమయిపోయింది.

★ ★ ★

"ఏమ్మా! ఎలా ఉంది ఉద్యోగం?"

ఆ రాత్రి నలుగురూ భోజనాలకు కూర్చున్నప్పుడు అడిగాడు నరసింగరావు.

"బాగుంది నాన్నా"

"అయినా నువ్వు ఉద్యోగం చేస్తే తప్ప ఇల్లుగడవని పరిస్థితేం కాదు కదా మనది. 'ఉద్యోగం నీకెందుకమ్మా' అంటే నువ్వు వినవు. నీ పట్టుదలే నీది" ఆయన కాస్త నిష్ఠూరంగానే పలికాడు.



సుగుణమ్మ ప్లేట్స్‌లో అన్నం వడ్డిస్తోంది. ఆ తండ్రీ కూతుళ్ల సంభాషణలో జోక్యం చేసుకోవడం ఆమెకిష్టంలేదు.

శ్రీలత కూడా తండ్రికేసీ, అక్కకేసి చూపులు మార్చి చూస్తోందేతప్ప మరేం మాట్లాడలేదు.

మేఘన నవ్వింది. "మనకు ఇల్లుగడవని పరిస్థితి అని నేను ఉద్యోగం చేయాలనుకోవడం లేదు కదా నాన్నా. ఇంట్లో ఉంటే ఏమీ తోచడంలేదనే నేను ఉద్యోగానికి వెళ్తున్నాను. ఆ విషయం నేను మీకు ముందే చెప్పాను"

"సర్లే కానివ్వు" ఆయన తలొంచుకుని భోంచేయసాగాడు.

మేఘన మనసులోనే నవ్వుకుని తనూ కంచంలో చెయ్యిపెట్టింది.

భోజనాలయ్యాక మేఘన వంటఇంట్లో కాసేపు తల్లికి సహాయం చేసింది. సుగుణమ్మ అంట్ల గిన్నెలు తోముతుంటే ఆమె ఆ గిన్నెలన్నీ తుడిచి సర్దిపెట్టేసింది.

ఆ తర్వాత కాసేపు టి.వి. చూశాక "నాకు నిద్రొస్తోందమ్మా, నేనిక వెళ్ళి పడుకుంటాను" అంది తల్లితో.

"వెళ్ళి పడుకో" చెప్పింది సుగుణమ్మ.

మేఘన బెడ్‌రూమ్‌లోకెళ్లింది.

అప్పటికే బెడ్‌మీద ఓ అంచున శ్రీలత పడుకుని ఉంది. ఎంత గాఢనిద్రలో ఉందో ఏమో నైటీ పిక్కలపైదాకా తొలగిపోయి ఉన్నా తనకేం తెలియనట్లే.

'నిద్రపోతే చాలు, దీనికి వళ్లే తెలియదు' చిన్నగా విసుక్కుని చెల్లెలి నైటీని సర్దింది.

తలుపుకు లోపల గడియవేసి, బెడ్‌లైట్ ఆన్‌చేసి బెడ్‌మీదకు ఒరిగింది.

వెంటనే నిద్రలోకి జారుకోవాలని ప్రయత్నించిందిగాని, ఆమెకు నిద్రరాలేదు.

ఆమె కళ్లముందు రఘు కదలాడాడు.

కేవలం ఆరు నెలల్లోనే జీవితకాలం తలచుకునే అనుభూతిని మిగిల్చి అంతలోనే కలలా కరిగి కనుమరుగయిపోయిన ర...ఘు!

డిగ్రీ పూర్తయిన నాలుగు నెలలకే మేఘనకు పెళ్లయిపోయింది.

రఘు సిటీలోనే ఓ ప్రైవేట్ కంపెనీలో పర్చేజ్ ఆఫీసర్‌గా పనిచేసేవాడు.

నిజానికి వాళ్లు అంత స్థితిపరులేంకాదు.

రఘు తండ్రికి చిన్న ఫోటోస్టూడియో

ఉంది. దానిమీద ఖర్చులన్నీపోను నెలకో నాలుగయిదు వేలు మిగిలేవేమో! సిటీలో నాలుగయిదు వేలంటే చాలీచాలని సంపాదనకిందే లెక్క.

అతడి తల్లి ఇల్లు కదలని ఇల్లాలు. తమ్ముడు కంప్యూటరేదో నేర్చుకుంటున్నాడు.

రఘు ఉద్యోగంలో చేరాకే ఆ ఇంట్లో ఎంతో కొంత మార్పొచ్చింది. చాలీచాలని స్థితినుండి సంతృప్తిగా గడుపుకునే స్థితికి వచ్చారు వారు.

అలాంటి ఆ కుటుంబ ఆర్థిక పరిస్థితికన్నా వాళ్లు మంచి వాళ్లు అని తెలిసి నరసింగరావు తన కూతురిని ఇవ్వడానికి అంగీకరించాడు. తనకు గవర్నమెంట్ ఉద్యోగం, సొంత ఇల్లు ఉన్నాయి. ఆర్థికంగా ఎలాంటి ఇబ్బందీ లేదు. ఇక ఉన్నదల్లా ఇద్దరు కూతుర్లే. తనేం చేసినా ఎంత సంపాదించినా అది ఆ బిడ్డలిద్దరికోసమే.

అందుకే ఆయన ఘనంగా పెళ్ళిచేయడమే కాదు. కూతురి వెంట బాగానే పంపాడు. ఆరు నెలలపాటు ఆనందంగానే సాగింది. ఆ తర్వాతే జీవితం అనుకోని మలుపు తిరిగింది.

ఆరోజు ఉదయం ఎప్పటిలానే ఆఫీసుకు స్కూటర్మీద వెళ్లాడు రఘు.

మరో గంట తర్వాత పోలీసులు తమ ఇంటిని వెతుక్కుంటూ వచ్చారు.

"మీరు మావెంట ఓసారి హాస్పిటల్‌కి రావలసి ఉంటుంది"

"ఎందుకు? "

"ఓ స్కూటర్‌ని వెనుకనుండి వస్తున్న బస్సుకొట్టింది. స్కూటర్మీద ఉన్న మనిషి స్పాట్‌లోనే చనిపోయాడు.

అప్పటికీ అనుమానం. అదినిజం కాదనే నమ్ముతోంది. అందుకే తడబడే గొంతుతో తను అడిగింది.

"స్కూటర్ నెంబరెంత? "

పోలీసు చెప్పాడు.

అంతే... అప్పుడు మొదలయిన ఏడుపు హాస్పిటల్‌వరకూ ఆగనేలేదు.

హాస్పిటల్ చేరాక రక్తపుమడుగులో ఉన్న రఘుని చూశాక ఏడుపు ఉధృతమయింది.

కాని కనిపిస్తున్న దృశ్యం సత్యమని నమ్మడానికి మనస్కరించడంలేదు. అసలు ఆలోచించలేని విధంగా మనసు మొద్దుబారిపోయింది.

మేఘన ఏడ్చి ఏడ్చి అలాగే స్పృహ తప్పి పడిపోయింది.

ఆమె నిస్తేజంగా చూస్తూ అచేతనంగా కూర్చుండిపోయినప్పటికీ, అయిన వాళ్లందరూ వచ్చి జరగాల్సిన కార్యమంతా జరిపించసాగారు.

పదకొండోరోజు ఆమె మెడలోని తాళిని తెంచి బొట్టును చెడిపేశారు.

జరగాల్సిన తంతు మొత్తం జరిగిపోయాక, మేఘన తననుతాను అద్దంలో చూసుకుని విరక్తిగా నవ్వుకుంటూ అనుకుంది 'నేనిప్పుడు వితంతువును'

మరో పదిహేనురోజుల తర్వాత నరసింగరావు ఆ ఇంటికొచ్చి రఘు తండ్రితో చెప్పాడు. "ఇది జీవితం. మనం అనుకున్నట్టే అన్నీ జరగవు. అమ్మాయి తన జీవితాంతం ఈ ఇంట్లో ఆనందంగా గడిపేయగలదనుకున్నాను. కాని ఇలా ఒంటరిగా మిగిలిపోయి మీకు భారంగా మారిపోగలదని అనుకోలేదు"

"భారమేముందిలే బావగారూ నా కూతురు నా ఇంట్లో ఉన్నట్లయితే నేను అది భారమని అనుకోలేను కదా? "

"మంచి మనసుతో మీరు అలా అనుకున్నప్పటికీ మేఘన ఈ ఇంట్లో ఉండడం కన్నా, మా ఇంటికి తీసుకెళ్లడమే మంచిదని నేననుకుంటున్నాను"

"అమ్మాయికి పెళ్ళి చేయాలనే ఆలోచనేమయినా ఉందా? "

"ప్రస్తుతానికి అలాంటిదేమీ లేదు"

తన మామగారు మంచి మనసుతోనే

చెప్పాడు. "అమ్మాయిది చాలా చిన్నవయసు. జీవితంలో ఏ సుఖాలూ అనుభవించకుండానే తనను దురదృష్టం వెన్నాడింది. అయితే అది ఆమె దురదృష్టం అని మనమూ ఊరకుండిపోనక్కర్లేదు. పరిస్థితులు తారుమారయితే ఆడపిల్లకు రెండో పెళ్ళి అన్నది ఇప్పుడు చాలా సర్వసాధారణ విషయమయిపోయింది. అసలు పరిస్థితులు తారుమారు కానక్కర్లేదు. మొగుడితో చిన్న గొడవలొచ్చినా, ఆడపిల్ల గొడవపడి పుట్టింటికెళ్ళిపోయి, విడాకులు తీసేసుకుని మరొకడిని పెళ్ళి చేసేసుకుంటోంది. ఇలాంటి కాలంలో మేఘనకు మరో పెళ్ళిచేయడం గురించి మీరు ఏమాత్రం సంశయించకండి. అలా జరిగితే అది మాకూ ఆనందకరమేగాని ఏవిధంగానూ బాధాకరం మాత్రంకాదు. ఆలోచించండి. మీ అమ్మాయిని మీ ఇంటికి తీసుకెళ్ళండి"

ఆయన తనను పుట్టింటికి పంపడానికి వప్పుకున్నందుకో, విశాల హృదయంతో 'మళ్ళీ పెళ్ళి చేయమని చెప్పినందుకో' కారణమేదయినా తన తండ్రి కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి. రెండు చేతులెత్తి నమస్కరించాడు.

అలా పెళ్ళయిన ఆరు నెలలకే పసుపు, కుంకుమలకు దూరమై తను పుట్టింటికి చేరింది.

అయితే అమ్మా, చెల్లెళ్ళు పోరుపెట్టడంతో నుదుట కాటుకతో చిన్న చుక్క పెట్టుకోవడం అలవాటు చేసుకుంది.

ఎవరయినా కొత్తవాళ్ళు తమింటికొస్తే తనను చూసి "మీ పెద్దమ్మాయికి పెళ్ళెప్పుడు చేస్తారు?" అని అడగడం తను ఎన్నోసార్లు వింది.

అలా అనడం తను విన్నప్పుడు తనకు విరక్తితో కూడిన నవ్వు ముంచుకొచ్చేది. ఆ నవ్వు పెదవులు దాటకుండా జాగ్రత్తపడేది.

★ ★ ★

గతం గుర్తుకు రావడంతో మేఘన పెదవులు బిగపట్టింది. కళ్ళల్లో నీళ్ళు సుడులు తిరిగాయి. చెరువునిండితే కట్టలు తెంచుకుని ప్రవహించిన వర్షపు నీరులా ఆమె కన్నీరు కనురెప్పలు దాటి బుగ్గలమీదకు జారింది.

నాలుగుగోడలమధ్య ఉండడంతో, తనను ఎవరూ గమనించడంలేదని తెలియడంతో ఆమె ఆ కన్నీటిని తుడుచుకునే ప్రయత్నం చేయలేదు.

జీవితం చాలా చిత్రమయింది. ఊహాకందని మలుపులతో ముందుకు సాగుతూ ఉంటుంది.

తను తనెప్పుడయినా అనుకుందా. తన జీవితం ఇలాంటి మలుపు తిరుగుతుందని! ఏ ఆడపిల్లయినా తన భర్తతో జీవితాంతం కలిసి జీవించడం గురించే కలలు కంటుంది గాని, ఆ బంధం అర్ధంతరంగా తెగిపోతే ఏమిటి? అన్న ఆలోచనే చేయదు. పెళ్ళికి ముందు ఏ ఆడపిల్లకూ ఆ ఆలోచన రాదు... రాలేదు.

కాని ఇది జీవితం. ఊహించనివి జరగడమే కదా జీవితమంటే?

కన్నెపిల్లగా ఊహించని సంఘటనలు, పెళ్ళయ్యాక జరుగుతూ ఉంటాయి. అందమైన మొగుడిని కోరుకుంటే అనాకారి దొరకచ్చు. మంచి అలవాటున్న భర్త కావాలనుకుంటే తాగుబోతు, తిరుగుబోతు రావచ్చు. తనను సంతోషపెట్టగలిగే శ్రీవారిని ఆశిస్తే శాడిస్ట్‌తో జత కలవచ్చు.

కన్నెపిల్ల ఊహలన్నీ నిజం కావడం చాలా అరుదైన విషయం. అయితే ఆడపిల్ల పెళ్ళయ్యాక వాస్తవంతో కొంతవరకూ రాజీ పడిపోతుంది. అందువల్లే అలాంటి పరిస్థితుల్లో తననుతాను మార్చుకోవడమో లేదా అతడినే ఎంతోకొంత మార్చుకోవడానికి ప్రయత్నం చేయడమో చేస్తుంది.

అయితే అన్నింటికన్నా ఊహించని, జరగకూడని పరిణామం సుఖసంతోషాలతో గడుపుతున్న సంసార జీవితంలోనుండి ఆ భర్తను శాశ్వతంగా కోల్పోవలసి రావడం...

అంతకుమించిన దారుణం, బాధాకరమయిన విషయం మరొకటి ఉండదు.

కానీ ఆ దారుణం, బాధాకరమైన విషయం అప్పుడప్పుడూ ఎంతోకొంత శాతం ఆడపిల్లలకు అనుభవంలోకి వస్తూ ఉంటుంది.

కొద్ది దశాబ్దాలక్రితం ఈ దేశంలో ఆడపిల్ల జీవితంలో ఇలాంటి దారుణ సంఘటన ఎదురైతే తల బోడి చేసి, తెల్లబట్టలు కట్ట బెట్టి ఆమెను అనాకారిగా మార్చేవారు. ఆమెమీద ఎన్నోరకాల ఆంక్షలు విధించే వారు. కార్యార్థమై వెళుతున్నప్పుడు వితం తువు ఎదురు రాకూడదు. ఆమె పెళ్ళిళ్ళు, పేరంటాళ్ళకు వెళ్ళకూడదు. పసుపు, కుంకు మలకు, పూలకు శాశ్వతంగా దూరంగా ఉండాలి. ఒకవేళ పొరపాటున అటునిటు తిరిగితే తల చెడినదానివి ఓ మూల కూర్చోక, ఈ తిరుగుళ్ళేమిటి? అని సూటి గానే అడిగేవారు. వాళ్ళ వయసు కోరికలను దారుణంగా అణిచివేసేవారు.

నేడు తన కడుపున పుట్టిన బిడ్డలతో కలిసి కాలం గడపాలని ఉన్నా, తప్పనిసరి పరిస్థితులలో ఇష్టమున్నా లేకపోయినా 'హోమ్ ఫర్ ఏజ్డ్'లలో చేరుతున్న వృద్ధుల లాగే నాటి వితంతువులు నదీతీరాలలోని వితంతు ఆశ్రమాలలో, సన్యాసినుల మఠా లలో చేరిపోయి జీవితాన్ని నిస్సారంగా, నిరుత్సాహంగా గడిపేసేవారు.

సంఘసంస్కర్తలైన ఎందరో మహానుభా వుల పుణ్యాన పరిస్థితులలో మార్పొచ్చింది. మనిషి ఆలోచనా దృక్పథం మారింది.

నేడు వితంతువులకు నాడు ఉన్నటువంటి విపరీత పరిస్థితులు లేవు. వాళ్ళు విపత్కర పరిణామాలు ఎదుర్కోవలసిన అవసరమూ లేదు.

నేటి వితంతువుకు తల బోడి కానవసరం లేదు. తెల్లచీర చుట్టుకోనక్కరలేదు. ఆమె ఓ మూల కూర్చోకుండా కోరిన చోటుకు వెళ్ళచ్చు తన కాళ్ళమీద తను నిలబడడం కోసం ఉద్యోగమూ చేయచ్చు.

మరి చిన్నవయసులోనే భర్తను కోల్పో యిన ఓ ఆడపిల్లగా తన జీవితం ఎలా సాగబోతోంది?

ఏమో! అది కాలమే చెప్పాలి.

★ ★ ★

తల వంచుకుని అకౌంట్స్ చేసుకుంటూ ఉంటే "హలో మేడమ్" అని వినిపించ డంతో మేఘన తలెత్తి చూసింది.

ఎదురుగా ధీరజ్‌కుమార్.

ఆమె అతడికేసి ప్రశ్నార్థకంగా చూసింది.

"మీరు పనిలో పడితే ప్రపంచమే మర్చి పోయేలా ఉన్నారే" అతడు నవ్వాడు.

తనూ నవ్వక తప్పదు కాబట్టి మేఘన కూడా నవ్వింది.

"ఏంలేదు, నాకు చాయ్ తాగాలనిపించి బాయ్‌ని రమ్మని ఇంటర్‌కమ్‌లో చెప్పాను. మీరూ తాగుతారేమో రెండు చాయ్ తెమ్మని చెపుదామని..."

"నాకు వద్దండి"

"అలవాటులేదా? "

"ఉదయం ఒకసారి, సాయంత్రం ఇంటికె ళ్ళాక ఒకసారి కాఫీ తాగుతాను. అంతే..."

"మంచి అలవాటు" అన్నాక ఆమె మాట్లా డకపోవడం చూసి అతడే అన్నాడు. "మీరనే కాదుగానీ, చాలామంది ఆడవాళ్ళు ఎంతసేపు పనిచేసినా రిలాక్స్‌గానే ఉంటూ ఉంటారు. అదే మా మగాళ్ళు ఓ గంటసేపు పనిచేస్తే చాలు తల దిమ్ముగా ఉంది చాయ్ తాగాలనో, సిగరెట్ తాగాలనో అంటారు"

ఆమె నవ్వుతూ ఉండిపోయింది.

"సార్! పిలిచారట..." ఆఫీస్‌బాయ్ లోప లికొస్తూ అన్నాడు.

"ఆ... వెళ్ళి చాయ్ పట్రా"

"అలాగేసార్" ఆఫీస్‌బాయ్ వెళ్ళిపో యాడు.

"ఒకే... అదేదో సామెత చెప్పినట్టు నేను పనిచేయడం మానేయడమే కాకుండా

మిమ్మల్ని కూడా పనిచేసుకో కుండా చేయడం న్యాయం కాదు. మీరు పనిచేసుకోండి మేడమ్"

మేఘన తలొంచుకుని పని చేసుకోసాగింది.

ఆఫీస్ బాయ్ రావడం, అత డికి చాయ్ కప్పు అందించడం తెలుస్తూనే ఉన్నా ఆమె తలెత్తిచూసే ప్రయత్నం చేయలేదు.

అయితే చాలా సేపటి తర్వాత తలెత్తి యధా లాపంగా అటుచూస్తే ధీరజ్ కుమార్ తనకేసే చూడడం కనిపిం చింది.

ఎప్పుడైతే తను అతడికేసి చూసిందో, అప్పుడే అతడు తడబడి తల వంచుకుని తన పనిలో పడిపోయాడు.

ధీరజ్ కుమార్ తనకు తెలియకుండానే తనను పరిశీలిస్తున్నాడన్న విషయం తెలి యగానే మనసులో అదో రకమైన ఇబ్బంది కదలాడింది.

ఆరోజు ఆమె లంచ్‌బాక్స్ తెచ్చు కుంది. ఆ మధ్యాహ్నం లంచ్ బాక్స్ తీసుకుని దీపికను కలి సింది.



"ఈరోజు లంచ్‌బాక్స్ తెచ్చుకున్నట్టున్నారు? "

"ఆ... నిన్నంటే మొదటిరోజు కాబట్టి ఇక్కడ వసతులు ఎలా ఉన్నాయోనను కుంటూ తెచ్చుకోలేదు. ఈరోజునుండి రోజూ బాక్స్ తెచ్చుకుంటాను"

"రండయితే, భోంచేద్దాం" దీపిక తన లంచ్‌బాక్స్ తీసుకుని సీట్లోనుండి లేచింది.

ఇద్దరూ ఎదురుగా ఉన్న ఓ క్యాబిన్‌లోకి వెళ్ళారు.

"ఇది రెస్ట్‌రూమ్. మన శ్టాఫ్‌లోని లేడీస్ అందరూ ఇక్కడే భోంచేస్తారు. మగాళ్ళు మాత్రం ఎవరి టేబుల్‌దగ్గర వాళ్ళు కూర్చుని లాగించేస్తారు"

'దీపిక చాలా హుషారైన అమ్మాయి' మనసులోనే అనుకుంది మేఘన.

ఇద్దరూ బాక్స్‌మూతలు తీస్తున్నప్పుడు మేఘన అడిగింది. "మన శ్టాఫ్‌లోని లేడీస్ అందరూ ఇక్కడే భోంచేస్తారు అని అన్నారు. కానీ ఇంకా ఎవ్వరూ ఇక్కడికి రాలేదేం? "

"వాళ్ళంతా కంప్యూటర్ పాపలుకదా, సాధారణంగా వేళాపాళలు మర్చిపోతుంటారు. కంప్యూటర్ ప్రోగ్రామ్స్‌చేస్తూ, లంచ్ చేసే ప్రోగ్రామ్ మళ్ళీ చేయొచ్చులే అనుకుంటారు. అయినా వాళ్ళంతా ఇక్కడికే వస్తారని గ్యారంటీలేదు"

"ఏం? " మేఘన కళ్ళెత్తి ఆమె ముఖంలోకి చూసింది.

"బాయ్‌ఫ్రెండ్‌నుండి ఫోన్ వస్తే వాళ్ళు బయటకెళ్ళిపోయి ఏ రెస్టారెంట్‌లోనో కూర్చుని పిజ్జానో, ఐస్‌క్రీమో తిని వచ్చేస్తుంటారు"

మేఘన నవ్వలేదు. తలొంచి బాక్స్‌లో చెయ్యిపెట్టేసింది.

అయితే మరో పది నిమిషాలకే ఇద్దరు అమ్మాయిలు క్యాబిన్‌లో కొచ్చి దీపికను చూస్తూ "హాయ్" అన్నారు.

"హలో రండి. ఇప్పుడే మీ గురించే చెపుతున్నాను"

"ఏమని? " వచ్చిన వాళ్ళిద్దరిలో కాస్తబొద్దుగా ఉన్న అమ్మాయి అడిగింది.

"ఏముంది. మా వాళ్ళకి బోయ్‌ఫ్రెండ్స్ ఫోన్ చేయకపోతేనే ఇక్కడికి వస్తారని చెప్తున్నాను" నవ్వింది దీపిక.

"యూ నాటీ..." అన్నాక వాళ్ళిద్దరూ అప్పుడే మేఘనవైపు చూశారు.

"ఈమె...? " అంటూ వాళ్ళిద్దరిలో సన్నగా, పొడవుగా ఉన్న అమ్మాయి మేఘనకేసి ప్రశ్నార్థకంగా చూసింది.

"పరిచయంలేదుకదూ? ఈమె మేఘన. నిన్ననే మన ఆఫీసులో అకౌంట్స్ అసిస్టెంట్‌గా జాయినైంది" చెప్పాక మేఘనవైపు తల తిప్పింది దీపిక. "వీళ్ళిద్దరూ కంప్యూటర్ ప్రోగ్రామర్స్. ఈమె రేణుశ్రీ, తను కావ్య"

వాళ్ళిద్దరూ మేఘనను చూస్తూ పలకరింపుగా "హలో" అన్నారు.

మేఘన కూడా "హలో" అంది.

వాళ్ళిద్దరూ టేబుల్‌కి ఎదురుగా కూర్చున్నారు.

"మీరెక్కడుంటారు? "

మేఘన చెప్పింది.

"అయితే మీరు మాకు చాలా దగ్గర్లోనే ఉన్నారన్నమాట" అంది రేణుశ్రీ.

"మీరుండేది? "

"శ్రీనగర్ కాలనీ... మీకు ఆపోజిట్ కాలనీలోనే"

"ఇంకేం...సాయంత్రం ఇద్దరూ కలిసే వెళ్ళిపోవచ్చు" నవ్వుతూ చెప్పింది దీపిక.

"అంతేకదా మరి"

"మీరిద్దరూ ఒకే ఏరియావాళ్ళు కాబట్టి మీరిద్దరూ కలిసిపోయి మమ్మల్ని కాస్త దూరంగా పెట్టేస్తారేమోకదూ? " కావ్య అంది.

"యా..." అంది రేణుశ్రీ.

నలుగురూ నవ్వుకున్నారు.

మేఘన లంచ్ అవర్ తర్వాత తన క్యాబి

న్‌లోకెళ్తే ధీరజ్‌కుమార్ కాస్త అసహనంగా కనిపించాడు.

ఆమె వెళ్ళి తన సీట్లో కూర్చుని పనిచేసుకోసాగింది.

కొద్దిక్షణాల తర్వాత అతడు తలతిప్పి ఆమెవైపు చూసి బలవంతంగా నవ్వుతూ అడిగాడు.

"ఆడ స్టాఫ్ అందరూ కలిసిపోయి భోంచేశారా? "

అతడిది బలవంతపు నవ్వు అన్న విషయం అర్థమవుతోందిగానీ, ఆ మాటల్లో వ్యంగ్యం ఉందో లేదో మాత్రం తెలియలేదు.

అందుకే తన పెదాలమీదకు నవ్వు తెచ్చుకుని తల నిలువుగా ఆడించింది.

"వాళ్ళకంటే సెపరేట్‌గా క్యాబిన్‌లేదు. మీకు ఈ క్యాబిన్ ఉందికదా, మీరెందుకు అక్కడికెళ్ళి భోంచేయడం? "

అది సూచనో, సలహానో లేక కమాండింగో అర్థంకాలేదు.

మనసులో భావం ఏదయినా తను బయటపడడం ఇష్టం లేకపోయింది. "నాకు భోంచేయడానికి ఇక్కడ బాగానే ఉందిగానీ, ఆడాళ్లం నలుగురం కలిస్తే మాట్లాడుకుంటూ భోంచేయచ్చుకదా అని"

ఇంకా మాట్లాడితే అది అతి జోక్యం అనిపిస్తుందని గ్రహించాడేమో, ధీరజ్‌కుమార్ భుజాలెగరేశాడు. "ఓకే... మీకెక్కడ రిలాక్స్ అనిపిస్తే, అక్కడే భోంచేయండి. కాకపోతే ఈ క్యాబిన్‌లో కూర్చునయినా భోంచేయచ్చని చెపుతున్నానంతే"

"థాంక్యూ సార్"

అంతకుమించి మరేమనాలో అర్థంకాలేదు.

కొద్దిక్షణాలు అసహనంగా గడిపాక అతడు తన పనిలో మునిగిపోయాడు.

కానీ ఆమె మాత్రం ఆ క్యాబిన్‌లో భోంచేయకూడదని అప్పుడే నిర్ణయించుకుంది.

★ ★ ★

స్కూటీ స్టార్ట్‌చేస్తూ చెప్పింది రేణుశ్రీ మేఘనతో

"ఎక్కండి"

హఠాత్తుగా రఘు కళ్ళముందు మెదిలాడు. తనకప్పట్లో స్టాండర్డ్ పేకేజింగ్స్‌లో జాబ్ రావడం... తను జాయిన్ అవడానికి ముందురోజు రఘు ఆఫీసుకెళ్తూ రేపటి నుండీ తనను ఆఫీస్‌లో డ్రాప్ చేస్తానని చెప్పడం..., అట్లా చెప్పివెళ్ళిన గంటకే...

"హేయ్... వేరార్ యూ? ఎక్కండి"

కంటి కొసల్లోంచి రాలబోతున్న కన్నీటిచుక్కను రేణుశ్రీ కంటబడకుండా మేనేజ్ చేస్తూ కర్చీఫ్‌తో అద్దుకుంది.

"నేను బస్‌లో వెళ్తాను"

రేణుశ్రీ గలగలా నవ్వింది. "దీనికంత మొహమాటమెందుకండీ బాబూ. ఇద్దరి గమ్యం ఒక్కటే కనుక లిఫ్ట్ ఇస్తానన్నాను. ఇందులో నేను చేసే శాక్రిఫైసంటూ లేదు"

"అబ్బే అదికాదు"

"నో ఎక్స్‌ప్లనేషన్స్... కమాన్ యార్"

మేఘన ఇక సాగదియ్యడం బాగుండదని ఎక్కి కూర్చుంది రేణుశ్రీ వెనక.

"ఫస్ట్ డే... జాబ్ ఎలా వుంది? " అడిగింది రేణుశ్రీ.

"ఓకే... నో ప్రాబ్లమ్"

"ధీరజ్‌సర్... గుడ్ గై. అతన్తో ఏ ప్రాబ్లమ్సూ వుండవ్. అసలా సెక్షన్‌లో పడినవాళ్ళు రియల్లీ లక్కీ"

"అంత మంచివాడా? " అసంకల్పితంగా అనేసింది.

"నేనెన్నిసార్లు లైనేశానో. ఒక్కసారీ లైన్లోకి రాలేదు గురుడు. ప్రవరాఖ్యుడే అనుకో. వరూధిని ఎక్కడుందో పాపం"

రేణుశ్రీ ఫన్నీగా మాట్లాడుతుంటే మేఘన నవ్వుకుంటోంది తనలోతను.

అప్పుడు హఠాత్తుగా ఆపింది రేణుశ్రీ స్కూటీ రోడ్డువారగా.

ఆమె ఎందుకలా ఆపిందా అనుకుంటూ మేఘన ముందుకు చూసింది.

రేణుశ్రీ స్కూటీకి ఎదురుగా ఆగి వుంది ఓ బైక్.

సన్నగా పొడవుగా వున్నాడా బైక్‌వాలా.

షేడ్‌గ్రే కలర్ జీన్స్ ప్యాంటులోకి బ్లాక్ కలర్ షర్ట్ టక్‌చేసి వున్నాడు. ఎడంచేత్తో గాగుల్స్ పట్టుకుని బ్రాస్‌లెట్ ధరించిన కుడిచేత్తో మాటిమాటికీ క్రాఫ్ సవరించుకుంటున్నాడు.

"హాయ్ రేణూ" అన్నాడు.

"హాయ్" అంది రేణుశ్రీ.

"నిన్న కనబడలేదే. ఎంత అప్‌సెట్ అయ్యానో తెలుసా? "

"నిన్ను అప్‌సెట్ చెయ్యాలనే కనబడలేదు" రేణుశ్రీ అల్లరిగా నవ్వింది.

"నేనేడిస్తే నీకు సరదానా? "

"కాదామరి... నేను ఏడ్చాను. ఈ లోకం నవ్వింది.. నేను నవ్వాను, ఈ లోకం ఏడ్చింది" రేణుశ్రీ నిజంగానే పాడేసింది.

"ఆ పాత పాటలాపు తల్లీ" అతను రెండు చేతులూ జోడించాడు.

"ఓల్డీజ్ గోల్డ్" రేణుశ్రీ కళ్ళెగరేసింది.

మేఘనకు అసహనంగా అన్పించింది. ఆమె ఉనికే పట్టనట్టు వాళ్ళిద్దరూ అలా మాట్లాడుకోవడం ఇబ్బందిగా అనిపించింది.

దిగి వెళ్తానని చెప్పాలన్పించిందిగానీ సభ్యత కాదేమోనని తటపటాయించింది. 'చూద్దాం ఇంకో రెండు నిముషాలు' అనుకుంది.

ఆలోచనలో పడిన మేఘనకు రేణుశ్రీతో ఆ యువకుడు "షల్ వియ్ హేవ్ ఎ కప్ ఆఫ్ కాఫీ? " అనడం విన్పించింది.

రేణుశ్రీ ఇప్పుడుకాదులే అని స్కూటీ స్టార్ట్ చేస్తుందేమో అనుకున్న మేఘన ఆశ నిరాశే అయింది.

"నాట్ ఎ కప్ ఆఫ్ కాఫీ. టు కప్స్ ఆఫ్ కాఫీ" అన్న రేణుశ్రీ, సడన్‌గా ఏదో గుర్తొచ్చినదాన్లా మేఘనవైపు చూసి తిరిగి ఆ యువకుడితో నవ్వుతూ అంది "త్రీ కప్స్ ఆఫ్ కాఫీ" అని.

అతనప్పుడే మేఘనను గమనించినవాడిలా ఎగ్జయిట్ అయిపోతూ, "ఓ... సారీ! మిమ్మల్నసలు నోటీస్ చెయ్యనేలేదు. బైదీబై ఐ యామ్ వంశీకర్" అంటూ కరచాలనంకోసమన్నట్టు చేతిని చాపాడు.

మేఘన ఆ చేతివంక ఒక్కక్షణం తటాపటాయిస్తున్నట్టుగా చూసి రెండుచేతులూ జోడించి,

"నమస్తే... నా పేరు మేఘన" అంది.

"ఓ...నైస్ నేమ్. గ్లాడ్ టు మీట్ యూ" అంటూ చేతిని వెనక్కి తీసుకుంటూ అన్నాడు.

"నా బోయ్ ఫ్రెండ్" చెప్పింది రేణుశ్రీ మేఘనతో సంతోషంగా.

"నేను వెళ్తాను రేణూ... మీరు కాసేపు మాట్లాడుకుని వస్తారేమో" అంది మేఘన గొంతు పెగల్చుకుని.

"నథింగ్ డూయింగ్. మీరివాళ మాతో కాఫీ తాగుతున్నారు" రేణుశ్రీ మొండిగా అంది.

"కాఫీనా... ప్లీజ్ ఇంకోసారి"

ఆమె "కాఫీనా? " అనడాన్ని ఇంకోలా అర్థం చేసుకున్నాడో లేక జోవియల్‌గా అనాలని అన్నాడోగానీ వంశీకర్ "పోనీ ఐస్‌క్రీమ్, ఆరెంజ్ జ్యూస్, బాదంఖీర్..." అంటూ మేఘనవైపు రిక్వెస్టింగ్‌గా చూశాడు.

"అబ్బెబ్బే... నా ఉద్దేశ్యం అదికాదు"

"నో ఆర్గ్యూమెంట్, మీరు మాతో వస్తున్నారు" అతను చొరవగా అని బైక్ స్టార్ట్‌చేశాడు.

"ప్రీతీ రెస్టారెంటేకదూ" అడుగుతూనే స్కూటీ స్టార్ట్ చేసింది రేణుశ్రీ మేఘన వద్దంటున్నా పట్టించుకోకుండా.

తను జాబ్‌లో చేరిన రెండోరోజు. సహజంగానే ఇంట్లో అందరూ తనకోసం ఎదురు చూస్తుంటారు. ఆలస్యమైతే కంగారుపడతారు.

"ప్లీజ్ రేణుగారూ..."

"మీతో మొదటిరోజు స్నేహాన్ని సెల్రబ్రేట్ చేసుకోనివ్వండి. జస్ట్ ఇట్స్ మేటరాఫ్ ఆఫె నవర్. కాదనకండి"

రేణుశ్రీ స్వరంలోని రిక్వెస్ట్ ఇక మేఘన్ని మాట్లాడనివ్వలేదు. పైగా స్కూటీ రన్నింగ్‌లో వుంది. ఆమె ఆపితేకానీ తను దిగే ప్రసక్తేలేదు. ఆమె ఆపే మూడ్‌లో అసలే లేదు.

తప్పని తలనొప్పిలా భరిస్తూ ఊరుకుంది. ఓ పది నిమిషాల్లో ముగ్గురూ ప్రీతి రెస్టారెంట్‌లోని కార్నర్ టేబుల్ దగ్గర సెటిలైపోయారు.

రేణుశ్రీ మేఘన పక్కన కూర్చుంది. ఇద్దరికీ ఎదురుగా వంశీ సెటిల్ అయ్యాడు.

వాళ్ళిద్దరూ మేఘన ఉనికినే మర్చిపోయి మాట్లాడుకుంటున్నారు.

"గిరి ఎలా వున్నాడు?" అంటోంది రేణుశ్రీ.

"శైలూ హేండిచ్చిందిగా... మొన్న రెస్టారెంట్లో కలిసినప్పుడు బరస్ట్ అయ్యాడు నా దగ్గర"

"మనీష్ మత్‌లబ్ ఏంటో?"

"కొత్త గర్ల్‌ఫ్రెండ్ దొరికిందిగా. రేష్మాని పూర్తిగా వదిలేశాడు"

"పాపం రేష్మా" రేణుశ్రీ జాలిగా అంది.

బేరర్ ఆర్డర్ అడిగితే ముందు కాఫీ అన్న వాళ్ళు కాస్తా ఐస్‌క్రీమ్ చెప్పారు.

"నో ప్రాబ్లమ్ విత్ రేష్మా. అప్పుడే ఇంకో బోయ్ ఫ్రెండ్‌ని పట్టేసింది. 'జై' అని మార్వాడీ కుర్రాడు"

బేరర్ మూడు ఐస్‌క్రీమ్ కప్స్ తెచ్చి ముగ్గురికీ సర్వ్‌చేశాడు.

అప్పుడు ఇద్దరూ ఒకేసారి స్పృహలోకి వచ్చినట్టు మేఘనతో "మాటల్లోపడి మిమ్మల్ని మర్చేపోయాం. ప్లీజ్ హేవిట్" అన్నారు.

ఏం మాట్లాడాలో, ఎవరితో మాట్లాడాలో తోచని మేఘనకి ఐస్‌క్రీమ్ తినడమే ఒక వ్యాపకంలా తోచింది. బుద్ధిగా కప్ ముందుకు లాక్కుని కొద్దికొద్దిగా తినసాగింది.

ఒకటిరెండు మాటలు మేఘనతో మాట్లాడాక ఇద్దరూ మళ్ళీ కబుర్లలో పడ్డారు.

తలొంచుకుని ఐస్‌క్రీమ్ తింటున్న మేఘన ఓసారి తలెత్తి వాళ్ళకేసి చూసి స్టన్నయిపోయింది. వాళ్ళు ఐస్‌క్రీమ్స్ తింటున్నారు. అయితే ఎవరిది వారుకాదు, ఒకరికి ఇంకొకరు తినిపించుకుంటున్నారు.

రేణుశ్రీ తన స్పూన్ అతని నోటికి అందిస్తుంటే అతను తన స్పూన్ ఆమె నోటికి అందిస్తున్నాడు.

వీళ్ళు... వీళ్ళు స్నేహితులా, ప్రేమికులా?

ఒకవేళ ప్రేమికులైతే మాత్రం ఒకరి ముందు అంత నిర్లజ్జగా ఒకరికొకరు తినిపించుకుంటూ చాలా కేజువల్‌గా మాట్లాడుకుంటున్నారు.

ఎందుకో..., మేఘనకి సిగ్గనిపించింది. త్వరత్వరగా ఐస్‌క్రీమ్ తినడం పూర్తిచేసి "రేణుశ్రీ... ఇఫ్ యు డోంట్ మైండ్. నేను వెళ్తాను. మా అమ్మానాన్నా ఎదురుచూస్తుంటారు" అంది మేఘన.

"ఓ... సారీ పదండి వెళ్దాం" రేణుశ్రీ లేచి బిల్ చెల్లిస్తున్న వంశీతో, "బై వంశీ. వి విల్ మీట్ టుమారో" అంది.

"బై..." అతను రేణుశ్రీ చేతిని గట్టిగా పట్టుకుని ఊపాడు. పెదాలకు ఆనించుకునికానీ వదల్లేదు.

మేఘన లేచి అతను చేతిని చాచకముందే నమస్తే చెప్పి బయటపడింది.

రేణుశ్రీ స్కూటీ స్టార్ట్ చేశాక అడిగింది మేఘన "పెళ్ళెప్పుడు?" అని.

కావాలనే అడిగిందామె అంత క్లోజ్‌గా వుండడానికి కారణం అదే అయ్యుంటుందనుకుంటూ.

"పెళ్ళా? ఎవరికి?" రేణుశ్రీ ఆశ్చర్యంగా అడిగింది.

"అదే... మీకూ, వంశీకర్‌గారికీ..."

ఒక్క పెట్టున నవ్వింది రేణుశ్రీ.

"మై గాడ్. వంశీ నా ఫ్రెండ్. జస్ట్ ఫ్రెండ్. మా మధ్య వుండేది కేవలం స్నేహం"

మేఘన ఇక మాట్లాడలేదు.

కొంచెందూరం వెళ్ళాక రేణుశ్రీనే అంది, "మీ సందేహం నాకర్థమైంది. మా క్లోజ్‌నెస్ మీకు చిత్రంగా వుందికదూ? "

మేఘన అవునని చెప్పాలనుకుందిగానీ చెప్పలేదు. మేఘన మౌనం చూసి రేణుశ్రీ అంది, "నౌ ఎ డేస్ ఇది నేచురల్ మీకు అనుభవం లేనట్టుంది"

మేఘన మౌనంగా నిర్ణయించుకుంది, "ఇక మీదట, తను బస్‌లోనే ఇంటికి రావాలి"



"అదిగో అక్కడే మా ఇల్లు. ఇక్కడ ఆపండి. దిగి వెళతాను" మేఘన అంది కాసే పటి తర్వాత.

"వాట్...! ఇక్కడ ఆపితే దిగిపోతారా. నన్ను ఇంట్లోకి ఇన్వయిట్ చెయ్యరా? "

మేఘన నొచ్చుకుంది. "సారీ... ,నా ఉద్దేశ్యం అదికాదు. ఆ సందులోకి స్కూటీ ఎందుకులే మీకు శ్రమ అని..."

రేణుశ్రీ నవ్వుతూ, "గమ్మత్తుగా అన్నా లెండి"

"అహా... అలాకాదు రండి..."

"ఇంకోసారి వస్తాను. నాకు కాస్త పనుంది. రియల్లీ..."

మేఘన ఇక బలవంతం చెయ్యలేదు. "ఓకే... బై దెన్" అంది.

రేణుశ్రీ కూడా బై చెప్పి వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిన దారివంకే చూస్తూ "వీళ్ళ ఇల్లు మా ఇంటికి ఇంకా పైనన్నమాట" అనుకుంది మేఘన.

రెండురోజుల తర్వాత లంచ్ టైమ్‌లో రేణుశ్రీ చెప్పింది "రేపు నేను ఆఫీసుకు సెలవు పెడుతున్నాను"

"ఎందుకు? " దీపిక ప్రశ్నించింది.

"రేపు నాకు పెళ్ళిచూపులు"

"నీకు పెళ్ళిచూపులు ఏర్పాటు చేస్తున్నాడంటే మీ నాన్న వట్టి అమాయకుడిలా ఉన్నాడు" అంది కావ్య.

"అదేంటి? " రేణుశ్రీ ఆశ్చర్యంగా చూసింది.

"మరో ఆరునెలలో, సంవత్సరమో ఆగితే నువ్వే నీ బోయ్‌ఫ్రెండ్‌ని తీసుకెళ్ళి 'డాడీ... ఇదుగో నా బోయ్ ఫ్రెండ్. ఇతడే నీకు కాబోయే అల్లుడు' అని చూపిస్తావుకదా. ఆయన ఇంతలోనే తొందరపడుతున్నాడంటే అమాయకుడు కాక మరేంటి? "

రేణుశ్రీ వెంటనే చెప్పింది, "ఆయన అమాయకుడు కాదు. నేనూ అంతకన్నా అమాయకురాలిని కాదు. బోయ్‌ఫ్రెండ్ బాతాఖానీకోసం, ఏదో పెళ్ళి కాకముందు మనకు మనీ పర్సులా ఉపయోగపడడం కోసం ఉంచుకోవడంతప్ప, అలాంటి వాళ్ళను పెళ్ళాడితే ఆ తర్వాత మనం జీవితాంతం బాధపడాల్సి వస్తుంది"

కావ్య తల అడ్డంగా ఆడిస్తూ "నీ రీజనింగ్ నాకేం అర్థంకావడంలేదే" అంది.

"అర్థం కానంత అంతరార్థం ఇందులో ఏముందే. ఇట్స్ వెరీ సింపుల్. బోయ్ ఫ్రెండ్ అంటే పెళ్ళికిముందు మనతో చనువుగా తిరిగినవాడు. మనకోసం ఎంతో కొంత కాలాన్ని, కేష్‌ని వృధా చేసుకున్నవాడు. ఇతడినే మన లైఫ్ పార్టనర్‌గా చేసు

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.

★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్ట్‌లోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రూ. 3000/- పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.



ఎడిటర్:

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్

హైదరాబాద్, 500 082.

# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 082 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ **మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/– ప్రథమ బహుమతి, రూ. 75/– ద్వితీయ బహుమతి, రూ. 50/– చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, పఠనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

సెప్టెంబర్ చతుర నవల **మేఘున**

చిరునామా: ______________________

______________________

______________________

______________________

కుంటే మన వీక్నెస్‌లు కొన్ని అతడికి ముందుగానే తెలిసిపోయి ఉంటాయి. కాబట్టి మన మేరీడ్ లైఫ్ అంత హేపీగా సాగదు. అంతేకాకుండా పెళ్ళికిముందు నాతో చనువుగా తిరిగిందంటే... తనది లూజ్ కేరక్టర్ అన్న అనుమానమూ కలిగే అవకాశం ఉంది. ఇంకో విషయమేమిటంటే మన బోయ్‌ఫ్రెండ్ సాధారణంగా మన క్లాస్ మేటో, కొలీగో అయివుంటాడు. మన పెద్ద వాళ్ళు మనకు తెచ్చేసంబంధం ఏ ఫారిన్ రిటర్నో అయి ఉండొచ్చు. మంచి స్టేటస్ ఉన్న మొగుడు దొరికేటప్పుడు, మనం స్టేటస్ తక్కువ బోయ్‌ఫ్రెండ్‌తో జీవితాంతం సరిపెట్టుకోవలసిన అవసరమే ముంది? "

మేఘన, దీపిక మాట్లాడలేదు గానీ, కావ్య వెంటనే అంది, "ఏయ్ రేణూ! నువ్వు మరీ మెటీరియలిస్టిక్‌గా ఆలోచిస్తున్నావే"

"తన గురించి తను ఆలోచించుకుని తన సుఖంకోసం తను కొన్ని ముందుజాగ్రత్తలు తీసుకోవడంలో తప్పేముంది? "

"నీది మరీ మితిమీరిన స్వార్ధంలా అని పిస్తూ ఉంది. బోయ్‌ఫ్రెండ్స్ అందరూ ఒకే తరహా మనస్తత్వం కలిగి ఉంటారన్నట్టు ఒక అభిప్రాయాన్ని ఏర్పరచుకుని ఒకవేళ నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నప్పటికీ అతడిని ముందుజాగ్రత్త పేరుతో వదిలించుకుని నీ సుఖాన్ని నువ్వు వెతుక్కోవడం నిజంగా చాలా దారుణమే"

రేణుశ్రీ నాలుక చప్పరించేసింది. "దారుణంలేదు, గాడిద గుడ్డూలేదు. నీలాంటి వాళ్ళెవరో కొద్దిమంది బామ్మ తరహాలో ఆలోచిస్తుంటే ఆలోచిస్తూ ఉండొచ్చుగానీ మాగ్జిమమ్ యూత్ ఇప్పుడు నా తరహా ఆలోచనలే చేస్తోంది. పెళ్ళికి ముందు జీవితం వేరు, పెళ్ళి తర్వాత జీవితం వేరు. పెళ్ళికి ముందు కాలక్షేపపు కలయికలు, పెళ్ళికి తర్వాత బాధ్యతలతో కూడిన సంసారం. ఇదీ నేటి నిజం. నేటి యూత్ ఇలాగే ఆలోచిస్తుంది. అది తెలుసుకోవడానికి కావాలంటే అడుగు. మేఘనగారు కూడా నామాటే నిజమని చెపుతారు"

ఆ ముగ్గురూ ఒక్కసారే మేఘనవైపు తలలు తిప్పారు.

మూడు జతల కళ్ళు తనమీద నిలిచి ప్రశ్నార్ధకంగా చూసేసరికి మేఘన కంగారు పడింది. తనంతవరకూ యధాలాపంగా వారి సంభాషణ వింటూ ఉందిగానీ, ఇప్పుడు తనూ అందులో పార్టిసిపేట్ చేయాల్సి వచ్చేసరికి ఏం మాట్లాడాలో తెలియలేదు.

"నాకు... నాకేం తెలియదు"

మ్యాచ్ ఫిక్సింగ్ కేసుల్లో సి.బి.ఐ. ఇంటరాగేట్ చేస్తుంటే, తప్పించుకోవాలని ప్రయత్నిస్తున్నట్టు తడబడిపోతారేంటి? మీరూ మా వయసులోనే ఉన్నారు. మనమంతా యూత్. ఇప్పుడు నేనొక ఫీలింగ్‌ని, ఆలోచనని వ్యక్తం చేశాను. మరి నా ఆలోచనా విధానం కరక్టో కాదో చెప్పండి చాలు"

మేఘన కొద్దిగా సర్దుకుంది. "చెప్పడానికి ఎంతోకొంత అనుభవం ఉండి తీరాలి. నాకు ఈ తరహా పరిస్థితిగానీ ఆలోచనావిధానంగానీ అనుభవంలోకి రాలేదు. ఎందుకంటే నేను సిటీ అమ్మాయినే అయినా ఉమెన్స్ కాలేజీలోనే చదవడంవల్ల బోయ్‌ఫ్రెండ్స్ పరిచయం కాలేదు. డిగ్రీ అయిపోగానే పెళ్ళి జరిగిపోవడంతో బోయ్‌ఫ్రెండ్స్ అన్న ఆలోచనలు కూడా నాకు రాలేదు"

ముగ్గురూ తనకేసే అదోలా చూస్తుండడం చూసి ఆమె కొద్దిగా అయోమయస్థితిలోకెళ్ళింది. తేరుకున్నాక అడిగింది.

"ఏమిటలా చూస్తున్నారు? "

"మీరు చాలా కామ్‌గా ఉంటారుగానీ, మంచి జోక్స్ కామ్‌గానే కట్‌చేస్తారు"

"అంటే? "

"అదే నేను అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పకుండా తప్పించుకోవడానికి జోవియల్‌గా నాకు పెళ్ళయిపోయిందని నమ్మబలు

కుతున్నారు చూడండి.. దాని గురించే చెపుతున్నాను..."

వాళ్ళు తనకు పెళ్ళయిన విషయం నమ్మడం లేదనుకునేసరికి నవ్వాలో, ఏడవాలో తెలియని పరిస్థితి ఎదుట నిలిచింది.

"మీరు నామాట నమ్మడంలేదుగానీ నాకు నాకు నిజంగానే పెళ్ళయింది"

"ఏయ్ కావ్యా! నా చెవులో పూలేమయినా ఉన్నాయేమో చూడు"

"నిజం రేణుశ్రీగారూ.. నాకు నిజంగానే పెళ్ళయింది"

మేఘన చెప్పిన విధానమో, లేక ఆమెకు అలా జోక్ చేయవలసిన అవసరమేముంటుందనుకున్నారో ఏమో తెలియదు. ఆ ముగ్గురి ముఖంలోనూ మార్పొచ్చింది. వాళ్లు ముగ్గురూ ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు.

"మీకు... పెళ్ళయిందా? "

"అవును"

చాలాసేపు నిశ్శబ్దం తర్వాత కావ్య అడిగింది "మీ వారేం చేస్తుంటారు? "

"ఆయన చనిపోయారు"

ఊహాతీతమయిన విషయమేదో విన్నట్టు వాళ్లు నోళ్లు తెరిచేశారు.

"సారీ" కొద్దిక్షణాల తర్వాత పలికింది రేణుశ్రీ.

"ఇట్సాల్‌రైట్"

"కాని... మిమ్మల్ని చూస్తే పెళ్లయిన అమ్మాయిలా కూడా కనిపించరు. అలాంటిది మీకు పెళ్లయిపోయి, భర్తకు శాశ్వతంగా దూరమయిపోయారంటే నమ్మశక్యం కాని నిజంలా ఉంది. ఆ నిజం చాలా బాధ పెడుతోంది"

మేఘన నవ్వి ఊరుకుంది.

ఆ తర్వాత వాళ్లు ఎక్కువగా మాట్లాడుకోలేదు.

సరదా సంభాషణలో నుంచి ఒక బరువైన నిజం బయట పడడంతో బాధకలిగి, ఏం మాట్లాడాలో తెలియని స్థితిలో మౌనాన్ని ఆశ్రయించారు.

భోజనాలు ముగిశాయి.

అందరూ ఆ క్యాబిన్‌లోంచి బయటపడ్డారు.

★ ★ ★

"ఈరోజు మీరు మరో రెండు గంటలు అదనంగా ఆఫీసులో ఉండవలసి ఉంటుంది మేఘనగారూ"

మేఘన తలెత్తి ధీరజ్‌కుమార్‌కేసి చూసింది.

"మార్చి ఎండింగ్ వచ్చేస్తోంది. మనం అకౌంట్స్ అప్‌డేట్ చేయవలసిన అవసరం ఉంది"

అతడి మాటల్లో నిజం ఉంది. అకౌంట్స్ అసిస్టెంట్‌గా మార్చి నెలాఖరుకు అకౌంట్స్ అప్‌డేట్ చేయవలసిన బాధ్యతా తనమీద ఉంది. అందులోనూ తను పనిచేసేది ప్రైవేట్ కంపెనీలో అన్న విషయం ఎట్టి పరిస్థితుల్లోనూ మర్చిపోకూడదు.

"అలాగే సార్"

మరో అర్ధగంట తర్వాత మేఘన క్యాబిన్‌లోనుండి బయటకెళ్ళి రేణుశ్రీని కలిసి ఆమెని తనకోసం వెయిట్‌చేయకుండా వెళ్ళిపొమ్మని చెప్పింది. అలాగే ఇంటికీ ఫోన్ చేసేసింది.

ఆరోజు అకౌంట్స్‌ని ఓ ఆర్డర్‌లో పెట్టేసరికి రాత్రి ఎనిమిదయింది.

"ఓ.కే... ఈరోజుకి ఎంతో కొంత వర్క్ అయింది. రేపు, ఎల్లుండి ఇలాగే ఓ రెండు గంటలు ఎక్కువగా కూర్చుంటే అకౌంట్స్ ఫైనల్ చేసేసి హెడ్‌ఆఫీసుకి పంపించేయొచ్చు"

ఆమె మౌనంగా తలాడించింది.

"రండి వెళ్దాం"

ఇద్దరూ క్యాబిన్‌లోనుండి బయటకు నడిచాక, క్యాబిన్‌కి తాళం వేశాడు ధీరజ్‌కుమార్. 'కీ'ని రిసెప్షన్ కౌంటర్‌లోని డ్రాయర్‌లో పడేశాక బయటకు నడవసాగాడు. మేఘన అతడిని అనుసరించింది. అతడు

పార్కింగ్ ప్లేస్‌లోని స్కూటర్ తీసి నడిపిం చుకుంటూ రోడ్డువరకూ వచ్చాడు.

రోడ్డు చేరేవరకూ ఇద్దరూ మౌనంగానే ఉన్నారు.

అక్కడ అతడు ఆగాడు. ఆమె కూడా ఆగిపోయింది.

ఇక ఎవరి దారినవారు వెళ్లాలని తెలిశాక ధీరజ్ కుమార్ మేఘనవైపు తిరిగాడు "మీరెటు? "

"శ్రీనగర్ కాలనీ వైపు"

"నేనిటు వెళ్లాలి... పోనీ మిమ్మల్ని ఇంటి దగ్గర డ్రాప్ చేసిరానా"

"వద్దండీ. బస్టాప్ ఎదురుగానే. ఇక్కడ బస్సెక్కితే మా కాలనీ ముందు దిగుతాను"

అతడెందుకో కొద్దిగా తటపటాయించాక పలికాడు. "ఎక్కువగా శ్రమపడడంవల్ల కాబోలు తల దిమ్ముగా ఉంది. అలా హోటల్ కెళ్ళి కాఫీ తాగి వెళ్దామా? "

కాదనలేకపోయింది ఆమె.

"అలాగే" అయిష్టంగానయినా అనక తప్ప లేదు.

ఇద్దరూ పదడుగుల దూరంలో ఉన్న హోటల్ దగ్గరకెళ్లారు.

ధీరజ్ కుమార్ స్కూటర్‌ని పార్కింగ్ ప్లేస్‌లో ఉంచి లాక్‌చేసి వచ్చాక ఇద్దరూ లోపలకు నడిచారు.

ఓ టేబుల్ కి ఎదురెదురుగా కూర్చున్నాక అతడు మేఘనను అడిగాడు "ఏం తీసుకుంటారు? "

"ఏమీ వద్దు కాఫీ చాలు"

"ఏదయినా టిఫిన్? "

"ఇంటికెళ్లి భోంచేయాలి. కాఫీ కూడా మీరు పిలిచారని వచ్చి తాగడమే తప్ప ఈ టైమ్‌లో అసలు తాగను"

అతడు నవ్వుతూ భుజాలెగరేశాక "ఓ. కే" అన్నాడు. సప్లయర్ వచ్చాక రెండు కాఫీలు ఆర్డరిచ్చాడు.

మూడు నిముషాల తర్వాత కాఫీ టేబుల్ మీదకు వచ్చింది.

కాఫీ సిప్ చేస్తున్నప్పుడు ధీరజ్ కుమార్ ఓరగా తననే పరిశీలించడం గమనించింది మేఘన. ఎందుకితడు తరుచుగా తననిలా చూస్తుంటాడు? . మనసులో అదోరకమైన ఇబ్బందికరభావం కదలాడింది.

ఎప్పుడూ కదలాడే భావమే అయినా, ఆ భావాన్ని పక్కకు నెట్టేసి పని చూసుకోవడమే తప్ప తను మరేం చేయలేదు. ఎంతగా కాలం మారినా ఆడదంటే మగాడి దృష్టిలో ఎంతోకొంత అలుసు ఉంది. ఆ భావాన్ని కాదని ఎదిరిస్తే, తాత్కాలికంగానయినా తను ఎంతో కొంత నష్టపోవడమో, ఇబ్బందిపడడమో జరుగుతుంది. కోరి కష్టాలు తెచ్చుకోవడం ఎందుకు? అందుకే ఇలాంటి పరిస్థితుల్లో చాలామంది ఆడవాళ్లు పట్టీపట్టనట్టు ప్రవర్తించి తప్పించుకుంటూ ఉంటారు.

అప్పుడే ధీరజ్ కుమార్ గొంతు వినిపించింది. "ఏమిటితడు నన్నెప్పుడూ తినేశాలా చూస్తుంటాడు, ఇతడికి మంచీ మర్యాద తెలియవా? ! ఇతడికి సంస్కారం లేదా? ... అని మీరనుకుంటున్నారు కదూ!"

తన మనసులోని మాటలు అతడి నోట వినిపించేసరికి ఆమె కొంత తడబడింది. అంటే... అంటే అతడికి ఆత్మపరిశీలనాజ్ఞానం ఉందన్నమాట. తన నడవడికను విశ్లేషించుకుంటూ, ఎదుటి వాళ్ల ఫీలింగ్స్‌ని గమనిస్తాడన్నది తెలిసిపోతూనే ఉంది. మరి ఇలాంటి వ్యక్తి అలా ప్రవర్తించడమేమిటి?

"నిజమే! నేను మీపట్ల కొంత అతిగానే అంటే ఒకవిధంగా మీరు ఇబ్బంది పడేలానే ప్రవర్తిస్తున్నానన్నది నిజం. ఆ విషయం నేను గ్రహించాను. కానీ ఇక్కడ ఒక్క విషయం. నేనీ ఆఫీస్‌లో గత రెండేళ్లుగా ఉద్యోగం చేస్తున్నాను. ఈ ఆఫీసులో కొంతమంది 'హల్లో' అంటే అల్లుకుపోయే మనస్తత్వం కలిగినవాళ్లూ ఉన్నారు. మీరు ఆ ఆడపిల్లల్లో ఏ ఒక్కరినయినా అడగండి.

ధీరజ్‌కుమార్ కేరక్టర్ ఏమిటి? అని! అతడు తలొంచుకుని తనపని చూసుకుని వెళ్ళిపోయే మనిషే తప్ప, తప్పుచేయడం కోసం ప్రాకులాడే తప్పుడు మనిషికాదని ఖచ్చితంగా చెపుతారు"

మేఘన అతడివైపు కాసింత అయోమయంగా చూడసాగింది. 'తనింతకాలం తన కోణంలోనుండే అతడిని చూసి అదోరకమైన ఇబ్బంది ఫీలవుతోందే తప్ప, నిజానికి అతడికి ఆఫీసులో మంచిపేరే ఉంది. మరి మంచివాడు తనతో మాత్రమే ఇలా ఎందుకు ప్రవర్తిస్తున్నాడు. అందులోను అతడికి తన పరిస్థితి గురించి పూర్తిగా తెలుసు. ఒకవేళ తన పరిస్థితి అతడికి అలుసుగా మారిందా? !'

ధీరజ్‌కుమార్ అన్నాడు. "ఇంతమంది పెళ్ళికాని అమ్మాయిలు నా చుట్టూ ఉన్నా, నేను మీ వెంటే ఎందుకుపడుతున్నానంటే..." అతడు గట్టిగా ఊపిరిపీల్చుకుని మెల్లగా చెప్పాడు... "మీరు...మీరంటే నాకిష్టం కాబట్టి నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను కాబట్టి"

జీవితంలో ఒకసారి ఒకే ఒక్కసారి వడివడిగా పరుగెత్తి, తనువును మరిచిపోయేలా చేసిన అనుభూతి అనుభవంలోకి వచ్చింది. ఇదిగో ఇప్పుడు తన జీవితంలో రెండోసారి అదే తరహా అనుభవం ఎదురయింది.

మేఘన గుటకలు మింగసాగింది. అయితే ఆక్షణం ఆమెకు కలిగింది ఆనందం కాదు. అలా అని అది దుఃఖమూ కాలేదు. తన స్థితి తెలిసి కూడా ఒక మనిషి తనను ఇష్టపడుతున్నాడని తెలియడంవల్ల కలిగిన స్పందన. ఆ స్థితిలోనూ ఆ స్పందనవల్ల కొన్ని కష్టనష్టాలున్నాయన్న విషయం ఆమెకు జ్ఞప్తికి ఉంది. అందువల్లే అటు ఆనందమూ, ఇటు దుఃఖమూ కలుగలేదు.

ఆమె ముఖంలోకి కొద్దిక్షణాలు తదేకంగా చూశాక అతడు నెమ్మదిగా అడిగాడు. "చెప్పండి! నేనంటే మీకిష్టమేనా? "

'ఈ ఇష్టం వెనుక ఉన్న అంతరార్థం ఏమిటి?' అన్న విషయమూ ఆలోచించ లేదు. మెదడు పనిచేయని స్థితిలో ఆమె తలొంచుకునే ఉంది.

ఇద్దరి మధ్యా కొద్దిక్షణాలు నిశ్శబ్దంగానే దొర్లిపోయాయి.

కప్పులోని కాఫీ చల్లారిపోయింది.

ధీరజ్‌కుమార్ భుజాలెగరేశాడు. "ఓ. కే. మీ మానసిక స్థితి నేను అర్థంచేసుకోగలను, మీరు వెంటనే జవాబు చెప్పనక్కర్లేదు. ఆలోచించుకోండి. బాగా ఆలోచించుకునే ఒక నిర్ణయానికి రండి"

అతడు లేవడం చూసి తనూ లేవాలన్న జ్ఞానం మాత్రమే కలిగిందామెకు.

ఇద్దరూ హోటల్‌నుండి బయటకు నడిచారు.

"ఉంటాను" అన్నాక అతడు పార్కింగ్ ప్లేస్‌లోని స్కూటర్‌ని స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోయాడు.

కలలో నడిచినట్టు మేఘన పరిసరజ్ఞానం లేకుండానే ముందుకు నడిచింది.

బస్సెలా ఎక్కిందో, ఇల్లెలా చేరిందో కూడా ఆమెకు గుర్తులేదు.

ఇంట్లో అడుగుపెడుతున్న కూతురుని చూసి సుగుణమ్మ అడిగింది "ఏమిటే అలా ఉన్నావ్? "

అప్పుడొచ్చింది మేఘన ఈ లోకంలోకి "ఏం... ఏంలేదమ్మా. బాగా అలసిపోయాను కదా, అందుకని"

"ఈ ఒక్కరోజేనా, ఇంకా రెండుమూడు రోజులు ఇలాగే ఆలస్యమవుతుందా? "

"ఇయర్ ఎండింగ్ కదమ్మా. అకౌంట్స్ ఫైనలైజ్ చేసి హెడ్ ఆఫీస్‌కు పంపించాల్సి ఉంటుంది. కాబట్టి మరో రెండుమూడు రోజులు ఆలస్యంకావచ్చు"

"సర్లే స్నానం చేసిరా"

మేఘన బ్యాగ్‌ని పక్కనపడేసి, బీరువాలోని బట్టలు తీసుకుని స్నానానికి వెళ్ళింది.

మరో పావుగంట తర్వాత సర్వం మరిచి పోయి రిలాక్స్‌డ్‌గా హాలులోని కుర్చీలో కూర్చుంది. అప్పుడే యధాలాపంగా కిటికీలో నుండి అటు చూస్తే ఎదురిల్లు కనిపించింది.

ఆ ఎదురింటి వాకిటదగ్గర నిలబడి ఉంది ముప్ఫయ్ ఏళ్లయువతి.

వెనక ఆ ఇంటి ట్యూబ్‌లైట్ వెలుగును వెదజల్లుతుంటే, ముందున్న స్ట్రీట్‌లైట్ మస కచీకటిలో ఆమె ముఖం స్పష్టాస్పష్టంగా కనిపిస్తోంది.

వెనుక గొప్ప వెలుతురు. మనిషి ముందు మసకచీకటి, ఆ దృశ్యం ఒక జీవితసత్యాన్ని ప్రతిబింబిస్తున్నట్టుగా ఉంది.

మనిషి గతమెంత గొప్పదయినా భవిష్యత్ అంధకారమయితే ఆ మనిషి జీవితంలో అసంతృప్తి మిగులుతుంది.

ఏదేమయినా ఆమె నిలిచిన తీరు, కనిపించిన దృశ్యం మేఘన కన్నార్పకుండా అటే చూసేలా చేశాయి. ఆమె ఎవరి కోసమో ఎదురుచూస్తున్నట్టు మనసులోనే అనుకుంది మేఘన.

'అయినా ఎవరామె? నిన్న చూడలేదు గాని, మొన్నటి వరకూ ఆ ఇంటికి టులెట్' బోర్డు వేలాడుతూ ఉంది. అంటే ఎవరో ఆ ఇంట్లోకి నిన్ననో, ఈరోజో దిగారన్నమాట!'

మేఘన తలతిప్పి పక్కనే కూర్చుని చదువుకుంటున్న శ్రీలతను అడిగింది. "ఏయ్ శ్రీ! ఎదురింట్లో ఎవరయినా అద్దెకు దిగారా? "

"ఆc! నిన్ననే ఓ ఫ్యామిలీ దిగింది"

"ఏం చేస్తుంటాడట ఆయన? "

శ్రీలతకు తన చదువుకన్నా, ఇతర విషయాలే ఎక్కువ ఇంట్రస్ట్ కాబట్టి అప్పటికి తనకి ఆ వివరాలన్నీ తెలిసిపోయి ఉంటాయన్న ఉద్దేశ్యంతోనే అడిగింది మేఘన.

"ఆయన సివిల్ కాంట్రాక్టరట. ఏవో చిన్నచిన్న బిల్డింగ్ పనులు కాంట్రాక్టుకి తీసుకుని చేస్తుంటాడట. ఆవిడేమో హౌస్ వైఫ్"

అయితే ఆమె తన భర్తకోసమే వాకిట నిలబడి ఎదురుచూస్తున్నట్టుంది.

మేఘన తదేకంగా అటే చూస్తుంటే శ్రీలత పక్కనుండి పలికింది. "నీకింకో విషయం చెప్పనా అక్కా"

"ఏమిటి? "

"కోదండంగారికి అది మొదటిపెళ్లే గాని రాజేశ్వరక్కకు అది రెండోపెళ్ళి"

మేఘన విస్మయంగా చెల్లెలిముఖంలోకి చూసింది.

ఆమె అలా చూసేసరికి శ్రీలతకి కొద్దిగా కంగారు. "అది కాదక్కా... నేనేమో తెలుసుకోవాలనే క్యూరియాసిటీతో వివరాలు సేకరించలేదు. ఈరోజు మధ్యాహ్నం ఆమె మనింటికొస్తే, నేను తనతో కలిసి వాళ్లింటి కెళ్లాను. అప్పుడు మాటలమధ్య తనే చెప్పింది"

శ్రీలత తన చూపులను మరోలా అర్థంచేసుకుందని తెలిసి, పెదవులు దాటకుండానే నవ్వుకుంది మేఘన. సాధారణంగా ఆమె ఎప్పుడయినా ఇతరుల గురించి కబుర్లు చెపుతుంటే చదువు మానేసి ఇలాంటి కబుర్లతో కాలక్షేపం చెయ్యి అని తను కోప్పడుతూ ఉంటుంది. కాని నిజానికి తను కోపంగా చూడలేదు.

రెండో పెళ్లి చేసుకున్న ఓ అమ్మాయి తన ఇంటిఎదురుగానే కాపురం పెట్టడం ఏదోలా అనిపించింది. అందుకే అర్థంకాని ఫీలింగ్‌తో కాస్త విస్మయంగా చెల్లికేసి చూసింది.

మేఘన సర్దుకుని "సర్లే...సర్లే... చదువుకో" అనేసి తల తిప్పుకుంది.

శ్రీలత పుస్తకంలో తలదూర్చాక మేఘన తలతిప్పి అటే చూస్తుండిపోయింది.

అలా ఓ అయిదు నిముషాలు గడిచాయేమో!

ఆ ఇంటిముందు ఓ స్కూటర్ ఆగింది.

వాకిటముందు నిలబడి అభిసారికలా ఎదురుచూసే ఇల్లాలు, భర్త కనిపించగానే

అతడి దగ్గరకు పరుగెత్తుకుంటూ వెళ్ళాలి.

కానీ అప్పటివరకూ వీధిగడపకు భుజాన్ని తాకించి ఉన్న ఆమె వడివడిగా ఇంట్లోకి వెళ్ళిపోయింది.

ఎందుకనో ఆ దృశ్యం మాత్రం కాస్త అయోమయాన్ని కలిగించింది మేఘనకు.

అతడు ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

ఆ ఇంటి తలుపులు మూసుకుపోయాయి.

మేఘన కుర్చీలోనుండి లేచి అవతలికెళ్ళిపోయింది.

మర్నాడు-

తన సీట్లో కూర్చుని తన పని తను ముభావంగా చేసుకుంటున్న మేఘనను నిముషానికోసారి ఓరకంట చూడసాగాడు ధీరజ్‌కుమార్.

మేఘన మాత్రం వంచిన తల పైకెత్త లేదు.

ఒక గంట తర్వాత తన సీట్లోనుంచి లేచి ఆమె ముందుకొచ్చి నిలబడ్డాడు.



అతడు సీట్లోంచి లేవడం తన ముందు కొచ్చి నిలబడడం ఓరగా చూసినా మేఘన తలెత్తి చూడలేదు. కాకపోతే ఎందుకో తెలియదు గుండెవేగం కొద్దిగా పెరిగింది.

ఆమె తనను గమనించి కూడా తలెత్తి చూడలేదన్న విషయం అర్థమయిందేమో, ధీరజ్‌కుమార్ గొంతు సర్దుకుంటున్నట్టు దగ్గాడు.

ఇక తప్పదన్నట్టు ఆమె తలెత్తి చూసింది.

ఆమె తన ముఖంలోకి చూడడంతో అతడు నవ్వాడు.

మేఘన మాత్రం నవ్వలేదు. అతడి ముఖంలోకే ప్రశ్నార్థకంగా చూడసాగింది.

ఆమె ప్రశ్నార్థకమయిన చూపులు గమనించడంతోనే అతడు తడబడ్డాడు. ఒక్కసారిగా ముఖంలో రంగులు మార్చేసుకుని "మేఘనగారూ! అది... అది... ఏం లేదులెండి" అంటూ వెళ్ళి తన సీట్లో కూర్చున్నాడు.

మేఘన తలదించుకుని తన పనిలో తాను మునిగిపోయింది.

ఏమనుకున్నాడో ఏమో అతడు ఆ తర్వాత ఆమెను పట్టించుకోకుండా తనపనిలో తాను పడిపోయాడు.

దీపిక, రేణుశ్రీ, కావ్యలు అప్పటికే లంచ్‌బాక్స్‌లు ముందు పెట్టుకుని ఆమెకోసమే కాబోలు ఎదురుచూస్తున్నారు.

"ఏమిటండి ఇంత లేటు" మేఘన లోపలికొచ్చాక అడిగింది రేణుశ్రీ.

"కొద్దిగా వర్క్ బేలన్స్ ఉండి పూర్తిచేసి వస్తున్నాను"

అందరూ బాక్స్‌లు తెరిచారు కూరలు షేర్‌చేసుకుని తినడం మొదలుపెట్టారు.

ఎప్పటిలాగే కబుర్లు!

"రేపు సన్‌డే కదా! నీ ప్రోగ్రాం ఏమిటి?"

కావ్య రేణుశ్రీని అడిగింది.

"సినిమాకెళ్దామని వంశీ ప్రతిరోజూ ఫోన్‌లో తినేస్తున్నాడే. అందుకే రేపు మధ్యాహ్నం కాల్‌షీట్ అతడికి ఇచ్చేశాను"

వంశీ రేణుశ్రీ బోయ్ ఫ్రెండ్ అని అక్కడ అందరికీ తెలుసు. అతడి గురించి చెప్పడానికి, తమ మధ్య జరిగే సంఘటనలు వివరించడానికి ఆమె ఎప్పుడూ వెనుకాడదు.

"ఏ సినిమాకి ప్లాన్ చేస్తున్నారేంటి?"

"సంగీతలో 'అమెరికన్ బ్యూటీ' సినిమాకె ళ్దామనుకుంటున్నాం"

కావ్య నవ్వింది "అయితే పాపం వంశీకి రేపు రెండు, మూడు వందలు వదిలిపోతా యన్న మాట"

"అన్నమాట కాదు. ఉన్నమాటే. ఆడ పిల్లతో కలిసి సినిమాకెళ్లాను అన్న ఫీలిం గ్‌ని అనుభవించాలంటే ఓ రెండు, మూడు వందలు ఖర్చు పెట్టుకోవడంలో తప్పే ముంది? గర్ల్‌ఫ్రెండ్ అన్నాక కాస్తో కూస్తో ఖర్చు పెట్టించాలే. అప్పుడే బోయ్‌ఫ్రెండ్ పోస్ట్‌లో ఉన్న వాడికి కాస్త థ్రిల్ దొరికి, జేబుకి చిల్లు అవుతుంది"

అందరూ నవ్వారు.

"ఆ మధ్య ఆ సంబంధం కుదిరిపోయి ఉంటే ఈసరికి నీ ముక్కుకి తాడుపడి ఉండేది" దీపిక అంది.

"అవును ఆ సంబంధం కుదిరిపోయి ఉంటే ప్రతిరోజూ అసలు సిసలైన శృంగా రాన్ని అనుభవించి ఉండేదాన్ని. ఇలా థియే టర్లలో స్పర్శ సుఖానందంతో కక్కుర్తిపడే పరిస్థితి తప్పి ఉండేది"

కావ్య తల విదిలిస్తూ చిరుకోపం నటిస్తూ పలికింది "నీకసలు సిగ్గెగ్గులంటూ ఏవీ లేవే. నోటికి ఏదొస్తే అది పలికేస్తావ్"

"నోటికి ఏదొస్తే అది కాదు, మనసులో ఉన్నది దాచుకోకుండా బయటకు కక్కే స్తాను"

మేఘన వాళ్ల సంభాషణలో పాలుపంచు కోదు గానీ ఒక మంచి శ్రోతగా వింటూ ఉండిపోతుంది. ఆమెనూ మాటల్లోకి దించా లని వాళ్లు చేసిన ప్రయత్నాలేవీ ఫలించలేదు. ఎంతో ప్రయత్నం చేసి విసిగిపోయి చివరికి పోనీలే మాట్లాడకపోయినా నవ్వుతూ వింటుందిలే... అని వాళ్లు వదిలేశారు.

అయితే వాళ్లలో ఉన్న గొప్పతనం ఏమి టంటే అప్పుడెప్పుడో ఆమె తనకు పెళ్లయిం దని, భర్త చనిపోయాడని చెప్పినా ఆ విష యాన్ని అప్పుడే మర్చిపోయారు. కనీసం మర్చిపోయినట్టు నటిస్తారు. ఆ ప్రస్తావన ఇంతవరకూ మరోసారి తీసుకురాలేదు.

మేఘన నవ్వుకుంటూ తనవైపే చూస్తుం డడం గమనించి రేణుశ్రీ అడిగింది "మేఘ నగారూ! మీరు చెప్పండి. నేను మాట్లాడే దాంట్లో తప్పేమయినా ఉందా? కాలం మారింది. నేటి యూత్‌కి బోయ్‌ఫ్రెండ్స్, గర్ల్‌ఫ్రెండ్స్ ఉండడం చాలా కేజువల్ విష యమయిపోయింది. ఫ్రెండ్స్ అన్నాక సిని మాలు, షికార్లు ఉండితీరాలి. సినిమాలు, షికార్లంటే రాసుకుపూసుకు తిరగకుండా ఉండలేం. రాసుకుపూసుకు తిరుగుతున్న ప్పుడు ఆడామగా అన్నాక ఆపోజిట్ సెక్స్‌లో ఉన్న ఆకర్షణ కాసింత మనసును కదిలించి తీరుతుంది. మనసు కదిలిన ప్పుడు తనువు కొద్దిగా తపన పడుతుంది. తపన పడ్డ తనువు స్పర్శసుఖానందంతో ఎంతో కొంత తృప్తిపడుతుంది. ప్రస్తుత పరి స్థితుల్లో ఇది కామన్. కామన్‌గా జరిగే విష యాన్ని మనసులో నొక్కిపెట్టి, మరోలా మాట్లాడడం సబబా? "

"మాట్లాడడం సబబో కాదో నేను చెప్పలే నుగాని నువ్వు చెప్పే విధానం మాత్రం అవ తలివాళ్లు కన్విన్స్ అయ్యేలా ఉంటుంది" మేఘన నవ్వుతూనే చెప్పింది.

"ఆ వచ్చేవాడు ఎలా తట్టుకుంటాడో తెలి యదు గాని దీని మాటలు వింటే అవతలి వాళ్లు నోటమాట రాక కూర్చుండిపోవల సిందే" కావ్య అంది.

భోజనాలు ముగిశాయి.

బాక్స్‌లు సర్దేసుకుని ఎవరి సీట్లలోకి వాళ్లు వెళ్లిపోయారు.

ఆరోజు కూడా వర్క్ హెవీగా ఉండిపోవ డంతో మేఘన ఆఫీస్ అవర్స్ తర్వాత కూడా మరికొద్దిసేపు ఉండక తప్పలేదు.

వర్క్‌ని పూర్తిచేశాక ఎప్పటిలాగే మేఘన, ధీరజ్‌కుమార్‌లు క్యాబిన్ లాక్ చేసి బయ టకు నడిచారు.

ఆఫీసు నుండి పదడుగులు ముందుకేశాక

ధీరజ్‌కుమార్ ఆగిపోయి "మేఘనగారూ" అన్నాడు.

ఆమె తలెత్తి అతడి ముఖంలోకి చూసింది.

"నేను... నేను నిన్న చెప్పిన విషయం గురించి మీరేం ఆలోచించారు? "

అతడు ఆ ప్రస్తావన తీసుకొస్తాడని ముందే ఊహించి ఉండడంతో ఆమె తడబడలేదు. అప్పటికే ఆలోచించుకుని ఉండడంతో వెంటనే చెప్పింది "దయచేసి మరో సారి ఆ ప్రస్తావన తీసుకురాకండి ప్లీజ్... మీరిలా నన్ను ఇబ్బంది పెడుతూ ఉంటే నేనీ ఉద్యోగం మానేయాల్సి వస్తుంది"

ఆ మాటకు ఖంగుతింటాడనుకుంది మేఘన కాని అతడు చాలా స్థిరంగా ఎలాంటి తడబాటూ లేకుండా పలికాడు.

"ఇందులో నేను మిమ్మల్ని ఏవిధంగా ఇబ్బంది పెడుతున్నానో నాకర్థం కావడం లేదు. ఎందుకనో మీరు నాకు తొలిచూపులోనే నచ్చారు. మీకు అప్పటికే పెళ్లయిపోయిందనీ, భర్తను కోల్పోయారని తెలిసి జాలిపడలేదుకాని చాలా బాధపడ్డాను. అయితే నాకు నచ్చిన అమ్మాయిని పెళ్లి చేసుకోవడానికి ఆమె గతంతో అవసరమే ముందనే భావించాను. మీరు ఆఫీసులో చేరిన ఈ మూడు నెలలుగా నేను మిమ్మల్ని అబ్జర్వ్ చేస్తున్నాను. తొలిచూపులో మీ మీద పెంచుకున్న ఇష్టం రోజురోజుకీ గాఢతను సంతరించుకుంటోందే తప్ప తగ్గడం లేదు. అందుకే నా అభిప్రాయాన్ని సూటిగా మీకు తెలియచేయాలనే ప్రయత్నించాను. నిన్న సాయంత్రం నా మనసులో మాట మీకు చెప్పాను. మీ గతంతో సంబంధం లేకుండా మిమ్మల్ని పెళ్లి చేసుకోవాలనుకోవడం తప్పయితే నన్ను క్షమించండి. ఆ మాట సూటిగా చెప్పడం మీకు ఇబ్బంది కలిగించడమే అయితే ఓకే. ఇంకెప్పుడూ నేను మీ ముందు ఆ ప్రస్తావన తీసుకురాను. సరేనా? వస్తాను"

ధీరజ్‌కుమార్ వడివడిగా ముందుకెళ్లిపోయాడు.

అతడు పార్కింగ్ ప్లేస్‌లోని స్కూటర్ స్టార్ట్ చేసుకుని వెళ్లిపోవడం కనిపిస్తూనే ఉంది.

ఆమె మాత్రం అక్కడే నిలబడిపోయింది. తన చుట్టూ ఉన్న దృశ్యం అదృశ్యమయిపోయినట్టుగా ఉంది. ఆ కొద్ది సమయంలో అతడు మాత్రమే కనులముందు నిలిచాడు.

నిన్న అతడిచ్చిన షాక్‌కన్నా ఈ రోజు తనకి మరింత పెద్దషాక్ తగిలింది.

ఆ షాక్ నుండి తేరుకోవడానికి ఆమెకి రెండు నిముషాలు పట్టింది.

నిన్న అతడు నేను నిన్ను ప్రేమిస్తున్నానంటే తనకు కలిగిన ఆలోచన వేరు. ఈ రోజుల్లో పురుషులు తమ బలహీనతలను సులువుగా తృప్తిపరచడం కోసం ఏమాత్రం సంశయించకుండా నచ్చిన ఆడదానితో నేను నిన్ను ప్రేమిస్తున్నాను అనేస్తున్నారు. ధీరజ్‌కుమార్ తనతో అలా అన్నప్పుడు తనకు కొద్దిక్షణాలపాటు ఏమీ తోచలేదు. అదొక షాక్. అయితే ఇంటికెళ్లి ఆలోచించాక ఒక మంచి పొజిషన్‌లో ఉన్న అందమైన యువకుడు తనలాంటి వితంతువుతో నేను నిన్ను ప్రేమిస్తున్నాను అని అనడమేమిటి నాన్సెన్స్ అనిపించింది. బహుశా అతడు ప్రేమను ఎరవేసి తనకు దగ్గరవ్వాలని ప్రయత్నిస్తున్నాడేమో. అలా దగ్గరై అతడి బలహీనతలను తృప్తిపరచుకుని ఆ తర్వాత నీకూ నాకు సంబంధమేమిటి అని తీరుతాడు అనుకుంది. కాని ఇప్పుడతడు ఇలా అనేసరికి తనకు నిన్నటి షాక్‌ను మించిన షాక్ తగిలి శిలలా కదలక మెదలక నిలుచుండిపోయింది.

రెండు నిమిషాల తర్వాత తల విదిలించి అక్కడినుండి ముందుకు అడుగేసింది.

నడుస్తుంటే ఎందుకో కాళ్లు తడబడుతున్న ఫీలింగ్ కలిగింది. పెదవులు బిగపట్టి ఉన్నప్పటికీ చల్లని మంచుతెర శరీరాన్ని తాకుతు

న్నట్టు శరీరం సన్నగా వణకసాగింది.

ఏమిటిది? ఏమయింది నాకు?

బస్టాప్ వైపు నడుస్తూ అనుకుంది మేఘన. అతడు తనను ప్రేమించానన్నాడు. పెళ్లిచేసుకుంటానని చెప్పాడు. ప్రేమించానని పెళ్లిచేసుకుంటానని అతడు అనగానే సరిపోదు. ఆ సమయంలో ఎందుకో మనసులో కొద్దిగా మైమరపు కలిగిందిగాని రెండో పెళ్లికి తను ఎట్టి పరిస్థితుల్లోనూ స్థిరంగా లేదు. మనిషి నిర్ణయాలతో సంబంధం లేకుండా మనసు అప్పుడప్పుడూ తన ఇష్టం వచ్చినట్టు స్పందిస్తూ ఉంటుంది. అది తన తప్పుకాదు.

మేఘన బస్టాప్ చేరింది.

ఆఫీసు అవర్స్‌లో ఉన్నన్ని బస్సులు, ఆ తర్వాత ఉండవు. ఆఫీసు నుండి బయటపడడం కాస్త ఆలస్యమయితే, బస్సుని అందుకోవడం కాస్త ఆలస్యం కావచ్చు లేదా ఒక్కోసారి వెంటనే బస్సుదొరకొచ్చు అది అదృష్టం మీద ఆధారపడి ఉంటుంది.

చాలా సేపు బస్టాప్‌లోనే వేచి ఉండాల్సిన పరిస్థితి ఏర్పడింది.

మనసు స్పందన ఎలా ఉన్నా తన నిర్ణయం పెళ్లి. రెండో పెళ్లి గురించిన ఆలోచన మనసులోకి రానివ్వకూడదు. తన భర్తతో గడిపిన ఆ కొద్ది నెలల సంసార జీవితాన్ని తనెలా మర్చిపోగలదు? తను విధవ నన్న నిజం ఏ క్షణమూ మరిచిపోవడం తనకిష్టం ఉండదు. అలాంటిది ఇప్పుడు ధీరజ్ కుమార్ తన మనసులోని భావాలు సవ్యదిశలో సాగకుండా అడ్డుకుంటున్నాడు. నో! అతడిని ఇక మీదట మరింత దూరంగా ఉంచాలి.

బస్సొచ్చింది. మేఘన బస్సెక్కి కూర్చుంది. బస్సు కదిలింది.

★ ★ ★

బస్‌లో కూర్చుని ఏదో ఆలోచిస్తున్న మేఘనకు,.. ఎవరో తనవైపే చూస్తున్నట్టుగా అన్పించి చప్పున తల తిప్పి అటు చూసింది.

ఓ ముప్ఫయ్... ముప్ఫయ్ అయిదేళ్ల వ్యక్తి. మేఘనవంకే చూస్తున్నాడు. మేఘన ఎప్పుడైతే అతన్ని నోటీస్ చేసిందో గబుక్కున కళ్ళు తిప్పేసుకున్నాడు.

'ఎవరబ్బా ఇతను... ఎక్కడో చూసినట్టుందే' అనుకుంటున్న మేఘన మనసులో ఛమక్‌మని తట్టింది ఓ విషయం.

అతన్ని ఎదురింట్లో చూసింది. యస్... అతనే... అతనికి స్కూటరుండాలే... బహుశా చెడిపోయిందేమో!

ఓ నిముషం ఆగి మళ్ళీ అతనికేసి చూసింది. అతను పక్కనే వున్న ఒకామెతో ఏదో అన్నాడు. ఆమె వెనక్కి తిరిగి మేఘనకేసి చూసింది.

ఆమెకీ ఓ ముప్ఫయ్ వుంటాయ్. పంజాబీ డ్రెస్ వేసుకుని వుంది. జుట్టు కట్‌చేసి రబ్బర్ బేండ్ వేసి వదిలేసింది.

'ఈమె... ఎదురింట్లో తను చూసినా మెలాగాలేదే. నో... ఈమె ఆమె కాదు. ఆమె ఖచ్చితంగా ఇతని భార్య అయివుంటుంది. మరి ఈమె? చెల్లెలా?'

అతను ఆమెకు బాగా దగ్గరగా కూర్చుని వున్నాడు. అతనేదో అంటుంటే... అవసరానికి మించి నవ్వుతోందామె.

అది సిటీబస్ అనీ... చుట్టూ పబ్లిక్ వుందనీ వాళ్లనుకుంటున్నట్టుగాలేరు.

ఆమె విరగబడి నవ్వుతుంటే... చున్నీ జారి కిందపడింది. ఆమెకంటే ముందే అతను వంగి చున్నీ అందించాడు.

ఆమేదో అంది. అతను అదోలా నవ్వాడు.

ఛీ... చెల్లెలు కాదు, అయివుండదు.

మరదలా...

అయివుండొచ్చు..

లేక గర్ల్‌ఫ్రెండా!

రేణుశ్రీకి వంశీలా... ఇతనికి ఈమె... ఇంటిమేట్ ఫ్రెండేమో!

మామూలు భాషలో చెప్పాలంటే ఈమె

ఇతని కీప్ కావచ్చు

ఛ...ఛ... తెలియకుండా ఏదీ అనుకోకూడదు. అయినా ఆమె ఎవరైతే నాకెందుకు!

మేఘన వాళ్లమీంచి చూపులు తిప్పుకుని కూర్చుంది.

వాళ్ల గురించిన ఆలోచన్ని ఎంతలా అవాయిడ్ చేసిందంటే... వాళ్లు ఎప్పుడు ఏ స్టాపింగ్‌లో దిగిపోయారో కూడా ఆమె గమనించలేదు.

ఇంట్లోకి వెళ్తూ యథాలాపంగా ఎందురింటివైపు చూసింది.

ఆమె అక్కడే గుమ్మంలో నుంచుని అభిసారికలా ఎదురు చూస్తోంది.

లోపలికెళ్ళి హేండ్‌బేగ్ టేబుల్‌పైన పడేసి, కాళ్లూ చేతులూ కడుక్కొచ్చి కుర్చీలో చేరబడింది.

శ్రీలత కాఫీ కప్పు తెచ్చి మేఘనకిచ్చింది. కప్పుని పరధ్యానంగా అందుకుంటున్న మేఘనని చూస్తూ "ఏంటక్కా! అంతలా ఆలోచిస్తున్నావ్?" అంది.

"మన ఎదురింట్లో కొత్తగా చేరారు చూడూ, అతనికి చెల్లెలుందా!" అడిగింది మేఘన.

"ఉందేమో!" అంది శ్రీలత.

"అహఁ... అట్లాకాదు. ఆ యింట్లో అతని భార్యని కాక... ఇంకో లేడీని చూశావా?"

"ఉహుఁ... చూళ్లేదు. కానీ..."

"కానీ..."

"మొన్నోసారి ట్యూషన్ కెళ్లేప్పుడు చూశా... అతను స్కూటర్ మీద ఎవరో అమ్మాయిని ఎక్కించుకుని వెళ్తున్నాడు. ఆమె క్లోజ్‌గా అతని భుజంమీద చెయ్యేసి కూర్చుంది" చెప్పింది శ్రీలత.

"ఆ గుమ్మంలో నుంచునే ఆవిడే కదూ ఇతని భార్య"

"అవునూ... రాజేశ్వరక్కే అతని భార్య" అందులో సందేహం ఏమిటన్నట్టు చూసింది.

"మరి... మరి... అతన్తో కన్పించే ఆమె ఎవరైవుంటుంది?" కాఫీ సిప్‌చేస్తూ సాలోచనగా అంది.

"ఉంచుకున్నాడేమో!" శ్రీలత చప్పున అంది.

ఉలిక్కిపడింది మేఘన... అంతవరకూ చిన్నపిల్లలా అనుకున్న శ్రీలత ఎంతో ఆరిందాలా ఎదిగిపోయినట్టన్పించింది.

"పెద్దపెద్ద మాటలొస్తున్నాయే! బెల్టేది!" అంది మేఘన.

"నువ్వేకదమ్మా నాతో హస్కేసుకున్నావ్" శ్రీలత అక్కడ్నించి పారిపోయింది.

"అడ్డగాడిద" మేఘన నవ్వుకుంది. "అదన్నది నిజమేగా" అనుకుంది.

కిటికీలోంచి బయటకు చూసింది.

ఆమె ఇంకా అక్కడే... గుమ్మంలోనే వుంది. ఓ అయిదు నిముషాలకు... అతను గేట్లో ప్రత్యక్షమయ్యాడు.

ఆమె అచ్చం నిన్నటిలాగే... అతన్ని చూడగానే హడావుడిగా లోపలికెళ్ళిపోయింది.

★ ★ ★

ఆదివారమయినా అలవాటు ప్రకారమే ఉదయం ఐదున్నరకే లేచింది మేఘన.

అప్పటికింకా పడక మీదే ఉన్న సుగుణమ్మ మేఘన హాల్లోకి రావడం చూసి చెప్పింది "ఏమే అటెళ్లి వాకిలి కాస్త చిమ్మి రావే"

"అలాగే"

మేఘన చీపురు తీసుకుని గేటు తెరుచుకుని వీధిలోకెళ్లింది.

వీధిలోకెళ్లగానే కనిపించింది రాజేశ్వరి.

తలొంచి వాకిలి చిమ్ముతున్న ఆమె అప్పుడే తలెత్తి మేఘనను చూసింది. పలకరింపుగా నవ్వుతూ అడిగింది. "మీరు... మీరు మేఘనగారు కదా?"

"ఆఁ!..."

"మీ గురించి శ్రీలత చెప్పింది. జాబ్ చేస్తున్నారటకదా?"

"అవును"

"ఈరోజు ఆదివారమేకదూ? మా ఇంటి కోసారి రండి"

"తప్పకుండా వస్తాను"

మేఘన నవ్వి తన పనిలో పడిపోయింది.

ఆ మధ్యాహ్నం ఎదురింటికి వెళ్లాలా వద్దా అని సంశయిస్తుంటే రాజేశ్వరే వచ్చేసింది.

రాజేశ్వరి వచ్చేసరికి మేఘన పుస్తకం చదువుకుంటోంది. ఆమె రావడం చూసి పుస్తకం మూసేసి పక్కన పెట్టి "రండి... రండి" అంది.

"మీరు మా ఇంటికి రాకపోతే, నేనే వచ్చేస్తానని చెప్పాను వచ్చేశాను" రాజేశ్వరి మేఘన ఎదురుగా కూర్చుని "మొత్తంమీద వస్తానంటూనే రాకుండా ఆగిపోయారు" అంది.

"అదేం కాదండీ. ఈ సమయంలో మీరు భోంచేసి పడుకుండిపోతారేమో, డిస్టబ్ చేయడం ఎందుకులే అని రాలేదు. సాయంత్రం రావాలనుకుంటున్నాను"

"మనకి మధ్యాహ్నం నిద్ర అలవాటు లేదులెండి. సాయంత్రంకన్నా ఇప్పుడే రావడం మేలు"

"ఇప్పుడు మీవారు? " మేఘన అనుమానంగా చూసింది.

"మా వారికి సోమవారం సెలవు. ఆదివారం కాదు"

"సరే పదండి" మేఘన కుర్చీలోనుండి లేచి "అమ్మా" అంటూ వంటగదివైపు తిరిగి అరిచింది.

సుగుణమ్మ హాల్లోకి వచ్చి "ఏమిటే" అంటూ అప్పుడే రాజేశ్వరిని చూసింది. "ఏమ్మా! వచ్చి ఎంతసేపయింది? "

"ఇప్పుడే వస్తున్నాను ఆంటీ... మీ పెద్దమ్మాయిని మా ఇంటికి రమ్మని తీసుకెళ్తున్నాను"

"అలాగే వస్తుందిలేమ్మా... ఉండు కాఫీ తాగి వెళ్దువు"

"ఇక్కడ కాఫీ తాగితే, అక్కడ మీ అమ్మాయి మరేమీ తీసుకోదు... అందుకే ఇప్పుడేమీ వద్దు... వస్తాం"

రాజేశ్వరి ఇంట్లోంచి బయటకు నడుస్తుంటే మేఘన తల్లివైపు చూసి 'వెళ్లొస్తానన్నట్టు' తలాడించి ఆమెను అనుసరించింది.

ఎదురింట్లోకి వెళ్లాక, ఆ ఇంటి వాతావరణంకేసి పరిశీలనగా చూసింది మేఘన.

ఇల్లు చూసి ఇల్లాలిని చూడమన్న మాట ఆ క్షణం మేఘనకు గుర్తుకొచ్చింది. ఇంటిని అందంగా తీర్చిదిద్దుకోవడం ఒక ఆర్ట్. ఆ ఆర్ట్ ఏ కొద్దిమంది ఆడవాళ్లకో మాత్రం వంటపడుతుంది.

రాజేశ్వరి ఇల్లు తీర్చిదిద్దినట్టు అందంగా ఉంది. ఎక్కడ ఉండాల్సిన వస్తువు అక్కడ ఉండి శుభ్రంగా కనిపిస్తోంది.

మేఘన ఆ ఇంట్లోకి అడుగుపెట్టగానే అన్న మొదటిమాట "మీ ఇల్లు చాలా అందంగా ఉంది. మీది ఓ గొప్ప టేస్ట్ అని అర్థమయిపోతోంది"

రాజేశ్వరి అదోలా నవ్వి "కూర్చోండి" అంది.

మేఘన ఆమె చూపించిన కుర్చీలో కూర్చుంది.

రాజేశ్వరి మేఘనకు ఎదురుగా కూర్చుని చెప్పింది. "మీ చెల్లెలు మీ గురించి చెప్పగానే నాకు చాలా బాధకలిగింది. ఆ మర్నాడే మిమ్మల్ని మా ఇంటి దగ్గరనుండే చూశాను. మిమ్మల్ని చూశాక నా బాధ రెట్టింపయింది. ఇంత అందమైన అమ్మాయికి, ఇంత చిన్నవయసులోనే ఇలాంటి కష్టం తెచ్చి పెట్టేడేమిటి ఆ దేవుడు' అని బాధపడ్డాను. ఒకప్పటి నా పరిస్థితి నా కళ్ల ముందు కదలాడింది. అప్పుడే మిమ్మల్ని కలిసి మీతో కాసేపు మాట్లాడాలని మీతో స్నేహం పంచుకోవాలని అనుకున్నాను మూడురోజుల తర్వాత ఈ రోజుకి వీలయింది"

మేఘనకు ఎందుకో ఆ టాపిక్ ఇష్టంలేకపోయింది. మరిచిపోతున్న గతాన్ని గుర్తుచే

యడం బాధకు కారణం అవుతుంది. ఇలాంటి స్థితిలోనే ఉండి, బాధను భరించిన రాజేశ్వరిగారికి ఈ విషయం తెలియదా?

ఆమె ముఖంలోని ఇబ్బందిని గమనించిందో లేక తను ముందుగానే అనుకున్న మాటలు చెప్పిందో రాజేశ్వరి ఇలా అంది. "జరిగిపోయిన దానిని గుర్తుచేయడం బాధాకరమయిన విషయమే. కాని నేను ఆ బాధాకరమయిన విషయాన్ని ఎందుకు గుర్తుచేశానంటే నా మనసులో అలా అనిపించిందని చెప్పటంకోసమే. ఇకమీదట ఎప్పుడూ నేను మీకు మీ గతాన్ని గుర్తుకు తీసుకురాను. ప్రామిస్"

"అరరే! మీ మాటలకు నేనేం పెద్దగా బాధపడలేదు. మనం మరిచిపోవాలని ప్రయత్నించినంతమాత్రాన గతం గుర్తుకురాకుండా ఉండదు. ఆ గతాన్ని ఎవ్వరూ గుర్తుచేయకూడదనుకోవడమూ పొరపాటే"

రాజేశ్వరి నవ్వేసింది "ఓ.కే. ఓ.కే. ఇక ఆ టాపిక్‌ని శాశ్వతంగా పక్కనపెట్టేద్దాం. ఇక అసలు విషయమేమిటంటే నాకు మీరు బాగా నచ్చారు. మీతో స్నేహం పెంచుకోవాలని నాకు కోరిక కలిగింది. చెప్పండి నాతో స్నేహం చేయడం మీకిష్టమేనా? "

ఆమె మనస్తత్వం కొంతవరకూ అర్థమయింది మేఘనకు. రాజేశ్వరిది బోళా మనస్తత్వం. మనసులో మాట దాచుకోలేదు.

మేఘన ఆ మాటే ఆమెతో అంది. "మీరు మనసులో ఏదీ దాచుకోరనుకుంటాను. ప్రతి విషయాన్ని నవ్వుతూనే చెప్పేస్తారు కదూ? "

"ఒక్క విషయం తప్ప"

"ఏ విషయం? "

రాజేశ్వరి అదోలా నవ్వేసింది "నేను మనసులో దాచుకున్న విషయాన్ని అవసరమనిపించినప్పుడు మీకు మాత్రమే చెపుతాను. సరేనా? " అన్నాక ఆమె కూర్చున్న చోటునుండి కిచెన్‌వైపు వెళ్ళింది.

రెండు నిముషాలు తర్వాత ప్లేట్‌లో స్వీట్, కారప్పూస పట్టుకొచ్చి టీపాయ్‌మీద పెట్టింది.

"తీసుకోండి"

"అయ్యో! ఇప్పుడివన్నీ ఎందుకండీ? "

"ఇంటికొచ్చిన అతిథికి ఏమీ పెట్టకుండానే పంపించేయమంటారా? "

బదులేం చెప్పాలో తెలియక మేఘన నవ్వేసింది.

ఇద్దరిమధ్యా కొద్దిక్షణాలు నిశ్శబ్దం.

కొద్దిక్షణాల నిశ్శబ్దాన్ని కూడా భరించలేనట్టు రాజేశ్వరి అంది. "కబుర్లేమయినా చెప్పండి మేఘనగారూ"

"కబుర్లు... కబుర్లంటే ఏమున్నాయి? "

"మీ ఆఫీసు డ్యూటీ హేపీగానే ఉందా? "

"ఇంట్లో కూర్చుని బోర్‌కొట్టించుకోవడం కన్నా అలా ఆఫీసుకెళితే కొంత రిలాక్స్‌గా అనిపిస్తుంది. అయితే ఆఫీసు అనగానే సాయంత్రానికి అలసిపోవడం, డ్యూటీలో ఎంతో కొంత టెన్షన్ పడాల్సి రావడం సహజం. కాని ఈ బోర్‌కన్నా ఆ డ్యూటీనే బాగుంటుంది"

రాజేశ్వరి తలాడించింది. "అది నిజం అంతేకాదు, నీలాంటి అమ్మాయి తనకాళ్ల మీద తను నిలబడడం మరింత అవసరం"

"ఎందుకని? "

రాజేశ్వరి కొద్దిగా తటపటాయించింది. "ఎందుకూ అంటే వద్దులే ఆ టాపిక్‌ని తీసుకురావడం నాకిష్టంలేదు"

ఆమె ఎందుకు తటపటాయిస్తోందో మేఘనకు అర్థమయింది. "చూడండి. నిజం బాధను కలిగిస్తుందని ఆ నిజం గురించి మాట్లాడుకోకూడదనుకోవడం పొరపాటు. మీరు నేనేదో బాధపడతానని నాకు చెప్పాలనుకునే మంచి మాటలూ మింగేయడం సబబుకాదు"

దాంతో రాజేశ్వరి రిలాక్స్‌గా నవ్వింది.

"ఏంలేదు మేఘనగారూ! జీవితమంటే మనం అనుకున్నట్టే జరగదు. ఊహాతీతమయిన మలుపులతో సాగేదే జీవితం.

ఇలాంటి జీవితంలో ఒక ఊహించని మలుపుకు బలిపశువులుగా మారిపోయిన ఒక వితంతువు ప్రస్తుత పరిస్థితుల్లో ఉద్యోగం చేయడం ఎంతో అవసరం. ఎందుకంటే రేపు మన జీవితంలో మరో ఊహించని మలుపు ఎదురుకావచ్చు. అప్పుడు ఆ పరిస్థితిని ధైర్యంగా ఎదుర్కోవాలంటే మనకి మానసిక ధైర్యం ఉండితీరాలి. ఆర్థికంగా నిలబడగలిగినప్పుడు మానసిక ధైర్యం వస్తుంది. అందుకే జీవితాంతం తోడుగా నిలిచి మన కష్టసుఖాలను భరించే భర్తలేని ఏ ఆడపిల్లయినా ఉద్యోగం చేయడం అవసరమనే నా అభిప్రాయం"

మేఘన తలాడించింది.

'ఒకనాటి ఆమె పరిస్థితి ఆమెను బాగా బాధపెట్టి ఉండొచ్చని' అనుకుంది మేఘన.

అడగకూడదనుకుంటూనే అడిగేసింది "మరి మీరూ ఉద్యోగం చేయచ్చుకదా? "

ఆ ప్రశ్నకు రాజేశ్వరి కొద్దిగా తడబడింది. "చేయొచ్చు నిజమే... కానీ కానీ మావారికి ఇష్టంలేదు"

"అలాగా"

కొద్దిక్షణాలు మౌనంగా ఉన్నాక ఆమె తలెత్తి మేఘననే చూస్తూ పలికింది "స్త్రీ జీవితంలో ఉన్న సంక్లిష్టత ఇది. ఆమె కోరుకున్నట్లు ఆమె ఉండలేదు. ఆమె ఉండకూడదనుకున్నవిధంగా ఉండేలా పురుషుడు ఆమెను వత్తిడి చేస్తాడు. ఉద్యోగం చేయాలని, నా కాళ్ళమీద నేను నిలబడాలని, ఆ విధంగా మానసిక ధైర్యంతో కాసింత సంతోషంగా బతకాలని నేను అనుకుంటున్నాను. కానీ నాకు నచ్చేవేవీ మావారికి నచ్చవు. నాకిది మొదటిపెళ్ళి అయివుంటే, పరిస్థితి ఎలా ఉండేదో చెప్పలేనుగానీ రెండోపెళ్ళి. అందుకే నోరు మూసుకుని ఉంటున్నా. నా పరిస్థితికి, నా భవిష్యత్‌కి ఉద్యోగం ఎంతో అవసరం అని తెలిసి కూడా తాత్కాలికంగా ఇంట్లో గొడవలు రావడం ఇష్టంలేక చేతులు ముడుచుకుని ఉండిపోతున్నా"

మేఘనకు ఒక్క విషయం అర్థమయింది. "తొలి పెళ్ళి తాలూకు దాంపత్య జీవితంలో స్త్రీకి భర్తమీద అధికారం, అవసరపడితే అతడిని ఎదిరించే శక్తి, ఏదో సాధించాలనే తపన నుండి తీరుతాయి కానీ రెండోపెళ్ళి అనేసరికి ఏదో తెలియని భయం మనసులో ప్రవేశిస్తుంది. అభద్రతా భావం మనిషిలో నిలువెల్లా పేరుకుపోతుంది. తప్పుచేశానన్న ఫీలింగ్ కాదుగానీ, ఎందుకనో తెలియకనే ఆ భర్తకు అణిగిమణిగి ఉండే గుణాన్ని కలిగేలా చేస్తుంది. ఇవి ఈ దేశంలో రెండో పెళ్ళి చేసుకునే ఆడవాళ్ళకు సహజంగా కలిగే భావోద్రేకాలు. అందువల్లే ఈ దేశంలో రెండోపెళ్ళి చేసుకున్న ఆడవాళ్ళు మరింత ఒద్దికగా, భర్త కనుసన్నల్లో మెలిగేలా నడుచుకుంటూ ఉంటారు"

"అంటే మీవారికి ఇష్టంలేదని మీరు మీకు ఇష్టమయిన పనిని చేయకుండా ఆగిపోయారన్నమాట"

"అవును"

"ఇది తప్పుదంటారా? "

"తనెంతో త్యాగంచేసి 'నాలాంటిదాన్ని' పెళ్ళిచేసుకున్నానని భావించే భర్త దొరికినప్పుడు తప్పదనే అనుకుంటున్నాను"

మేఘన మరికాసేపు అక్కడ కూర్చుంది. రాజేశ్వరి అందించిన కాఫీ తాగాక అక్కడ నుండి లేచి వచ్చేసింది.

ఆ రాత్రి ఆమెకు నిద్రపట్టలేదు.

"వివాహ జీవితం అనుభవంలోకి రాక ముందు ఏ వ్యక్తయినా తన జీవిత భాగస్వామి తనను జీవితాంతం అంటిపెట్టుకుని ఉండడం జరుగుతుందనే అనుకోవడం సహజం. కానీ విధి విచిత్రమయింది. విధి చేసే వింతల్లో జీవితం ఒక్కొక్కసారి ఒంటరి బతుకవుతుంది. ఇది నేటి స్థితి కాదు. తరతరాలుగా వస్తున్న సహజస్థితి. అయితే ఈ సహజస్థితిలో స్త్రీపురుషుల మధ్య వ్యత్యాసం పురుషుడి జీవితానికన్నా స్త్రీ జీవితాన్ని దారుణాతిదారుణంగా మార్చే

సింది. ఒకనాటి దారుణ పరిస్థితిని పక్కన పెడితే, మనిషి విశాలంగా ఆలోచించగలిగే, విజ్ఞానాన్ని సంపాదించి కూడా తన సంకుచితత్వాన్ని పూర్తిగా వదిలేయలేకపోతున్నాడు. విధవరాలయిన స్త్రీని పెళ్ళిచేసుకోవడం అంటే తనేదో గొప్ప త్యాగం చేస్తున్నానని మురిసిపోతున్నాడు. మొదట అదేదో ఆదర్శంగా భావించినా, ఆ తర్వాత తన సంకుచితత్వాన్ని రకరకాలుగా ప్రదర్శించుకుంటున్నాడు. ఇది జరుగుతున్న చరిత్ర..."

ఆ సమయంలో ఆమె కళ్ళముందు ధీరజ్ కుమార్ కదలాడాడు.

'ఈ చదరంగంలో తనూ ఓ పావు కావడం సబబా? విధి వక్రించి భర్తను కోల్పోయిన ఆడదాన్ని పెళ్ళిచేసుకోవడమే గొప్ప త్యాగంగా భావించే పరిస్థితుల్లో ఒకరి త్యాగాన్ని భరించే శక్తి తనకులేదు. ఈ వివాహ జీవితం మరోసారి అనుకోని మలుపు తిరిగితే తను తట్టుకోలేదు. అందుకే అంతకన్నా ఒంటరి బతుకే మేలని తన అభిప్రాయం...' ఇదే తన నిర్ణయం.

ఆలోచనల మధ్య ఏ తెల్లవారుఝామునో ఆమెకు నిద్రపట్టింది.

ధీరజ్ కుమార్ ముభావంగా ఉండడం మొదలుపెట్టాడు.

అతడలా ఉండడమే మేలనిపించింది మేఘనకి.

ఇద్దరిమధ్యా ఆ దూరం అలాగే పెరిగిపోయి ఉండేదేమోగానీ ఓరోజు దీపిక తీసుకొచ్చిన టాపిక్ మేఘనను పునరాలోచించుకునేలా చేసింది.

ఆరోజు రేణుశ్రీ, కావ్యలిద్దరూ ఆఫీసుకు రాలేదు.

దీపిక, మేఘన మాత్రమే రెస్ట్‌రూమ్‌లో కూర్చుని భోంచేస్తున్నారు.

మేఘన భోంచేస్తూ మధ్యలో తలెత్తి దీపికకేసి చూసింది. దీపిక సాలోచనగా తననే చూస్తోంది. ఎప్పుడయితే తను తలెత్తి చూసిందో అప్పుడు ఆమె తడబడి తల తిప్పుకోబోయింది.

అప్పటికి ఇద్దరిమధ్యా ఏకవచనంలో చనువుగా పిలుచుకునేంత స్నేహం పెరిగి ఉండడంతో మేఘన అడిగింది, "దీపూ! ఏంటలా చూస్తున్నావ్?"

"అది... అది..."

"ఏయ్! ఏంటే ఆ తడబాటు?"

"అది... అడగొచ్చో లేదో తెలియక" నసిగింది దీపిక.

"మరి అడగకూడనిదనుకుంటే అడగకుండా మానెయ్. ఫ్రెండ్లీగా అడగడంలో తప్పు లేదనిపిస్తే అడిగెయ్. అది మనిద్దరి మధ్యా ఉన్న ఫ్రెండ్‌షిప్‌ని బట్టి నువ్వే నిర్ణయించుకో"

దీపిక ఒక్క నిముషం ఆలోచించాక అంది, "ఒకవేళ నేను అడిగింది నీకు బాధను కలిగిస్తే మాత్రం నన్ను క్షమించాలి"

మేఘన నవ్వేసి "సరే! ఆ హామీ ఇస్తున్నాను ఇక ప్రొసీడయిపో" అంది.

అప్పటికీ దీపిక సంశయంగానే అడిగింది "నీకూ, ధీరజ్ కుమార్‌గారికి మధ్య గొడవేమయినా జరిగిందా?"

మేఘన కళ్ళు చికిలించి చూసింది.

దీపిక పెదవులు బిగపట్టి ఇబ్బందిగా నవ్వింది.

"నీకా అనుమానం ఎందుకొచ్చింది దీపూ?"

"అనుమానం ఎందుకొచ్చిందన్నది సమస్యకాదు. అది నువ్వు తెలుసుకోవలసిన అవసరమూ లేదనుకుంటా. గొడవేమయినా జరిగిందా, లేదా అన్నది నువ్వు చెబితే చాలు"

ఈసారి పెదవులు బిగపట్టాల్సిన అవసరం మేఘనదయింది. అదే సమయంలో మేఘనకు మరో నిజమూ తెలిసింది. ఇది నాలుగ్గోడల మధ్య జరిగిన విషయంకదా, లోకానికి తెలియదులే అనుకోవడం పొర

పాటు. నాలుగ్గోడలమధ్య జరిగిన రహస్యాలెన్నో పబ్లిక్‌లోకి వెళ్ళిపోతూ వుంటాయి. గోడలకు చెవులుండవు. తలుపులకు కళ్ళుండవు. మరి ఆ రహస్యాలు జనాలకెలా తెలుస్తాయి? బహుశా మనుష్యుల ప్రవర్తన, హావభావాల ప్రకటన, మరేదో అంశం ఆ రహస్యాన్ని బయట ప్రపంచానికి తెలియచేస్తుంది. రహస్యం నాలుగుగోడల మధ్యే ఉండిపోవడం అరుదైన విషయం.

ఏమీ తోచని స్థితిలో మేఘన తలాడించింది. కళ్ళెత్తి దీపికను చూసింది.

'రేణుశ్రీ, కావ్యల్లా దీపిక అల్లరిపిల్లకాదు. లోతుగా ఆలోచించి అవసరపడితే పరిస్థితిని విశ్లేషించి చెపుతూ, నిజాన్ని మనసులోనే దాచుకోగలిగిన తెలివైన, సంస్కారమున్న అమ్మాయి. ఎలాగూ ఆమెకు అనుమానం కలిగాకకాదు అని తను చెప్పినా అది అబద్ధమని తెలిసిపోతూనే ఉంటుంది. దాంతో ఇద్దరి మధ్యా దూరం పెరిగే అవకాశం ఉంది. దూరం పెరుగుతుందని కాకపోయినా దగ్గరైన మిత్రులకి జరిగినదాని గురించి చెప్పుకోవడంలో తప్పేముంది?'

ఆ నిర్ణయానికి రాగానే మేఘన గాఢంగా నిశ్వసించింది.

"నువ్వెలా ఊహించగలిగావోగానీ, అది నిజం"

దీపిక కొద్దిగా ముందుకు వంగింది. "గొడవంటే ఏదయినా అకౌంట్స్‌లో పొరపాటు జరగడంవల్ల వచ్చిందా? లేక..."

"అతడు నన్ను పెళ్ళిచేసుకుంటాననడం వల్ల వచ్చింది"

దీపిక షాక్ తిన్నట్టు కొద్దిక్షణాలు అలాగే ఉండిపోయింది. చాలాసేపటి తర్వాత "ఏమిటి... ఏమిటి? ధీరజ్‌కుమార్‌గారు నిన్ను పెళ్ళిచేసుకుంటానన్నాడా?"

"అవును"

"బహుశా ఆయనకు నీ గతం గురించి తెలియదనుకుంటాను"

"తెలుసు"

"తెలిసీ..."

"అదేకదా గొడవగాని గొడవగా మారి నీకు అనుమానం కలిగేలా చేసింది"

ఊహించని సంఘటన గురించి వినడం వల్ల కలిగిన అయోమయస్థితినుండి కొద్దిసేపటికే తేరుకున్నాక దీపిక అడిగింది. "ఆయన నిన్ను పెళ్ళి చేసుకుంటానన్నాడు. మరి నువ్వేమన్నావు? ఇందులో గొడవపడే అవసరమే లేదే"

ఆయన నన్ను పెళ్ళి చేసుకుంటాననగానే, 'దయచేసి అలా మాట్లాడి నన్ను ఇబ్బంది పెట్టకండి. మీరలా ఇబ్బంది పెడితే నేను ఉద్యోగం మానేయాల్సి వస్తుందని' బెదిరించాను. ఇందులో గొడవేంలేదు. కాకపోతే మా ఇద్దరి ప్రవర్తనా చూసి నువ్వు ఏదో గొడవ జరిగి ఉంటుందని అనుకున్నావనుకుంటాను"

"అలాగా" అన్నాక దీపిక అడిగింది.

"మరి... నువ్వలా అన్నాక ధీరజ్‌కుమార్‌గారు ఎలా ప్రవర్తిస్తున్నారు?"

"నాతో ముభావంగా మాట్లాడతారు. అదీ ఎంతో అవసరమయితే తప్ప నన్ను పలకరించే ప్రయత్నం చేయరు. అంతేకాదు, అప్పటినుండి నావైపు చూడడమూ తగ్గించేశాడు" కాస్త రిలాక్స్ అవుతూ చెప్పింది మేఘన.

దీపిక వెంటనే మాట్లాడలేదు. కొద్దిక్షణాలు మౌనంగా ఉండిపోయాక తలెత్తి మేఘన ముఖంలోకి చూసింది.

"అది సరేగానీ నేనొక ప్రశ్న అడుగుతాను, జవాబు చెపుతావా?"

"అడుగు"

"మేఘనా! నాకు తెలిసినంతలో ఈ ఆఫీసు మొత్తంమీద ధీరజ్‌కుమార్‌లాంటి మంచివాడు లేడు. అతడు ఏ ఆడపిల్లతోనూ చనువుగా మాట్లాడడం కూడా నేను చూడలేదు. అలాంటి అందమైన, మంచి పొజిషన్‌లో ఉన్న యువకుడు పలకరిస్తే చాలు, అల్లుకుపోవడానికి రెడీగా ఉండే

అమ్మాయిలు ఎంతోమంది ఉన్నారు. అలాంటి మంచిమనిషి, వ్యక్తిత్వం ఉన్న వాడు నిన్నే పెళ్ళాడాలని ఎందుకనుకున్నాడో కాసేపైనా ప్రశాంతంగా ఆలోచించావా నువ్వు? అతడిని 'కాదు' అని చెప్పడంలో నీ ఉద్దేశ్యం ఏమిటి? "

"ఇదేనా నీ ప్రశ్న? "

"అవును"

"పెళ్ళయిన ఆడదాన్ని మళ్ళీ పెళ్ళి చేసుకోమని చెప్పడంలో నీ ఉద్దేశ్యం? "

"అంటే ఎప్పటికీ పెళ్ళి చేసుకోకుండా ఇలానే ఉండిపోతావా? "

"అవును"



దీపిక ఆమె చేతి మీద చెయ్యేసి ఆప్యాయంగా చెప్పింది. "చూడు మేఘనా! నేడు మళ్ళీ పెళ్ళి అన్నది చాలా కామన్ విషయం. నువ్వేమో పాతికేళ్ళు దాటని యువతివి. జీవితంలో అనుభవించాల్సిన ఎన్నో సుఖాలు, పొందాల్సిన ఎన్నో అనుభూతులు నువ్వు పొందలేదనే నేను చెప్పగలను. నీకింకా ఎంతో భవిష్యత్తుంది. గతాన్ని తలుచుకుంటూ బాధపడడంలో అర్థంలేదు. జరిగిపోయిందేదో జరిగిపోయింది. పోయిన మనుషులతో మనమూ పోలేంకదా. కాలం అన్ని గాయాల్ని మాన్పుతుంది. మనిషికి మరుపనేది దేవుడిచ్చిన వరం. ఎప్పుడోఅప్పుడు నువ్వు గతాన్ని మరిచిపోగలవు. అప్పుడు నీకు ఓ తోడు ఉంటే బాగుండునని అనిపించొచ్చు కానీ అప్పుడు నువ్వు పెళ్ళి చేసుకోవాలని అనుకున్నప్పుడు నీకు ధీరజ్ కుమార్‌లాంటి మంచి మనిషి దొరకడు. ఆలోచించు"

మేఘన మాట్లాడలేదు.

"అసలు ధీరజ్‌కుమార్‌లాంటి మంచిమనిషి నిన్ను పెళ్ళి చేసుకుంటానంటే, నువ్వెందుకు కాదంటున్నావో నాకర్థంకావడంలేదు"

"ఇతరుల త్యాగాన్ని నేను భరించలేనుకాబట్టి"

**అ**దేరోజు సాయంత్రం ఇంటికి చేరాక, మనసేం బాగోలేకపోవడంతో ఎదురింటికెళ్ళింది మేఘన.

చాలా సేపు కాలింగ్‌బెల్ నొక్కాక తలుపు తెరుచుకుంది.

తలుపు తీసిన రాజేశ్వరి కళ్ళు ఎర్రగా ఉండడం గమనించింది మేఘన. ఆమె బుగ్గలమీద చారికలు అప్పటివరకూ ఆమె ఏడ్చిందన్న విషయం తెలియచేస్తున్నాయి.

మేఘనను చూడడంతోనే రాజేశ్వరి తడబడింది.

"రా మేఘనా... రా. లోపలికిరా" అంది.

"ఈమధ్యకాలంలో ఇద్దరిమధ్యా చనువు పెరిగింది. మేఘన ఆమెను 'రాజేశ్వరక్కా' అంటే, ఆమె 'మేఘన' అంటోంది.

మేఘన లోపలికి అడుగుపెట్టేందుకు తటపటాయించింది. "అక్కా నేను... నేను తర్వాత వస్తాలే" అంది.

"అరే... ఇప్పుడేమయిందని వెళ్ళిపోవడం. రా... లోపలికి"

మేఘన ఇక తప్పదన్నట్టు లోపలికి నడిచింది.

"కూర్చో... ఇప్పుడే వస్తాను" అంటూ రాజేశ్వరి కుర్చీ చూపించింది.

మేఘన కుర్చీలో కూర్చున్నాక రాజేశ్వరి

రెండు నిముషాల తర్వాత వచ్చింది. ఆమె ముఖం కడుక్కుని ఉంది.

రాజేశ్వరి మేఘనకు ఎదురుగా కూర్చుని నవ్వలేక నవ్వుతూ అంది, "కాలింగ్‌బెల్' శబ్దం వినిపిస్తున్నా అది నువ్వనుకోలేదు మేఘనా. అందుకే తలుపు తీయడం కాస్త ఆలస్యమయింది"

మేఘన ఆమె ముఖంలోకి సూటిగా చూస్తూ ప్రశ్నించింది. "మీరు ఎందుకేడుస్తున్నారు రాజేశ్వరక్కా? "

"అబ్బే ఏడవడం కాదమ్మా... కంట్లో నలక పడింది. అందుకే కాస్త కన్నీళ్లొచ్చాయి..."

"కంట్లో నలకపడితే రెండుబుగ్గల మీదా కన్నీటి చారికలు ఏర్పడవు రాజేశ్వరక్కా. అబద్ధం చెప్పినా అతికినట్టుండాలి"

ఎప్పుడయితే మేఘన ఏడుపును చూసిందని నిర్ధారించుకుందో అప్పుడు రాజేశ్వరి ఇంక గుండెలోని బరువును భరించలేకపోయింది.

ఆమె వరద గోదారే అయింది.

"మేఘనా!" అంటూ ఆమె చెయ్యిపట్టుకుంది. ఆ సమయంలో రాజేశ్వరి గొంతు జీరపోయింది. కళ్లు నదీజలాలయ్యాయి.

మేఘన రాజేశ్వరి చేతిమీద చెయ్యేసి ఆప్యాయంగా అడిగింది. "ఏం జరిగిందో చెప్పక్కా"

రాజేశ్వరి చెప్పడం మొదలు పెట్టింది.

★ ★ ★

కోదండం తనను పెళ్లి చేసుకుంటానని అన్నప్పుడు రాజేశ్వరికి భరించలేనంత ఆనందం కలిగింది.

పెళ్లయిన కొద్దినెలలకే భర్తను కోల్పోయి పుట్టిల్లు చేరిన కూతురికి ఇక ఈ జన్మలో పెళ్ళికాదని నిర్ణయించుకున్నప్పటికీ ఆమె తల్లిదండ్రులు వాళ్ల ప్రయత్నాలు వాళ్లు చేశారు.



రెండో పెళ్లి సంబంధాలు ఎక్కడయినా దొరకుతాయేమోనని ఎంక్వయిరీ చేయసాగారు. పెళ్లయి భార్యని కోల్పోయిన మగాడు, ఒక వేళ అతడి మొదటి భార్యకు బిడ్డలున్నప్పటికీ పట్టింపు లేకుండానే రాజేశ్వరినిచ్చి పెళ్లి చేసేద్దామనే వాళ్ల ఆలోచన. విధవ కూతురుకి అంతకన్నా మంచి సంబంధం దొరకదనే వాళ్ల నమ్మకం. అలాంటి సంబంధం దొరికినా అదీ తమ అదృష్టమేనని వాళ్ల ఉద్దేశ్యం.

పెళ్లి ప్రయత్నాలలో వాళ్లు బంధుమిత్రులకు తెలియచేశారు. పెళ్ళిళ్ల పేరయ్యలకు చెప్పారు. మేరేజీ బ్యూరోలకు వివరాలు అందచేశారు. చివరికి పేపర్లలో 'వివాహవేదిక' లాంటి పేజీలలోనూ ప్రకటన ఇచ్చారు.

'కాలం మారింది. మగాళ్ల మనస్తత్వంలో ఎంతో కొంత మార్పు వచ్చింది అన్నదానికి నిదర్శనంగా సంబంధాలు రాసాగాయి.

అయితే కన్నెపిల్లకే ఎన్నో వంకలు పెట్టి, ఆ పెళ్లి ద్వారా తమ అంతులేని కోర్కెలు తీర్చుకోవాలనే మగాళ్ల మనస్తత్వం ఇక్కడ మరింత ఎక్కువయింది.

"ఏమండీ! మీ అమ్మాయి పేర ఆస్తి ఏమయినా ఉందా? "

"మీ అమ్మాయికి తన మొదటి భర్త తరపునుండి ఆస్తి వచ్చే అవకాశమేమయినా ఉందా? "

ఇలాంటి ప్రశ్నలేవీ అడక్కుండా కోదండం రాజేశ్వరిని పెళ్ళిచేసుకోవడానికి ముందుకొచ్చాడు.

కోదండంతో పెళ్లి కుదిరిందని తెలిశాక 'రాజేశ్వరి ఎంతో కొంత అదృష్టవంతురాలనే' అందరూ అన్నారు. 'లేకపోతే రెండో పెళ్లి అమ్మాయికి మొదటి పెళ్లి మొగుడు దొరకడమేమిటి? ' అనుకున్నారు.

అందులోనూ కోదండం అనాకారి కాదు. ఒకవిధంగా అందగాడనే చెప్పుకోవాలి. పైగా అతడికి ముందూ వెనకా ఎవ్వరూ లేరు.

అలాంటి అల్లుడు దొరికినందుకు రాజేశ్వరి తల్లిదండ్రులు ఎంతో సంతోషించారు. కష్టమే జీవితాంతం మిగిలిపోతుందనుకున్న కూతురి జీవితంలో సుఖపడే అదృష్టం ఉందని అనుకున్నారు వాళ్లు.

నిరాడంబరంగా పెళ్లి జరిగిపోయింది.

పెళ్లయ్యాక కొద్దిరోజులవరకూ కోదండం రాజేశ్వరిని బాగానే చూసుకున్నాడు. ఆ తర్వాతే మొదలయింది చిత్రహింస.

ఓరోజు సాయంత్రం, షాపింగ్‌కి బయల్దేరారు ఇద్దరూ. మరో వారం రోజులలో కోదండం బర్త్‌డే రాబోతోంది. అందుకోసమే రాజేశ్వరి పట్టుబట్టి అతడిని షాపింగ్‌కి బయలుదేరదీసింది.

ఇంటికి తాళంవేసి స్కూటర్‌వైపు నడుస్తున్నప్పుడు కోదండం అడిగాడు. "మనమిప్పుడు ఎక్కడికెళ్దాం? రోచాబజార్ వెళ్దామా? "

రాజేశ్వరి తల అడ్డంగా ఆడించింది. "రోచాబజార్‌లో బట్టలు కాస్ట్‌లీగా ఉంటాయి. మనం గ్రీన్‌ల్యాండ్స్ వెళ్లడం మంచిది. అక్కడికన్నా ఇక్కడ తక్కువ ఖరీదులో మంచి క్వాలిటీ బట్టలు దొరుకుతాయి. పైగా సెలక్షన్ చేసుకోవడానికి బోలెడు వెరైటీలుంటాయి"

కోదండం చప్పున ఆమె ముఖంలోకి చూశాడు.

రాజేశ్వరి అతడి కళ్లల్లోకి చూసింది. అతడు అంత వేగంగా తలతిప్పి కనుబొమలు ముడివేసి తన ముఖంలోకి ఎందుకు చూస్తున్నాడో అర్థంకాలేదు.

అందుకే కాస్త అయోమయంగా అడిగింది "ఏమిటండీ అలా చూస్తున్నారు? "

"రోచాబజార్, గ్రీన్‌ల్యాండ్స్ అవి జెంట్స్ షోరూమ్‌లు. వాటి గురించి నీకింత బాగా ఎలా తెలుసా అని"

రాజేశ్వరికి ఏం చెప్పాలో అర్థం కాలేదు. 'తను... తను తన మొదటి భర్తతో కలిసి ఒకసారి షాపింగ్‌కెళ్ళినప్పుడు ఆ రెండు షాపులు చూసిందని ఎలా చెప్పగలదు? '

ఆమె తటపటాయింపు చూసి, అప్పుడే అర్థమయినట్టు అతడు నవ్వేశాడు. "ఓహో! నీ మొదటి మొగుడితో కలిసి ఆ షాపుల కెళ్ళి వుంటావ్... యామైరైట్"

అది నిజమే కావచ్చు కానీ ఆ సమయంలో అలా గుర్తుచేయవలసిన అవసరం ఉందా? ! ఒకవేళ చప్పున మనసులో మెదలాడినా మనసులోనే ఉంచుకుని ఉంటే బాగుండేది.

రాజేశ్వరికి మనసులో ముల్లుగుచ్చుకున్న ఫీలింగ్ కలిగింది.

"ఏంటి! జవాబు చెప్పవు"

"ఆఁ...ఆఁ... నిజమే" ఆ సమయంలో మౌనాన్ని ఆశ్రయించాలని మనసు లాగినా, అతడి ప్రశ్న జవాబు చెప్పేలా చేసింది.

"ఓ.కే. నీ ఇష్టప్రకారమే, నీకు నచ్చిన గ్రీన్‌ల్యాండ్స్‌కే వెళ్దాం పదా"

అతడు స్కూటర్ స్టార్ట్ చేశాడు.

అన్యమనస్కంగానే ఆమె స్కూటరెక్కి కూర్చుంది.

పదినిముషాల తర్వాత స్కూటర్ సిటీలోని అతిపెద్ద జెంట్స్ షోరూం గ్రీన్‌ల్యాండ్స్ ముందు ఆగింది.

రాజేశ్వరి దిగాక అతడు స్కూటర్ లాక్ చేసి ఆమెవైపు చూసి ప్రశ్నించాడు. "అన్నట్టు, అప్పుడు నీ మొగుడితో కలిసి నువ్వు ఆటోలో వచ్చావా లేక స్కూటర్‌లో వచ్చావా? "

'ఎందుకో ఈమధ్య ఇతడు నా గతజీవితాన్ని తరచుగా గుర్తుచేస్తున్నాడు!... ఎందుకిలా!'

"ఏయ్ రాజీ! ఏమిటి, ఒక్కసారిగా గతంలోకి వెళ్ళిపోయినట్టున్నావ్... ఇప్పుడు నీ కళ్లముందు అప్పుడెప్పుడో మీ ఆయనతో కలిసి ఇక్కడకు రావడం, నవ్వుతూ, తుళ్లుతూ, మాట్లాడుకుంటూ లోపలికెళ్లడం, అతడికి బట్టలు నువ్వే సెలక్ట్‌చేయడం, ఆ తర్వాత కూల్‌డ్రింక్ తాగి ఇంటికెళ్లడం...



ఈ సంతోషంతో ఆ రాత్రి, అమ్మో! ఇద్దరూ పిచ్చిపిచ్చిగా ఎంజాయ్ చేసి ఉంటారు కదూ? "

రాజేశ్వరి అతడివైపు విస్మయంలో భయాన్ని మిళితం చేసి కన్నార్పకుండా చూడసాగింది.

ఆమె చూపులకు అతడే తడబడ్డాడేమో. అదోలా నవ్వేస్తూ "జస్ట్ క్యూరియాసిటీతో అడిగానులేవోయ్... కమాన్, కమాన్, వెళ్దాం పదా" అంటూ ఆమె భుజం పట్టుకుని లోపలికి నడిపించాడు.

అయితే షోరూమ్‌లోనూ ఆమెను వదిలి పెట్టలేదు.

"అన్నట్టు నీ మొదటి మొగుడు నీ సెలక్షన్‌ని మెచ్చుకునేవాడా లేక 'వరస్ట్ సెలక్షన్' అని ఎత్తిపొడిచేవాడా? "

ఆమె ఏడుపు ఆపుకోవడానికి చాలా కష్టపడవలసివచ్చింది.

షాపింగ్ ముగిశాక ఏదయినా రెస్టారెంట్ కెళ్ళి కూల్‌డ్రింక్ తాగుదామని అతడు

ప్రపోజ్ చేసినా, అక్కడ కూడా గతం గుర్తు చేసి బాధపెట్టే అవకాశం ఉందనిపించి ఆమె అతడి ప్రపోజల్‌ని తిరస్కరించి ఇంటికి బయల్దేరింది.

ఇద్దరూ ఇంటికొచ్చారు.

ఆరాత్రి ఆ అనుభవం మరింత భయంక రమయింది.

అతడికి మరింత దగ్గరయ్యేవేళ "ఏమను కోకపోతే ఒక్కమాట?" అతడి నోట విని పించింది.

ఏమిటన్నట్టు తను కళ్లెత్తి అతడి ముఖం లోకి చూసింది.

"ఈ సమయంలోనూ నీ పాత మొగుడు గుర్తుకురావడంలేదు కదా?"

తరులు విరిగి, గిరులు పగిలి కనకూడని దృశ్యం కనిపించినట్టు, వినకూడని మాటలు వినిపించినట్టు ఆమెకు స్పృహ కోల్పోతున్న ట్టనిపించింది.

ఆ తర్వాత మరోరోజు.

ఇద్దరూ భోజనాలకు కూర్చున్నప్పుడు కోదండం చిరునవ్వుతోనే ఆమెతో అన్నాడు. "ఈరోజు నా ఫ్రెండ్స్ అందరూ ఓ చిన్న విషయం గురించి చర్చించుకుంటుంటే నువ్వు నాకు గుర్తొచ్చావు రాజీ"

అది తన మీద ఎక్కుపెట్టబడిన శరం అని తెలియని ఆ పిచ్చిది చిరునవ్వుతోనే అడిగింది "ఏమిటండీ ఆ విషయం?"

"నా ఫ్రెండ్ ఒకడు సెకండ్‌హేండ్ స్కూటర్ కొనుక్కోవాలని అంటే, నా ఫ్రెండ్స్‌లో చాలామంది అతడిని తిట్టారు! సెకండ్‌హేండ్ అంటే అంతకుముందు వాడు వాడిన ఆ బండి రిపేర్‌కొస్తుంది. అయినా ఎప్పుడూ కూడా సెకండ్‌హేండ్ ప్రిఫర్‌బుల్ కాదురా. కాస్త ఆలస్యమయినా కొత్తబండే కొనుక్కో..! అంటూ వాళ్లం టుంటే, నేను నోటమాటరానట్టు నిలబడిపో యాను... ఎందుకో తెలుసా?"

అప్పటికి అతడేం చెప్పబోతున్నాడో కొంత అర్థమయింది మరికొంత అర్థంకావలసి ఉంది. అందువల్లే, అతడిని అడిగింది "ఎందుకు?"

"నువ్వు నాకు సెకండ్‌హేండ్ బండివే కాబట్టి"

ఆరాత్రికి భోజనం చేయలేకపోయింది.

మెల్లగా... కోదండం తాగుడుకు అల వాటు పడ్డాడు. ఒక్కోసారి రాత్రులూ ఇంటికి రావడం మానేశాడు.

తెల్లారి ఇంటికొచ్చిన అతడిని ఓరోజు ఆమె రాత్రంతా ఎక్కడున్నారని ప్రశ్నిస్తే, అతడు చెప్పిన జవాబుకు మతిపోయింది.

"చూడు రాజీ! నీ మొదటి మొగుడుతో నీకు కొంత అనుభవం ఉంది. ఇప్పుడు నాతో గడిపేది నీకు వెరైటీ అనుభవం. మరి నా జీవితంలో నేనూ ఎంతో కొంత వెరైటీని అనుభవించాలి కదా? అది తప్పంటావా? చెప్పు రాజీ"

'అసలు... అసలు తను మళ్లీ పెళ్ళికి ఎందుకు వప్పుకున్నానా' అని రాజేశ్వరి బాధపడిన క్షణాలు అవే.

★ ★ ★

"... అలా హింస, మానసిక చిత్రవధ నాకు అలవాటయిపోయింది. ఒక్కోసారి... అతడిని వదిలేసి పుట్టింటికి పారిపోదామా అని ఆలోచన కలుగుతుంది. కాని భర్తను కోల్పోయి ఆ ఇంటికి చేరినప్పుడు నన్ను కన్నవాళ్లు పడిన బాధను కళ్లారా చూసిన నేను, అలాంటి బాధనే మరోసారి వాళ్లకు కలిగించకూడదని అనుకున్నాను. అందు లోనూ ఈసారి నేను భర్తను వదిలేసి పుట్టింటికి వెళ్ళి చేరితే వాళ్లు రకరకాల అవ మానాలూ భరించాల్సి వస్తుంది. గతంలో వాళ్లకు ఇరుగుపొరుగునుండి జాలి లభిం చింది. ఈసారి నేను కాస్త ముందడుగేస్తే, వాళ్లకు జాలిస్థానంలో దూషణ, ఛీత్కారాలు మిగులుతాయి. 'ఆడపిల్లను కనగానే కాదు. కాసింత పద్ధతులూ నేర్పాలి. మొగుడితో కాపురం చేయడంకన్నా పుట్టింటిలో పడి ఉండడమే ఇష్టమయితే ఎవరేం చేయగ

ు. ఈరోజుల్లో కాబట్టి మగాళ్లు ఎంతో మంచి మనసుతో ఎంగిలిపడ్డ ఆడది అని కూడా ఆలోచించకుండా రెండోపెళ్ళి ఆడ దాన్ని కూడా పెళ్ళిచేసుకుంటున్నారు. సర యిన ఆడదయితే తనకు జీవితం ప్రసాదిం చిన మగాడ్ని దేవుడిలా పూజించాలి ఆ...' అని వాళ్లు అని తీరుతారు. ఆ దూషణలు, ఛీత్కారాలు భరించమంటూ వాళ్లను బాధ పెట్టడం నాకిష్టంలేదు. నేనూ అలాంటి మాటలను విని తట్టుకోగలిగే స్థితిలో లేను. అందుకే ఈ చిత్రహింసను ఇలా భరిస్తున్నాను"

కొద్దిక్షణాలవరకూ మేఘన నోటమాట రాలేదు.

'ఎప్పుడూ నవ్వుతూ, గలగలా మాట్లా డేస్తూ మనసులో ఏదీ దాచుకోకుండా మాట్లాడే ఈ రాజేశ్వరి జీవితంలో తెరచా టున ఇంత విషాదం దాగి ఉందా?'

ఇద్దరి మధ్యా కొన్ని సెకనులకాలం నిశ్శబ్దంలో (ప్రవాహంలో) కొట్టుకుపో యింది.

రాజేశ్వరి ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుంది. "ఒకరోజు నేను నీతో అన్నాను. నా మనసులో ఒకే ఒక్క విషయం మాత్రం దాచుకుని ఉన్నానని, అవసరపడిన పుడు ఆ విషయం నీకు చెపుతానని అన్నాను. అది... అది ఇదే మేఘనా"

మేఘన అప్పటికి తేరుకుని తలాడిం చింది.

"అసలు... అసలీరోజు ఏం జరిగింది? మీరెందుకు ఏడుస్తున్నారు? "

"ఈరోజు సాయంత్రం ఆయన వర్క్ దగ్గర నుండి రావడంతోనే చెప్పాడు. 'చూడు రాజీ! ఆ తర్వాత నువ్వు నాకు చెప్ప లేదే అని బాధపడకుండా ముందే చెప్పేస్తు న్నాను. నాకు సివిల్ ఇంజనీరింగ్ డిపార్ట్ మెంట్‌లో ఉద్యోగం చేస్తున్న ఓ అమ్మాయి కొద్ది నెలల క్రితం పరిచయం అయింది. ఈ మధ్యకాలంలో ఆ పరిచయం ప్రేమగా మారింది. మేమిద్దరం పెళ్లిచేసుకోవాలను కుంటున్నాం. మా పెళ్ళి ఓ వారం, పదిరో జుల్లో గుడిలో జరగబోతుంది. చూడు! నేను మరో పెళ్ళి చేసుకుంటున్నానని నిన్ను విడిచిపెట్టడం చేయను. పెళ్ళి చేసుకున్న పాపానికి నిన్నూ నా జీవితాంతం పోషి స్తాను. సరేనా?' అని చెప్పి వెళ్లాడు మేఘనా"

"అంటే... అంటే మీ వారు మరో పెళ్లిచే సుకోబోతున్నారా? "

"అవును" నిర్లిప్తంగా జవాబిచ్చింది రాజే శ్వరి.

"మరి ఈ విషయం తెలిసీ, నువ్వు... నువ్వేం చేయలేవా? "

"ఏం చేయగలం చెప్పు"

మేఘన • వెంటనే చెప్పింది. "మీవారి మీద పోలీస్‌కంప్లయింట్ ఇస్తే? "

"ఏదీ... నన్ను మానసికంగా చిత్రహిం సలు పెడుతున్నారనా? "

"కాదు మానసిక చిత్రహింసలను మనం బయట పెట్టుకోలేం. శారీరక బాధలయితే రుజువులు చూపి, న్యాయం కోసం అర్థించ వచ్చు కాని మానసిక చిత్రహింసలకు రుజువేముంది? ఇలా జరుగుతోందని బయటపెట్టుకున్నా, ఇదంతా మా ఆవిడ నన్ను వదిలేసేందుకు ఆడుతున్న నాటకం' అని మీవారు ఎదురుదాడి చేయొచ్చు"

"కరక్ట్‌గా ఊహించావు. ఇప్పుడు తెలి సింది కదా, నేను ఓ భయంకర నిజాన్ని నా మనసులోనే ఎందుకు నొక్కేసి ఉన్నానో?!"

మేఘన తలాడించి పలికింది, "నేననేది కూడా ఈ చిత్రహింసల విషయం బయట పెట్టమనికాదు. ఈ రెండో పెళ్ళి విషయం పోలీసులకు తెలియచేస్తే మంచిదేమోనని"

రాజేశ్వరి తల అడ్డంగా ఆడించింది "లేదు లాభంలేదు. దానివల్ల సమస్యను తెగేవరకు లాగినట్టవుతుంది"

మేఘన కొద్దిక్షణాలు ఆలోచించి




# ముచ్చటైన హార్బర్!



ఈ అందమైన హార్బర్ అమ్మకానికి సిద్ధంగా ఉంది! కావలసినవారు 1 లక్ష 25 వేల డాలర్లు చెల్లించి స్వంతం చేసుకోవచ్చు! ఆ అందాల మినీహార్బర్ రూపొందడానికి 4 వేల గంటల కాలం పట్టింది.

శాన్‌ఫ్రాన్సిస్‌కోలో నివశిస్తున్న కళాకారుడు జేమ్స్ ప్రిదామ్ సృష్టించిన అద్భుతం ఇది! తమ చిన్నారులను మురిపించి, తమ ఇంట దీనిని కొలువుతీర్చి సంతసించడానికై ఎందరో ఖరీదైన షరాబులు 'క్యూ'లో అప్పుడే సిద్ధంగా ఉన్నారు! కళాకౌశలం గురించి బాగా తెలిసిన, కళాఖండాలపట్ల అభిరుచి మెండుగా గలవారికి మాత్రమే ఆ హార్బర్‌ను విక్రయించడానికి జేమ్స్ నిశ్చయించుకొన్నాడు!

"నిజమే... అదీ నిజమే" అంది.

కోదండం రెండో పెళ్ళి చేసుకోబోతున్నాడంటూ పోలీసు కేసుపెడితే, అప్పుడు కూడా అతడు అడ్డం తిరగొచ్చు. ఇదంతా తన భార్య భ్రమ అని చెప్పొచ్చు. తను చేసుకోదలచుకున్న పెళ్ళిని వాయిదా వేసుకుని తనకసలు మరో పెళ్ళి చేసుకునే ఆలోచనే లేదని బుకాయించొచ్చు. అసలు తనెంతో ఆదర్శవాదంతో రెండోపెళ్లి ఆడదానిని తన జీవితంలోకి ఆహ్వానిస్తే ఆ ఆదర్శానికి విలువలేకుండా పోయిందని దొంగ ఏడుపులు ఏడవొచ్చు. ఇంకా దారుణంగా ఆలోచించగలిగితే 'అసలు తన భార్య శీలం మంచిదికాదని, ఆమె మరెవడితోనో కలిసి కాపురం చేయడానికి ఆలోచిస్తూ ఇలా తనను అడ్డు తప్పించడానికి ప్రయత్నిస్తోందని కట్టుకథలూ సృష్టించొచ్చు. ఆడదాన్ని కాపాడడానికి ఎన్ని చట్టాలున్నా మగాడు తప్పించుకోవడానికి అంతకు రెట్టింపు మార్గాలున్నాయి!

మేఘనకు రాజేశ్వరి పరిస్థితి పూర్తిగా అర్థమయింది. ఆమె తొలి వివాహం చేసుకున్న స్త్రీలా భర్తకు ఎదురుతిరిగి, అతడిని విడిచిపెట్టి వెళ్లలేదు. ఇంట్లోనే ఉండి అతడి దారుణ కృత్యాలను బయటపెట్టనూలేదు. ఎందుకంటే, ఎవరికయినా ఆ నిజం చెప్పినా ఆమెవైపే అనుమానంగా చూసే అవకాశం ఉంది. అతడు చేసిన 'త్యాగం' అలాంటిది మరి. సరయిన స్థితిలోనే ఉన్న ఓ మగాడు 'రెండో పెళ్ళి' చేసుకోవలసిన అవసరం ఏమిటి? అలా చేసుకున్నాడంటే అతడు తప్పక ఆదర్శపురుషుడే అయి వుంటాడు. అలాంటి ఆదర్శపురుషుడి మీద ఈవిడ ఇలా నిందలు వేస్తుందేమిటి? విధవగా పుట్టింట్లో మగ్గిపోవలసిన ఆడదానికి, మళ్లీ పునర్జన్మ లాంటి జీవితాన్ని ప్రసాదిస్తే అంతటి త్యాగపురుషుడినే తిట్టిపోస్తుందెందుకని? ఖచ్చితంగా లోపం ఈమెదే అయి ఉంటుంది. అదే ఆమెకు తొలి వివాహం అయి ఉంటే 'ఏదో జరిగే ఉంటుంది. ఆ మొగుడు దుర్మార్గుడయి ఉండకపోతే, ఈ అమ్మాయి తన పచ్చని సంసారాన్ని వదిలి ఎందుకొచ్చేస్తుంది?' అని అనుకుంటారు. ఆమెమీద సానుభూతి చూపిస్తారు. తొలి వివాహానికి, మలివివాహానికి తేడా అదే.

రాజేశ్వరి కళ్లు తుడుచుకుని కుర్చీలో నుండి లేచింది. "మేఘనా! కూర్చుని ఉండమ్మా. కాఫీ పెట్టుకుని వస్తాను"

"ఇప్పుడలాంటివేవీ వద్దక్కా. అసలే మీరు..."

ఆమె మాటలని మధ్యలోనే కట్ చేస్తూ, "కష్టాలను తలచుకుంటూ మిగిలిన విషయాలను పట్టించుకోకుండా ఉండలేంక దమ్మా" అంది రాజేశ్వరి.

రాజేశ్వరి లోపలికెళ్లాక మేఘన ఆలోచనల్లో పడింది. ఈ దేశంలో రెండో పెళ్లి చేసుకున్న మగాడి మీద ఎలాంటి వత్తిడీ లేదు. కానీ అదే ఒక స్త్రీ రెండో పెళ్లి చేసుకుంటే ఆమె మీద దారుణమయిన వత్తిడి ఉంటుంది. కోదండంలాంటి మొగుడు దొరికితే అతడు ప్రతిదినం గతాన్ని గుర్తుచేసి బాధనే మిగులుస్తుంటాడు. అలాగే ఈ దేశంలో రెండో పెళ్లి చేసుకున్న ఆడదాన్ని సమాజం పక్షపాత ధోరణిలోనే చూస్తుంది. కలలోనయినా తలచని విధంగా జీవిత భాగస్వామిని కోల్పోవడం అన్నది స్త్రీపురుషులికిద్దరికీ సమానంగా ఎదురయ్యే సమస్య అయినప్పుడు సమాజం స్త్రీపట్లనే పక్షపాతం చూపడం ఎంత వరకూ సబబు? ఈ విషయంలో స్త్రీలు స్త్రీలనే సమర్థిస్తున్నారనీ చెప్పలేం. నిజం చెప్పాలంటే ఇలాంటి పరిస్థితి ఎదురయిన స్త్రీకి స్త్రీయే శత్రువని నిరూపిస్తుంది. ఎందుకిలా? అయితే ఇది ఈ దేశంలోని స్త్రీ సమస్య మాత్రమే. అదే పాశ్చాత్య దేశాలలో స్త్రీమీద ఈ తరహా వత్తిడి లేదు.

మేఘన ఆలోచనలను కట్ చేస్తూ రాజేశ్వరి గొంతు వినిపించింది "మేఘనా!

ఇదిగో కాఫీ"

ఆమె తలెత్తి చూసి రాజేశ్వరి చేతిలో కాఫీ కప్పు అందుకుంది.

రాజేశ్వరి ఆమె ఎదురుగా కూర్చుంది.

చాలా సేపటి తర్వాత మేఘన అంది "కొద్దిసేపటి క్రితం వరకూ నేను మిమ్మల్ని ఎంతో కొంత అదృష్టవంతులనే అనుకుంటూ ఉన్నానక్కా. కాని ఇప్పుడే తెలిసింది మీ మనసులో ఇంత బాధ దాగి ఉందని. మీరు ఇన్ని చిత్రహింసలు అనుభవిస్తున్నారని"

"చాలామంది ఆడవాళ్ల జీవితాలలో వెలుగు చూడని బాధలెన్నో ఉంటాయి. వాటిని చాలా దగ్గరగా వెళ్లిన వాళ్లు మాత్రమే చూడగలరు"

"అక్కా"

"ఏమిటి మేఘనా? "

"కోదండంగారు! మిమ్మల్ని ఇష్టపడి, మీ గతం గురించీ తెలిసే పెళ్లి చేసుకున్నారు కదా? మరిప్పుడు ఆయన ఇలా ప్రవర్తించడంలో అర్థమేమిటి? "

"అర్థమేమీ లేదు. అది మగాడి అహంకారానికి నిదర్శనం. అతడి క్షణిక నిర్ణయాలకి ప్రతిఫలం. కాకపోతే ఆ ప్రతిఫలం అతడు అనుభవించకుండా ఆడది అనుభవిస్తుంది. అంతే"

"నాకు అర్థం కావడంలేదక్కా"

రాజేశ్వరి గాఢంగా నిశ్వసించి చెప్పింది "చూడమ్మా మేఘనా! ఒక మగాడు రెండో పెళ్లికి సిద్ధపడడమంటే మొదట అతడు అది ఆదర్శంగా ఫీలవుతాడు. ఆ తర్వాత రోజులు గడిచేకొద్దీ అతడికి తనేదో కోల్పోయానన్న ఫీలింగ్ ఏర్పడుతుంది. దాంతో అసంతృప్తి మొదలవుతుంది. అసంతృప్తి లోంచి వచ్చిన నిస్సహాయత కసిగా మారుతుంది మరి తన కసిని ఎవరి మీద చూపించాలి? అసలిదంతా కట్టుకున్న దాని వల్లే వచ్చిందికదా? ఎప్పుడయితే అతడికి ఆ ఆలోచన వచ్చిందో అప్పటి నుండి ఆ ఇల్లాలికి కష్టాలు మొదలవుతాయి. ఆమెను తిట్టొచ్చు, కొట్టొచ్చు లేదా అతడు తాగి ఇంటికి రావచ్చు, లేకపోతే స్త్రీలోలుడిగా మారిపోవచ్చు, రెండో పెళ్లి చేసుకున్న మగాడిలో అసంతృప్తి ఏర్పడితే దాని పరిణామం ఎక్కడికయినా దారితీయొచ్చు"

ఆ క్షణం మేఘనకు ధీరజ్ కుమార్ గుర్తుకొచ్చాడు. దీపిక మాటలూ మనసులో కదలాడాయి. "అంతమంచి మనిషి మిమ్మల్ని పెళ్లి చేసుకుంటానంటే మీరెందుకు ఆలోచిస్తున్నారో అర్థం కావడంలేదు మేఘనగారూ"

ఇప్పుడు రాజేశ్వరి మాటలు విన్నాక నిజంగానే తను ఆలోచించాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఒకవేళ తను అనాలోచితంగా ముందడుగు వేస్తే? లేదు తనకలాంటి ఆలోచన అసలు లేదు. కాని ఒకవేళ అలాంటిదేదయినా జరిగితే ఆ తర్వాత ఇదిగో ఇప్పుడు రాజేశ్వరక్క ఎదుర్కొంటున్న పరిస్థితి లాంటిదే తనూ ఎదుర్కోవలసి రావచ్చు.

మేఘన మనసులో మరొక్క అనుమానం మిగిలి ఉంది. ఆ అనుమానాన్నే నివృత్తి చేసుకోవాలనుకుంది.

"అక్కా! అయితే రెండో పెళ్లి ఆడదానిని తొలి వివాహం చేసుకున్న ప్రతి మగాడి మనస్తత్వం ఇలాగే ఉంటుందా? "

రాజేశ్వరి తల అడ్డంగా ఆడించింది. "ఈ ప్రపంచంలో మంచీ చెడు రెండూ ఉన్నాయి మేఘనా! ఆడదంటే అనుభవానికి పనికి వచ్చే శరీరమే తప్ప ఆమెకూ ఓ మనసుంటుందని తెలుసుకోలేని మూర్ఖులతోపాటు ఆడదాని మనసునూ తెలుసుకుని ఆమె వ్యక్తిత్వాన్ని గౌరవించి గుండెల్లో దాచుకునే మగాళ్లూ ఈ దేశంలో ఉన్నారు. ఓ మంచి మగాడు దొరకడం ఆ ఆడదాని అదృష్టం మీద ఆధారపడి ఉంటుంది. ఏదేమయిన ఈ దేశంలో ఆడదానికి రెండో పెళ్లితో కష్టాలు మొదలయ్యే అవకాశమే ఎక్కువుంది"

మేఘనకు మనసంతా అదోలా అయిపోయింది.

నిజానికి తనకు రెండో పెళ్లి గురించిన ఆలోచన లేదు. కాని ఎందుకో మరోసారి ధీరజ్‌కుమార్ మనసులో మెదిలాడు ఆ క్షణం. అయితే ధీరజ్‌కుమార్ కూడా అలాంటి వాడేనా.

అంతలోనే అనిపించింది... అయినా తనకు మనసులో మరే ఉద్దేశ్యమూ లేనట్లయితే అతడు ఎటువంటి వాడో అని ఆలోచించాల్సిన అవసరమేముంది? అతడు ఎటువంటి వాడయితే తనకేంటి? ధీరజ్‌కుమార్ మంచి వాడే కావచ్చు లేదా కొద్ది కాలం తర్వాత అతడి నిజరూపం బయటపడొచ్చు. ఏదేమయినా అతడి గురించి ఆలోచించడం అనవసరం.

మేఘన లేస్తూ "సరే అక్కా! నేనిక వెళ్లాస్తాను" అంది రాజేశ్వరితో.

"ఇప్పుడే ఇంటికెళ్లి చేసేదేముంది. మరి కాసేపు కూర్చో కూడదూ? "

"ఆఫీసు వర్క్‌తో బాగా అలసిపోయి ఉన్నాను. ఇప్పుడు మీ బాధ విన్నాక మనసు కూడా ఏదోలా అయిపోయింది. ఇంటికెళ్లి త్వరగా భోంచేసి పడుకుండిపోతాను"

రాజేశ్వరి లేచి నిలబడింది. "నా బాధలన్నీ చెప్పి నీ మనసును బాధపెట్టినట్టున్నాను కదూ మేఘనా? " ఆమె భుజం మీద చెయ్యేసింది.

ఇద్దరూ ఇంట్లోంచి బయటకు నడవసాగారు.

బాధపెట్టలేదు. ఒక నిజం గ్రహించేలా చేశారు. నేను మరింత జాగ్రత్తపడేలా నన్ను మార్చారు. పైకే అనాలనిపించింది. అనలేకపోయింది.

"అదేం మాటక్కా. బాధ అన్నది ఆప్తులతో పంచుకుంటేనే కొంత తగ్గుతుంది. నేను నీకు ఏవిధంగానూ సహాయపడలేక పోవచ్చు కాని నీ కథ నాకు తెలుసన్న తృప్తి నీ బాధను కొంత తగ్గిస్తుంది. అదే నాకు తృప్తికూడా"

ఇద్దరూ అప్పటికి ఆ ఇంటి గేటును సమీపించారు.

రోడ్డు దాటితే మేఘన తన ఇంటికి చేరుకుంటుంది.

గేటు దగ్గర ఆగాక రాజేశ్వరి మేఘన ముఖంలోకి చూస్తూ చెప్పింది. "మేఘనా! దయచేసి నా గురించి మీ ఇంట్లో ఏమీ చెప్పొద్దు. ఎందుకంటే గలగలా మాట్లాడే నన్ను చూసి వాళ్లు ఈ అమ్మాయికి ఏ బాధలూ లేవనే అనుకుంటున్నారు. వాళ్లను ఆ భ్రమలోనే ఉండనివ్వు. నా బాధలు వాళ్లకు తెలిస్తే వాళ్లు నన్ను జాలిగా చూడడం మొదలు పెడతారు. దాంతో కాసేపయినా ఆ ఇంట్లో నవ్వుతూ మాట్లాడుకోగలిగిన సంతోషాన్ని నేను కోల్పోతాను ప్లీజ్"

మేఘన గాఢంగా నిశ్వసించి నిలువుగా తలాడించింది. "వెళ్లొస్తానక్కా" అంటూ రోడ్డు దాటింది.

ఆ రాత్రి మరో నిద్రలేని రాత్రయింది మేఘనకు. రాజేశ్వరి మాటలే చెవులో గింగురుమనసాగాయి? ఏదేమయినా ఈ దేశంలో ఆడదానికి రెండో పెళ్లితో కష్టాలు మొదలయ్యే అవకాశమే ఎక్కువుంది.

★ ★ ★

అర్ధరాత్రి గడిచినా నిద్రపట్టక మేఘన బెడ్ దిగి కిటికీ దగ్గరకెళ్లి నిలబడింది.

అప్పుడే దూరంగా స్కూటర్ శబ్దం వినిపించింది. మేఘన తల తిప్పి అటు చూసింది.

కోదండం స్కూటర్ అతడి ఇంటి ముందు ఆగింది. అతడు స్కూటర్‌కి స్టాండ్ వేసి తూలుతూ ఇంటివైపు నడిచాడు.

కాలింగ్‌బెల్ నొక్కగానే అతడికోసమే ఎదురుచూస్తోందేమో రాజేశ్వరి వెంటనే

తలుపు తీసింది.

కోదండం వాకిట్లోనే నిలబడి ఆమెతో ఏదో గొడవ పడుతున్నాడు. వాళ్ల మాట లేవీ వినిపించడం లేదుగానీ వీధిలైటు వెలుగులో రాజేశ్వరి ముఖంలోని భావాలు స్పష్టంగానే కనిపిస్తున్నాయి. ఆమె ముఖం పాలిపోయి ఉంది.

అతడు చెయ్యెత్తాడు. ఆమె చెంప కంది పోయి ఉంటుందన్నది నిజం.

రాజేశ్వరి ఏడుస్తూ చెంప పట్టుకుని లోపలికెళ్లింది. వెను వెంటనే తలుపు మూసుకు పోయింది. ఆ రాత్రి పూర్తిగా నిద్రకు దూరమయింది మేఘన.

★ ★ ★

ఆఫీసు లోపలకు ఎంటర్ కాగానే దీపిక దగ్గరగా రమ్మని సైగ చేసింది.

మేఘన తల తిప్పుకుని ముందుకు నడిచింది.

క్యాబిన్‌లో కూర్చుని రొటీన్‌గా చేసే అకౌంట్స్ బుక్స్‌ని ముందేసుకుని కూర్చుంటే కొద్దిసేపు మాత్రమే ఏకాగ్రత కుదిరింది. ఆ తర్వాత యధాలాపంగా అటు చూసినప్పుడు ఖాళీగా కనిపించిన ఆ కుర్చీ కొద్దిక్షణాలపాటు చూపు మరల్చుకోకుండా చేసింది. గుండె లోతుల్లో కలుక్కుమన్నట్టు అదోరకమైన బాధ కలిగింది. మనసంతా అదోలా అయిపోయింది.

అంతలోనే ఆమె తననుతాను ప్రశ్నించుకుంది, 'ఏమిటిది? అతడు ఆఫీసుకి రాకపోతే నాకు మనసంతా అదోలా అయిపోవడమేమిటి? ' జవాబు స్పష్టంగా దొరకలేదు.

ఆమె కాలింగ్‌బెల్ కొడితే ఆఫీస్‌బాయ్ లోపలికొచ్చాడు. "ఏం కావాలి మేడమ్? "

"కాఫీ తెచ్చిపెట్టు"

"కాఫీనా? !" అతడు కాస్త ఆశ్చర్యంగా ఆమె ముఖంలోకి చూశాడు.

"అవును... ఏం? "

అతడు నవ్వేసి "ఏంలేదు మేడమ్. మీరెప్పుడూ ఆఫీసులో కాఫీ తాగలేదుకదా? అందుకని కాస్త ఆశ్చర్యపోయాను" అన్నాడు.

"ఓ... అదా!" ఆమె నవ్వేసింది. "కాస్త తల నొప్పిగా ఉందయ్యా, అందుకని..."

"సరే మేడమ్. ఓ రెండు నిముషాలలో తెచ్చేస్తాను"

ఆఫీస్ బాయ్ వెళ్ళిపోయాక అలసటగా అనిపించి మేఘన కుర్చీలోనే వెనక్కువాలింది.

రెండు నిమిషాలలోనే ఆఫీస్‌బాయ్ కాఫీ తెచ్చి ఆమె ముందుంచాడు.

"థాంక్స్ యాదగిరీ"

అతడు తలాడించి అవతలికెళ్ళిపోయాడు.

కాఫీ తాగడం పూర్తిచేసి ఆలోచనలను పక్కనపెట్టి పనిలో పడబోతుంటే, "హాయ్" అని వినిపించి మేఘన తలెత్తి చూసింది.

ఎదురుగా రేణుశ్రీ.

"హాయ్...! రా కూర్చో"

రేణుశ్రీ లోపలికొచ్చి కుర్చీలో కూర్చున్నాక చేతిలో ఉన్న స్వీట్ ప్యాకెట్ ఓపెన్‌చేసి చెప్పింది "స్వీట్ తీస్కోండి"

"విశేషం ఏమిటి? "

"మొన్నామధ్య ఓ కంప్యూటర్ ఇంజనీరు పెళ్ళిచూపులకు వచ్చాడని చెప్పానుకదా..."

గత ఆరునెలలుగా నెలకో సంబంధం చొప్పున, ఆమెను చూడడానికి వస్తూనే ఉన్నారు. ఓ వారం రోజులక్రితం కాబోలు ఓ కంప్యూటర్ ఇంజనీర్ తనను చూసి వెళ్ళాడని చెప్పింది రేణుశ్రీ. సో...

"ఆ... అవును"

"ఆ సంబంధం కుదిరిపోయింది"

"ఓ... కంగ్రాట్స్." మేఘన ప్యాకెట్‌లో నుండి స్వీట్ అందుకుంటూ, "మరి పెళ్ళెప్పుడు? " అనడిగింది.

"మరో వారం రోజుల్లో నిశ్చయ తాంబూలాలు పుచ్చుకుంటారు. బహుశా రెండు మూడు నెలల తర్వాత ముహూర్తాన్ని నిర్ణ

యిస్తారనుకుంటున్నాను"

"సో... మరి కొద్దిరోజుల్లోనే ఈ కుమారి, శ్రీమతి కాబోతోందన్నమాట"

రేణుశ్రీ కొద్దిగా సిగ్గుపడింది. "మీరు నిశ్చయ తాంబూలాలకి తప్పకుండా రావాలి. ముందురోజు నేను టైమ్, ప్లేస్ ఆ వివరాలన్నీ చెపుతాను"

"అలాగే"

రేణుశ్రీ వెళ్ళిపోయింది.

ఆ మధ్యాహ్నం లంచ్ అవర్‌లో కావ్య, రేణుశ్రీని ఆటపట్టిస్తూ అంది. "అయితే మరో మూడు నెలల తర్వాత నువ్వు నీ బాయ్‌ఫ్రెండ్‌ని మర్చిపోవాలేమోకదూ? "

వెంటనే దీపిక అడిగింది, "అంటే నీ ఉద్దేశ్యం... ఈ మూడునెలలు కూడా, అతడిని వదలకుండా తిరగమనా? "

"నేను చెప్పడమేముంది? మన రేణుశ్రీకి మూడునెలలు వృధా చేయడం అసలిష్టం ఉండదు. అబ్బా మొగుడొచ్చేసరికి మూడు నెలలవుతుంది కదా అని ఈలోపు ప్రతి రోజూ అతడితో తిరగకుండా ఉంటుందా? కావాలంటే నువ్వే అడుగు"

దీపిక రేణుశ్రీ వైపు తల తిప్పి చూసింది.

రేణుశ్రీ నవ్వేసింది, "కావ్య చెప్పింది కరక్టే... మూడు నెలలపాటు సంతోషాన్ని, స్వర్గానుభవాన్ని పోస్ట్‌పోన్ చేయడం ఎందుకు? మూడునెలల తర్వాత మొగుడు ఉంటాడు కాబట్టి ఎప్పుడు కావాలంటే అప్పుడు ఎంజాయ్ చేయొచ్చు కాబట్టి అప్పుడు బాయ్‌ఫ్రెండ్‌ని పూర్తిగా మరచిపోవడంలో అర్థముందిగానీ, ఇప్పుడే ఎప్పుడో రాబోయేవాడికోసం సంతోషాన్నంతా దూరం చేసుకోవడం పొరపాటు"

దీపిక నోట అప్రయత్నంగానే వెలువడిందా మాట "ఓసి నీ అసాధ్యం కూలా"

అందరూ పకపకా నవ్వేశారు.

చాలాకాలంగా ఉన్న చనువుతో అప్పటికి సంశయంగానే అడిగింది మేఘన. "అంతా బాగానే ఉందిగానీ, ఒకవేళ మీ వారికి రేపెప్పుడయినా నీ బాయ్‌ఫ్రెండ్ గురించి తెలిస్తే ఏం చేస్తావ్? "

"అసలు మీరింకా ఏ కాలంలో ఉన్నారండీ బాబూ! మీకు, నాకు ఓ నాలుగేళ్ళు తేడా ఉండొచ్చేమోగానీ, మీరు నలభై ఏళ్ళ వెనుక కాలంలో ఉన్నట్టుగా ప్రవర్తిస్తున్నారు"

మేఘన ఏమీ అనలేదుగానీ దీపిక రేణుశ్రీ మాటలను మధ్యలోనే కట్ చేసి చెప్పింది. "ఆ విషయాలొద్దుగానీ, అసలు విషయం చెప్పు. నీ పెళ్ళయ్యాక మీవారికి నీ బోయ్‌ఫ్రెండ్ గురించి తెలిస్తే ఏం చేస్తావు? "

"అదే చెపుతున్నానే... కాలం చాలా మారిపోయింది. కుర్రాళ్ళ ఆలోచనల్లోనూ చాలాచాలా మార్పులొచ్చేశాయి. వాళ్ళు కాలేజీ లైఫ్‌లో ఓ గర్ల్‌ఫ్రెండ్‌ని మెయిన్‌టెన్ చేస్తున్నట్టే రేపు వాళ్ళ జీవితంలో ప్రవేశించే అమ్మాయికి ఓ బోయ్‌ఫ్రెండ్ తప్పక ఉండి ఉంటాడని వాళ్ళు ముందుగానే ఊహించేస్తున్నారు. అందుకే వాళ్ళిప్పుడు ప్రస్తుతం యూత్‌లో కొంత పర్సంటేజ్ 'ఎస్.కె.పి'లే అని జోక్ చేసుకుంటున్నారు. ఎస్.కె.పి. అంటే తెలుసుకదా? 'షాదీకా పహెలే...' అంటే పెళ్ళికి ముందే అన్నీ జరిగిపోవడం అన్నమాట. ఈమాట విని పెద్దలు గుండెలు బాదుకోవచ్చుగానీ యూత్ ఈ మాటలు చాలా క్యాజువల్‌గా మాట్లాడుకుంటోంది. ఈ విషయాన్ని చాలా సర్వసాధారణమైనదిగా భావిస్తోంది. అంటే కాలంలో మార్పొచ్చిందన్నమాట. సో... వాళ్ళిప్పుడు వాస్తవాన్ని అర్థం చేసుకుంటున్నారో, విశాల దృక్పథంతో వ్యవహరిస్తున్నారో తెలియదుగానీ, నేటి కంప్యూటర్ కాలంలోని అమ్మాయిలకు పెళ్ళికిముందు బోయ్‌ఫ్రెండ్ ఉండడం సర్వసాధారణమైన విషయం. షాదీకా పహెలే కుచ్ కుచ్ హోతా హై' అవన్నీ మనం పట్టించుకోకూడదు. కాక

పోతే పెళ్ళయ్యాక వాళ్ళు మన దగ్గర పర్ఫెక్ట్‌గా ఉంటే అంతే చాలు అని మనసులో అనుకుంటున్నారు. అలాగే బిహేవ్ చేస్తున్నారు" చెప్పడం ఆపింది రేణుశ్రీ.

"యూ మీన్ నీకు రాబోయే మొగుడు చాలా విశాల దృక్పథంతో 'షాదీకా పహెలే కుచ్ కుచ్ హోతాహై... అవన్నీ మనం పట్టించుకోకూడదు' అని నిన్ను నెత్తిన పెట్టుకుని పూజిస్తాడని అనుకుంటున్నావా? " దీపిక అడిగింది.

"నెత్తిన పెట్టుకుని పూజించకపోయినా అర్థం చేసుకుంటాడనే అనుకుంటున్నాను"

"ఒకవేళ నిన్ను అర్థం చేసుకోలేని మగాడు, ఆడదంటే పవిత్రత అంటూ లెక్చర్స్ ఇచ్చే మొగుడు వస్తే అప్పుడేం చేస్తావ్? "

రేణుశ్రీ ఈసారి కొద్దిసేపు ఆలోచించింది.

ప్రవాహంలోపడి ఈదులాడుతున్నప్పుడు ఏ ఆలోచనలూ రావు. ఈతలో ఆనందం, మునకలో మధురానుభవం మనిషిని ఉక్కిరిబిక్కిరి చేసేస్తూ ఉంటుంది. ఒడ్డుకి చేరాక ఒక్కసారిగా ఆలోచనలు చుట్టుముడతాయి.

'అవునూ! ఒకవేళ అలా జరిగితే? ' అన్న ఆలోచన రేణుశ్రీ మదిలో అప్పుడే జనించినట్టుంది. అందువల్లే ఆలోచించడానికి ఎక్కువ సమయం తీసుకున్నాక చెప్పింది.

"ఒకవేళ అలాంటి మగాడే నా జీవితంలోకి వస్తే, నేను కాస్త జాగ్రత్తపడతాను. అతడి మనస్తత్వం అర్థం చేసుకున్న వెంటనే అతడి మాటలనే నేనూ రిపీట్ చేయడం మొదలుపెడతాను. 'ఛీఛీ అమ్మాయిలు మరీ బరితెగించిపోతున్నారండి. ఏ కాలేజీ ముందు చూసినా అబ్బాయిలు, అమ్మాయిలు కలిసిపోయి మాట్లాడుకుంటున్నారు. రెస్టారెంట్లు, సినిమా హాల్స్‌లోనూ జంటలు జంటలుగా కనిపిస్తున్నారు. ఆ దృశ్యాలు చూస్తుంటేనే అసహ్యమేస్తుంది. మేం అలా చేసేవాళ్ళమే కాదండి. మాకు అమ్మానాన్నలంటే భయం ఉండేది. అందువల్లే తలొంచుకుని కాలేజీకి వెళ్ళి కాలేజీ వదలగానే తలొంచుకుని ఇంటికి వచ్చేసేవాళ్ళం తెలుసా? ' అని అతడి దృష్టిలో గొప్ప బిల్డప్ ఇచ్చుకోవడం మొదలుపెడతాను. సాధారణంగా ఏ మగాడయినా భార్య మాటలను వెంటనే నమ్మేస్తాడు. అతడూ నమ్మాలి. ఒకవేళ నమ్మకుండా ఉన్నా, ఏదయినా ఊహించని పరిస్థితుల్లో నా బోయ్‌ఫ్రెండ్ విషయం బయటపడిపోయినా ఈజీగా గొడవపడి, ఇమిడియట్‌గా పుట్టింటికి చేరిపోతాను. అతడో అనుమానం మనిషి. సూటిపోటి మాటలతో చిత్రహింసలు పెడతాడని అంటే జనం సానుభూతి మనమీదే ఉంటుంది. అప్పటికీ అతడు మారకపోతే మరో ఆలోచన లేకుండా విడాకులు తీసుకుంటాను"

ఆలోచించి చెప్పింది కాబట్టి అది ఆమె ఆలోచనాధోరణి అన్న విషయం మిగిలిన ముగ్గురికీ తెలిసింది.

ఈ కాలంలో కొంతమంది అమ్మాయిలు తప్పకుండా రేణుశ్రీలాగే ఆలోచిస్తున్నారన్నది నిజం.

ఎందువల్లో ఆ ముగ్గురూ ఆ నిజాన్ని వెంటనే జీర్ణించుకోలేకపోయారు.

"మొత్తంమీద నీ ఆలోచనా ధోరణి బాగుందే" ఇక విషయాన్ని తేల్చేయక తప్పదన్నట్టుగా నవ్వేసి ఆ టాపిక్‌ని అక్కడితో కట్ చేసేసింది దీపిక.

భోజనాలు ముగిశాయి.

ఎవరి సీట్లలోకి వాళ్ళు తిరిగి వెళ్ళిపోయారు.

మేఘన తన సీట్లోకెళ్ళి కూర్చుందేగానీ పనిమీద కాన్సన్‌ట్రేషన్ చేయలేకపోయింది. రేణుశ్రీ మాటలచుట్టూనే మనసు పరిభ్రమించసాగింది.

'రేణుశ్రీ దృష్టిలో పెళ్ళికి ముందు బోయ్‌ఫ్రెండ్‌తో తిరగడం తప్పుకాదు. పైగా ఈ కాలంలో చాలామంది కుర్రాళ్ళు ఆ విష

యాన్ని క్యాజువల్‌గా తీసుకుంటున్నారనీ వాదిస్తోంది.' అందులోనూ కొంతవరకూ నిజం ఉంది. ప్రస్తుత తరంలో కొంతమంది కుర్రాళ్ళు రేణుశ్రీ చెప్పినట్టే ఆలోచిస్తు న్నారు. ఓ ఆడపిల్ల పెళ్ళికిముందు చేసిన తప్పును అర్థం చేసుకుని భరించగలిగే ఆ కుర్రాళ్ళ ఆలోచనలు అంతకన్నా మరికాస్త ముందుకెళ్ళగలిగితే ఎంత బాగుండును. మార్పొస్తూ ఉంది. పెళ్ళికాని ఆడపిల్ల నే కాదు, పెళ్ళయ్యి భర్తను కోల్పోయిన ఆడ దాని మనసునూ అర్థం చేసుకునే మన స్తత్వం మగాళ్ళలో వస్తూ ఉంది. అయితే అందుకు ఇంకా కొంత సమయం పడుతుం దేమో'

ఆమె అతికష్టంమీద మనసును పనిలో లగ్నం చేసింది.



రెండోరోజు కూడా ధీరజ్ కుమార్ ఆఫీసుకు రాలేదు.

మేఘన మనసులో ఆతృత మొదలయ్యింది.

'ఏం జరిగింది? ధీరజ్ కుమార్ ఆఫీసుకి ఎందుకు రావట్లేదు'

మూడోరోజూ అతడు ఆఫీసుకు రాకపోయేసరికి మేఘన ఇక ఆతృత ఆపుకోలేకపోయింది. ఏదో పని ఉన్నట్టు రిసెప్షన్ దగ్గరకెళ్ళి దీపికను అడిగింది "ధీరజ్ కుమార్ గారు ఈరోజు కూడా ఆఫీసుకు రాలేదెందుకని? "

"ఆయన ఆఫీసుకు రాకపోతే మీకొచ్చిన నష్టం ఏమీలేదుకదండీ. మీ పనిని మీరు చేసుకుంటూపోండి"

ఏమనాలో తెలియక ఆమె తటపటాయిస్తూ వెనుదిరగబోతుంటే దీపిక నవ్వింది.

మేఘన ఆగి వెనుతిరిగి చూసింది.

"ఏమిటి? పని గురించిన ప్రోబ్లమ్ లేదు గానీ అతడికేమయిందో అన్న ఆతృత ఎక్కువయిందన్నమాట"

మేఘన ఒక అడుగు ముందుకేసింది.

"ఆగండి మేఘనగారూ..."

మేఘన ఆగిపోయింది.

"ధీరజ్ కుమార్ గారికి న్యూమోనియా జ్వరం వచ్చింది. ఆయనిప్పుడు హాస్పిటల్‌లో వున్నారు"

మేఘన కంగారుగా దీపిక మొహంలోకి చూసింది.

"ఆయన హాస్పిటల్‌లో ఉన్న విషయం నిన్ననే నాకు తెలుసు. కానీ నీకు తెలియచేయాల్సిన అవసరం లేదనే అనుకున్నాను. ఎందుకంటే ఆయనంటే నీకు ఎలాగూ సదభిప్రాయంలేదు కాబట్టి"

మేఘన తలొంచుకుంది.

"అన్నట్టు మరో విషయం కూడా నీకు చెప్పలేదు"

ఆమె తలెత్తి చూసి "ఏమిటి? " అని అడిగింది.

"ఈరోజు సాయంత్రం నేను ధీరజ్ కుమార్‌ని చూడడానికి వెళ్తున్నాను"

మేఘన తలొంచుకుని తన క్యాబిన్‌లోకి వెళ్ళిపోయింది.

ఆ సాయంత్రం ఆఫీసు అవర్స్ అయిపోయాక మేఘన ఇంటికి బయల్దేరబోతుంటే, దీపిక క్యాబిన్‌లోకి వచ్చింది.

ఎప్పుడూ తన క్యాబిన్‌లోకి రాని దీపిక అలా వచ్చేసరికి మేఘన కొద్దిగా ఆశ్చర్యపడి "హాయ్! ఏమిటిలా వచ్చావ్? " అంది.

"అదే ఉదయం చెప్పానుకదా,

సాయంత్రం ధీరజ్ కుమార్‌ని చూడడానికి హాస్పిటల్‌కి వెళ్తున్నానని... అది చెప్పాలనే వచ్చాను"

మేఘన పెదవులు బిగపట్టింది. ఏం చెప్పాలో కొద్దిక్షణాలు అర్థంకాలేదు.

ఆమె సంశయం గమనించినట్టు దీపిక "రాదల్చుకుంటే బయల్దేరండి వెళ్దాం" అంది.

మిగిలిన అన్ని విషయాలూ పక్కనపెడితే అతడు తనకు బాస్ తర్వాత బాస్‌లాంటివాడు. అతడు అనారోగ్యంతో హాస్పిటల్‌లో చేరాడని తెలిశాక కూడా పరామర్శించకపోవడం ఖచ్చితంగా పొరపాటే అవుతుంది. సో...

"వెళ్దాం పద దీపికా!"

మేఘననోట ఆ మాట వినిపించడంతోనే దీపిక పెదాలు చిరునవ్వుతో విచ్చుకున్నాయి "రండయితే" అంది.

ఇద్దరూ ఆఫీసులోనుండి బయటకు నడిచారు.

ఓ ఆటోను ఆపి, అడ్రస్ చెప్పింది దీపిక. ఆటోవాడు తలాడించాక ఇద్దరూ ఆటోలో కూర్చున్నారు.

పది నిముషాల తర్వాత ఆటో ఓ హాస్పిటల్ ముందు ఆగింది.

ఆటోవాడికి డబ్బులు దీపికే ఇచ్చింది.

ఇద్దరూ లోపలికి నడిచారు.

దీపిక రిసెప్షన్‌లో అడిగితే రూం నెంబర్ తెలిసింది.

ఇద్దరూ అటుగా నడిచారు.

కారిడార్‌లో నడుస్తూ ఒక్కో రూమ్ నంబర్ చూసుకుంటూ పాతిక అడుగులేశాక ఆ నంబర్ కనిపించింది.

దీపికనే ముందుగా రూంలోకి అడుగుపెట్టింది. వెనుకే మేఘన నడిచింది.

ధీరజ్ కుమార్ కళ్ళు మూసుకుని ఉన్నాడు. ఎప్పుడైతే తలుపు చప్పుడయిందో అప్పుడే కళ్ళు తెరిచాడు. వాళ్ళిద్దర్నీ చూడడంతోనే అతని కళ్ళు విప్పారాయి. వెనువెంటనే పెదాలమీద చిరునవ్వు ఉదయించింది. ముఖ్యంగా అతడి చూపులు మేఘనమీదే నిలిచిపోయాయి.

దీపిక అతడి దగ్గరగా నడిచి "హలో సార్. ఎలా ఉంది మీకు? " అంటూ ప్రశ్నించింది.

"ఈరోజు కాస్త కోలుకున్నాను... కూర్చోండిలా" అన్నాడు ధీరజ్ కుమార్.

దీపిక బెడ్‌మీదనే కూర్చుంటే మేఘన పక్కన ఉన్న స్టూల్ లాక్కుని కూర్చుంది.

అంత దూరం వచ్చాక తను పెదవి విప్పకుండా ఉండడం బాగుండదనిపించి మేఘన అడిగింది, "మీ ఆరోగ్యం మెరుగయినట్టేకదా? "

ఆమె మాట్లాడడంతో అతడి ముఖంలో సంతోషం కొట్టొచ్చినట్టు కనిపించడం గమనించింది దీపిక.

అతడు తలాడిస్తూ మేఘనకు జవాబు చెప్పాడు. "మరో రెండు, మూడురోజుల్లో ఇంటికి వెళ్ళచ్చని చెప్పారు డాక్టర్లు"

దీపిక చుట్టూ పరిశీలించి చూసింది. అతడికి పెళ్ళికాలేదు కాబట్టి భార్యలేదు. కానీ అతడి కుటుంబసభ్యులు ఎవరైనా హాస్పిటల్‌లో ఉండాలికదా... మరి ఎవ్వరూ కనిపించరే...

ఆ విషయమే దీపిక అతడిని అడిగింది, "మీ వారెవ్వరూ కనిపించడంలేదు, కనీసం మిత్రులెవరయినా...? "

"మీకు తెలుసనే అనుకుంటున్నాను. నాకు ముందూవెనుకా ఎవ్వరూలేరు. అలాగే ఇలాంటివేళ అండగా నిలిచే ఫ్రెండ్ సర్కిలూ నాకు లేదు"

దీపిక నిలువుగా తలాడించింది.

అతడి గురించి కొంత తెలుసు. కానీ పూర్తిగా తెలియదు. 'అంటే ముందూ వెనకా ఎవరూ లేరనే అంటున్నాడంటే అసలు ఎవరూలేని అనాధనా? లేక అయినవాళ్ళందరినీ వదిలేసిన ఒంటరా? ' దీపికకు ఆ విషయం తెలుసుకోవాలనిపించింది.

# ఏరినముత్యాలు

* వివేకులు తమ కాలాన్ని విజ్ఞాన సముపార్జనకు వినియోగిస్తారు. అవివేకులు చెడు అలవాట్లతో, నిద్రపోవడం ద్వారా తమ కాలాన్ని వృధా చేసుకుంటారు.

– సంస్కృత సామెత

* చక్కని ప్రతిభకి సరైన తోడ్పాటునివ్వడం ప్రతిభని సృష్టించినంత గొప్ప విషయం.

– ఎడ్గర్ డబ్ల్యూ.వర్క్

* ఇతరులని చూసి మనం అసూయపడ్తున్నామూ అంటే... వారికన్నా మనం తక్కువని మనకి మనమే ఒప్పుకుని బాధపడుతున్నామని అర్థం.

– జూలా జెన్నీ ఎలియనోర్

* తాను ప్రవేశించిన పాత్రయొక్క స్వరూపాన్ని పొందే నీటిలాగే బుద్ధిమంతుడైన వ్యక్తి పరిస్థితులకు అనుగుణంగా తననితాను సరిదిద్దుకుంటాడు.

– చైనీస్ సామెత

* మనం ప్రేమించగలిగితే హాయిగా యజమానులు అవవచ్చు. అలాకాక ద్వేషించడం మొదలెడితే బానిసలం కాకతప్పదు.

– డాగొబర్ట్ డీ. రూనెస్

* డబ్బుతో మిత్రులని సంపాదించడం సులభం. కానీ డబ్బు లేకుండా మిత్రులను సంపాదించుకోవడం అసలైన గొప్పతనం.

–క్రిష్టఫర్ బావిస్టర్

* ప్రపంచంలో ప్రతి మనిషీ ఏదో ఒకవిధంగా పనికివస్తాడు. ప్రతి జీవితానికి అర్థం, ఓ ప్రయోజనం ఉండితీరతాయి.

– నథానియల్ హాథార్న్

* మన వ్యవహారాల విషయంలో మనం మనసుతో ఆలోచించాలి. ఇతరుల వ్యవహారాల విషయంలోనైతే హృదయంతో స్పందించాలి.

–చార్లెస్ జీ. రెయినర్

* మనిషి జీవితంలో అతిముఖ్యమైనది దీక్ష, దీక్షతోపాటు మనిషికి ఎల్లప్పుడూ కావలసింది నిజాయితీగా ఉండడం, అలసట లేకుండా పరిశ్రమించడం.

–ఆండ్రూ కార్నిజ్

* జీవితం ఎంతో చిన్నదని మళ్లీ మళ్లీ మథనపడుతూనే మనిషి అశ్రద్ధతో, వృథా కాలాయాపన కారణంగా చిన్న జీవితాన్ని మరింత చిన్నదిగా కుదించుకుంటాడు.

–విక్టర్ హ్యూగో

* విజయం మనలని ఒకచోట నుండి మరోచోటికి మోసుకుని తీసుకువెళ్లే ఎస్కలేటర్ కాదు. అది మనకై మనం మెట్లెక్కి వెళ్లవలసిన నిచ్చెనలాంటిది.

–ఎడోవర్ పెయిలరస్

సేకరణ: టి. మహి

అయితే అది సమయమూ, సందర్భం కాదనిపించి ఊరకుండిపోయింది.

వాళ్ళిద్దరూ మరికాసేపు అక్కడ కూర్చున్నారు.

దీపికనే అతడితో అవీఇవీ మాట్లాడింది.

'వీలయితే మరోసారి వస్తానని' చెప్పి దీపిక లేచింది.

మేఘన మాత్రం "వస్తానండి" అని అతడితో అంది.

అతడు తలాడిస్తూ ఆమె కళ్ళల్లోకి చూశాడు. అప్రయత్నంగానే చూపులు కలుసుకున్నాయి.

ధీరజ్‌కుమార్ కళ్ళలో ఓ భావం స్పష్టంగా కనిపించిందామెకు. "నాకోసం వచ్చినందుకు కృతజ్ఞతలు మేఘనా"

ఆమె తల తిప్పుకుని దీపికను అనుసరించి బయటకు నడిచింది.

హాస్పిటల్‌నుండి బయటకొచ్చాక దీపిక మేఘనతో అంది, "చూశారా మేఘనగారూ! మిమ్మల్ని చూడడంతోనే ఆయన ఎంత సంతోషపడ్డారో. ఎందుకనో మీరు ఆయనను అపార్థం చేసుకున్నారు. ఆ అపార్థంలో ఆయనను బాధపెడుతూ మీరు బాధపడుతున్నారు"

మేఘన వెంటనే చెప్పింది "నేనేం బాధపడడంలేదు"

"అనాలనుకుంటే ఎలాగైనా అనొచ్చు మనసును నొక్కిపెట్టి బుకాయించొచ్చు కానీ మీ మనసు లోతుల్లోకి వెళ్ళి పరిశీలించి చూసుకోండి. మీరు బాధపడుతున్నారో లేదో మీకే అర్థమవుతుంది"

మేఘన ఆగి తలెత్తి దీపిక ముఖంలోకి చూస్తూ "అంటే నీ ఉద్దేశ్యం? "

"మీకు తెలుసు. ధీరజ్‌కుమార్ వ్యక్తిత్వం ఉన్న మనిషని. అలాంటివాడు మిమ్మల్ని ఇష్టపడ్డాడు. తన జీవితంలోకి ఆహ్వానించాడు. కానీ మీరేదో అనుమానంతో భయపడిపోతున్నారు. వాస్తవానికి దూరంగా పరుగెడుతున్నారు. అలా పరుగెడుతూ మీ మనసు చెప్పేది వినిపించుకోకుండా బాధను దిగమింగుకుంటున్నారు"

"లేదు. నేను వాస్తవానికి దూరంగా పరుగెట్టడం లేదు. వాస్తవం తెలుసుకునే జాగ్రత్తపడుతున్నాను. ఆ స్థితిలో బాధను దిగమింగుకోవలసి వస్తే అది తప్పదు. ఎందుకంటే భవిష్యత్తులో భయంకర బాధను అనుభవించడం, ప్రస్తుతం మనసును వంచించుకోవడం వల్ల వచ్చే బాధను పోల్చి చూసుకుంటే ఈ బాధను భరించడమే మేలు" మేఘన గొంతు జీరపోయింది.

"మేఘనగారూ! మీరు... మీరేమంటున్నారు? " ఆమె గొంతులోని జీర గమనించి తత్తరపాటుతో ప్రశ్నించింది దీపిక.

"నువ్వు సమస్యను ఒకవైపు మాత్రమే చూసి విశ్లేషిస్తూ ఉన్నావ్. కాని నేను సమస్యను రెండోకోణంలోనుంచి చూసి మనసును కంట్రోల్ చేసకుంటున్నాను. ప్రస్తుతం కొంత బాధను దిగమింగుకుంటున్నాను"

"నాకు నాకేం అర్థంకావడంలేదు మేఘనా"

"అర్థమయ్యేలా చెప్పాలంటే ఇప్పుడు చెప్పలేను. మరోసారి ...మరోసారి నీకు అర్థమయ్యేలా చెపుతాను వెళ్దాంపద"

మేఘన మనసులో ఏముందో వెంటనే తెలుసుకోవాలనిపించింది దీపికకి. కాని ఆమె చెప్పేమూడ్‌లో లేదని తెలిశాక మరేం ప్రశ్నించలేదు.

"సరే వెళ్దాం పదండి"

ఇద్దరూ ముందుకు నడుస్తున్నప్పుడు దీపికనే అడిగింది. "మీరు బాగా డిస్టర్బ్ అయినట్టున్నారు. పోనీ కాస్త రిలాక్స్ కావడం కోసం అలా ఏదయినా రెస్టారెంట్‌కెళ్లి కాఫీ తాగుదామా? "

"వద్దు ఇప్పటికే ఆలస్యమయిపోయింది. నేను త్వరగా ఇంటికెళ్లాలి"

"సరయితే"

ఇద్దరూ బస్టాప్ వైపు నడిచారు.

ఓ నిమిషంలోపే మేఘన ఎక్కాల్సిన బస్సు వచ్చింది.

"ఓకే నేను రేపు కలుస్తాను"

"మనం రేపు కలవలేంలెండి"

"ఎందుకని? "

"రేపు ఆదివారం కాబట్టి"

మేఘన నవ్వేసి బస్సెక్కేసింది.

దీపిక బస్టాప్‌లోనే నిలబడిపోయింది.

ఆమె మేఘన గురించే ఆలోచించసాగింది. మేఘన స్థితికి ధీరజ్‌కుమార్‌లాంటి వాడు పెళ్లిచేసుకుంటానంటే అది తన అదృష్టంగా భావించాలి ఆమె. కాని ఆమె అది తన అదృష్టంగా భావించడంలేదు. అసలా ఆలోచనే లేనట్టు అతడిని పట్టించుకోవడం లేదు. మేఘన ఇలా ఎందుకు చేస్తోంది. ఇది ఆమె అనాలోచితంగా చేస్తోందనిపించడంలేదు. మరి ఆమె ఈ ప్రవర్తనకు కారణం ఏమిటి?

బస్సు రావడంతో ఆలోచనను పక్కన



పెట్టి బస్సెక్కేసింది దీపిక.

★ ★ ★

ఆదివారం అంటే సిటీజనానికి ఉత్సాహం. ఉదయమే లేవనక్కర్లేదు. ఉరుకులు పరుగులతో తయారుకానక్కర్లేదు. నరకాన్ని గుర్తుకు తెచ్చే బస్సులో ప్రయాణించి ఆఫీసుకి చేరనవసరంలేదు. ఆఫీసులో టెన్షన్స్ భరించే పనీలేదు.

ఆదివారం ఆటవిడుపు. అది తమ సంతోషం కోసం కేటాయించబడినరోజు.

ఆఫీసులకెళ్లేవాళ్లకే కాదు, ఇంట్లోనే ఉండే ఆడాళ్లకూ ఆదివారం ఆనందాన్నే కలిగిస్తుంది. వాళ్లూ ఉదయమే లేచి బాక్స్‌లు సర్దనవసరంలేదు. హడావుడిగా పిల్లల్ని రెడీ చేయించి స్కూలుకి పంపడం, ఆఫీసులకెళ్లే వాళ్లకు అన్నీ సమకూర్చడంలాంటి పనులు తప్పిపోతాయి. పైగా ఆరోజు తీరికగా ఏ బంధుమిత్రుల ఇళ్లకో వెళ్లి ఎంజాయ్ చేసే అవకాశమూ ఉంది. లేదంటే సినిమాకో, షికారుకో వెళ్లొచ్చు.

మామూలు పరిస్థితుల్లోనయితే ఆదివారం అనగానే మేఘన కాస్త రిలాక్స్‌గా ఫీలయ్యేదికానీ ఆరోజెందుకో ఆదివారమయినా ప్రశాంతంగాకాక మనసంతా అనీజీనెస్‌తో నిండిపోయింది.

ఎందుకిలా? ఎందుకిలా? అని ప్రశ్నించుకుంటే హాస్పిటల్‌లో బెడ్‌మీద పడున్న ధీరజ్‌కుమార్ కళ్లముందు కదలాడాడు. అయితే మన అనీజీనెస్‌కి అతడిని గురించిన ఆలోచనే కారణమా? ఏమో! అయినా అతడికి అనారోగ్యమయితే తనకెందుకిలాంటి ఫీలింగ్? ఏదో తోచింది. కాని అది సరయిన సమాధానం కాదని మనసుకు సర్దిచెప్పుకుంది.

ఆ మధ్యాహ్నం భోంచేశాక మాత్రం మనసిక ఉండబట్టలేదు. పాపం ఒంటరివాడు. ఎవ్వరూ పక్కన లేకుండా బెడ్‌మీద పడి ఉండడమంటే అసలు ఒంటరితనమే ఒక శాపమయితే అందుకు అనారోగ్యం తోడయితే ఆ బాధ ఎంత భయంకరంగా ఉంటుందో ఊహించడం కష్టమే. పోనీ తనకీరోజు ఎలాగూ శలవే, ఇంట్లో ఉండి చేసేదీ ఏమీలేదు. కాబట్టి ఒకసారి అలా హాస్పిటల్ వరకూ వెళ్లొస్తే?

నిర్ణయానికి రావడానికి ఓ రెండు గంటలు అవసరపడ్డాయి. అప్పటికి సమయం సాయంత్రం నాలుగు గంటలయింది.

మేఘన తల్లితో చెప్పింది "అమ్మా నేనలా నా కొలీగ్ ఇంటి వరకూ వెళ్లొస్తాను"

"అలాగేనమ్మా"

మేఘన ఇంట్లోంచి బయటకు నడిచింది.

సెంటర్ చేరుకున్నాక కొన్ని పళ్లుకొని చేతపట్టుకుంది. అటుగా వస్తున్న ఆటోని ఆపి, అడ్రస్ చెప్పి ఎక్కి కూర్చుంది.

హాస్పిటల్ వైపు ఆటో వెళ్తుంటే మనసులో ఉద్విగ్నత చోటు చేసుకోసాగింది. ఇలా బయలుదేరి తను తప్పుచేయడం లేదుకదా? తన రాకను అతడు అపార్థం చేసుకుంటాడా? లేక ఆనందంతో ఉబ్బితబ్బిబ్బవుతాడా?

ఆటో హాస్పిటల్ ముందు ఆగింది.

మేఘన ఆటో దిగి డ్రైవర్‌కి డబ్బులిచ్చి హాస్పిటల్ లోపలికి నడిచింది.

ఆమె డోర్ తెరిచేసరికి ధీరజ్‌కుమార్ బెడ్‌మీద పడుకుని కళ్లుమూసుకుని ఉన్నాడు. ఏప్పుడయితే చప్పుడయిందో అప్పుడే కళ్లు తెరిచాడు.

మేఘనను చూడడంతోనే అతడి కళ్లు విప్పారితాలయ్యాయి. ఆ దృశ్యం తన భ్రమకు నిదర్శనమేమో అనిపించినట్టుంది. వెంటనే తల విదిలించాడు.

అతడి ముఖంలోని ఫీలింగ్స్ గమనిస్తూనే ఆమె లోపలికి నడిచి "గుడ్ ఈవెనింగ్ సార్" అంది చేతిలోని బ్యాగ్ పక్కన పెట్టాక చేతులు జోడిస్తూ.

"గుడ్... గుడ్ ఈవెనింగ్" అప్పటికిగాని

అతడికి అది తన భ్రమకాదు అని నిర్ధారణ జరిగినట్టుంది. ఎందుకనో గుండెవేగం కొద్దిగా పెరిగింది. "కూర్చోండి"

ఆమె పక్కనే ఉన్న స్టూల్ మీద కూర్చుని చెప్పింది "ఒంటరిగా ఉన్నారు కదా? ఒకసారి పలకరించి వెళ్దామనిపించింది"

అతడి ముఖంలో మెరుపు ఈసారి స్పష్టంగా కనిపించింది.

"థాంక్స్"

ఏం మాట్లాడాలో తెలియనట్టు ఇద్దరూ కొద్దిక్షణాలు నిశ్శబ్దంగా ఉండిపోయారు.

ఆ నిశ్శబ్దాన్ని ఛేదించవలసిన అవసరం తనదే అనుకున్నట్టున్నాడు అతడు. "చెప్పండి! ఆఫీసు కబుర్లేమిటి? "

"ఆఫీసు కబుర్లా? ఆఫీసు కబుర్లేమున్నాయి. నేను డే బుక్ మెయిన్‌టిన్ చేస్తూ లెడ్జర్ పోస్టింగ్ చేసేస్తున్నాను. ఇక మీరొచ్చాక స్టేట్‌మెంట్స్ తయారు చేయాల్సి వస్తుంది"

"అలాగే"

రెండు మాటలతోనే ఆఫీసు విశేషాలు చెప్పేసినట్లుగా ఫీలయ్యింది మేఘన. దాంతో మౌనంగా ఉండిపోయింది. మళ్లీ చుట్టూ నిశ్శబ్దం పేరుకుపోతే అతడు కాసేపు ఆలోచించాక అడిగాడు. "మీ ఇంటి విశేషాలేమయినా చెప్పండి"

ఆమె చప్పున అతడి ముఖంలోకి చూసింది. నా ఇంటి విశేషాలు తెలుసుకోవడం అవసరమా? అన్న ప్రశ్న నోటి చివరవరకూ వచ్చి ఆగిపోయింది. అతడి ముఖంలోకి చూశాక మాత్రం ఆ మాట అడగలేకపోయింది.

అప్రయత్నంగానే తన కుటుంబ విశేషాలు చెప్పసాగింది.

ఆమె ఇంటి విశేషాలు కొంతసేపు విన్నాక అతడు ఉన్నట్టుండి అడిగాడు "మీ కుటుంబ పరిస్థితి అర్ధమయింది. మరి మీ భవిష్యత్తు గురించి మీరేమాలోచిస్తున్నారు? "

అతడేమన్నాడో ఆమెకు వెంటనే అర్ధం కాలేదు. అర్ధమయ్యాక కూడా కొంత అయోమయం మిగిలింది. "మరి మీ భవిష్యత్తు గురించి మీరేమనుకుంటున్నారు? ఇప్పుడు మీకు మీ అమ్మానాన్నలున్నారు. ఆడపిల్లకు ఎవరో ఒకరు తోడుండడం ఎంతో అవసరం. కాని అమ్మానాన్నలు జీవితాంతం తోడుండలేరు. మీ చెల్లి పెళ్లిచేసుకుని వెళ్లిపోతే మీకంటూ ఎవరు మిగులుతారో ఆలోచించుకోండి"

అయోమయం విడివడింది. కాని అంత దూరం ఆలోచించడానికి మనసు ఒప్పుకోలేదు. అంతకుమించి తనను అతడు అతడి దారిలోకి మళ్లించుకునే ప్రయత్నమే అది అని భావించడంవల్ల మనసును బలవంతంగా పక్కదారికి మళ్లించింది.

చాలాసేపటి వరకూ ఆమె జవాబు కోసమే ఎదురు చూసిన అతడు ఆమె మౌనంగా ఉండిపోవడంతో తనే ప్రశ్నించాడు. "జవాబు చెప్పరేంటి? "

చెప్పక తప్పదనిపించి ఏదో చెప్పాలన్నట్టు పలికిందామె "అంటే నా భవిష్యత్తు గురించి నేను ఆలోచించుకోవట్లేదంటారా? "

"ఆలోచించుకుని ఉంటే ఇంత స్థిమితంగా ఉండలేరు. మనసు పడ్డ వ్యక్తిని మౌనంగానే పక్కకు తప్పించేయడమూ చేసి ఉండరు"

"లేదు... నా భవిష్యత్తు గురించి నేను బాగానే ఆలోచించుకుని ఉన్నాను"

ఆమె మనసులోని మాట బయటకు లాగగలిగిన సమయం అదేనన్న విషయం అతడికి అర్ధమయింది. అందువల్లే అతడు రెచ్చగొడుతున్నట్లుగా ఉన్నాడు. "ఏం ఆలోచించుకున్నారో చెప్పండి. అమ్మానాన్నలు మిమ్మల్ని వదలలేక వదలలేక ఈ లోకం విడిచి వెళ్తే, చెల్లెలు తప్పనిసరి పరిస్థితుల్లో పెళ్లి పేరుతో దూరంగా వెళ్లిపోతే అప్పుడు... అప్పుడు మీరు ఒంటరిగా మిగిలిపోయి ఇదే అసలు సిసలు జీవితం అను

కోగలరా? చెప్పండి"

"అవును. అవసరపడితే ఒంటరి జీవి తాన్నే అనుభవిస్తాను. లేదంటే ఏ ఆశ్రమం లోనో చేరిపోయి ప్రశాంతంగా గడిపేస్తాను. అంతే తప్ప రెండో పెళ్లి పేరుతో కష్టాలు కొనితెచ్చుకోను" మేఘన గొంతులో కొంత ఆవేశం ప్రతిధ్వనించింది.

"రెండో పెళ్లి వల్ల కష్టాలేమున్నాయి?" అతడు ఆశ్చర్యంగా ఆమెకేసి చూశాడు.

"ఎందుకుండవు? నేను రోజూ చూస్తూనే ఉన్నాను. మా ఎదురింటి రాజేశ్వరక్క పడే కష్టాలను చూస్తూనే ఉన్నాను. ఒంటరి జీవితం గడిపి ఉన్నా హాయిగా ఉండేది. రెండో పెళ్లిచేసుకుని ఈ కష్టాలు ఎందుకు తెచ్చుకున్నారా బాబూ అని ఆమె వాపో వడం చూస్తూనే ఉన్నాను. ఆమె కష్టాలు చూస్తూ కూడా రెండో పెళ్లి కోసం ప్రాకులా డడమంటే తెలిసి తెలిసి ఊబిలో దిగబడడ మని తెలుస్తూనే ఉంది"

ధీరజ్‌కుమార్‌కి ఒక విషయం అర్థమ యింది. మేఘన మనసు పెళ్లివైపు లాగినా ఏవో తెలియని కొన్ని భయాలు, చూసిన కొన్ని దృశ్యాలు, తెలిసిన కొన్ని అనుభవాలు ఆమెను భయపెడుతూ ఉన్నాయి. నిజానికి అవి అర్థంలేని భయాలని ఆమెకు తెలి యదు.

"అది.. అది మీ భ్రమ"

"కాదు... అది నా నమ్మకం"

"అయినా ఎక్కడో ఎవరికో ఏదో జరిగిం దని రెండో పెళ్లివల్ల ప్రాబ్లమ్స్ తప్ప ఆనందం ఉండదనుకోవడం పొరపాటు"

"ఎక్కడోఎవరికో కాదు ఈ దేశంలో చాలామందికి అలాగే జరుగుతుందని నా నమ్మకం. మరి నాకూ అలాగే జరగకూడ దని రూలేముంది"

"నా మీద నమ్మకం లేదా?" అతడి గొంతులో ఆర్ద్రత ధ్వనించింది.

"నాకు ఆ తరహా పెళ్లిళ్ల మీదే నమ్మకం లేదు."

అతడు దీర్ఘంగా నిశ్వసించాడు.

ఒక నమ్మకం బలంగా ఏర్పరుచుకున్న ప్పుడు దానిని తొలగించేలా చేయడం అంత సులభం కాదు. చాలా కష్టసాధ్యమైంది.

ఏమయితేనేం తనకు ఆమె మనసులో మాట తెలిసింది. అది చాలు ఆమె రెండో పెళ్లికి వ్యతిరేకురాలుకాదు. ఆ తర్వాత ఎదురయ్యే పరిణామాలే ఆమెను భయపె డుతున్నాయి. ఈ ప్రపంచంలో మంచీ చెడు రెండూ ఉన్నాయని, జీవితంలో చెడు జరిగే అవకాశం ఎంతుందో, మంచి ఎదు రయ్యే అవకాశం అంతే ఉందని ఆమెకు తెలిసేలా చేస్తేచాలు. అదెలా! ఇప్పుడు తను ఆలోచించవలసింది అదే!

"ఓకే... మీరు చూసిన లోకం మీకు అలాంటి అభిప్రాయం కలిగేలా చేసింది. నాకు తెలిసిన ప్రపంచం అది తప్పని నాకు చెపుతోంది. మీ అభిప్రాయం తప్పని నేను నిరూపించగలనో లేదో నాకు తెలియదు. కాని...నాకు నామీద నమ్మకం వుంది. మీరూ నన్ను నమ్మితే మీ అభిప్రాయం తప్పని నిరూపించే అవకాశమూ నాకు దొరుకుతుంది"

ఆమె అదోలా నవ్వింది. "మీకో అవకాశ మిచ్చి ఆ తరువాత జీవితాంతం ఏడుస్తూ కూర్చోవడం నాకిష్టంలేదు. ప్లీజ్! దయచేసి ఇక ఆ టాపిక్ తీసుకురాకండి"

"ఓ.కే" అన్నాడు అతడు. "మీకు మరో సారి బాధ కలిగించి ఉంటే, నన్ను క్షమిం చండి"

ఆమె మౌనంగా ఉండిపోయింది.

కొద్దిసేపటి తర్వాత "నేనిక వెళ్లొస్తాను" అంటూ లేచింది మేఘన.

"బహుశా, నేను రేపు ఆఫీసుకి రావచ్చు"

"ఎందుకు సార్! రెండురోజులు రెస్ట్ తీసుకోకూడదూ?" ఆమె మామూలు మూడ్‌లోకి వచ్చేస్తూ పలికింది.

"ఫర్వాలేదు. ఓపిక ఉన్నంతవరకూ కాసింత పనిచేసుకుంటూ ఉంటే మంచిది

కదా! నా పనే కొద్దికొద్దిగా తగ్గిపోతూ ఉంటుంది"

ఆమె 'నిజమే'నన్నట్టు, నిలువుగా తలాడించింది.

మేఘన బయటకు నడుస్తూ ఉంటే, ధీరజ్ కుమార్ కారిడార్ వరకూ ఆమె వెనకే వచ్చాడు.

"వస్తానండి"

అతడు అసంతృప్తిగానే తలాడించాడు.

ఆమె ముందుకు నడిచింది.

మేఘన కనుమరుగయ్యేవరకూ అక్కడే నిలబడిన అతడు, ఆ తర్వాత లోపలికి నడిచాడు.

బెడ్ మీద పడుకుంటే మనసంతా చాలా భారంగా అనిపించింది. 'మేఘనా! మేఘనా...' అతడు మనసులోనే అనుకున్నాడు. 'ఐలవ్ యూ మేఘనా... నేను నిన్ను నిజంగానే ప్రేమిస్తున్నాను. నీగతం నాకొద్దు. నువ్వు నువ్వుగానే నాకు కావాలి. కాని... కాని నువ్వు నన్ను నమ్మడం లేదు. నా ప్రేమను అర్థంచేసుకోవడం లేదు. నీ నమ్మకం నీది. నీగతం నన్ను భవిష్యత్తులో బాధపెడుతుందనే నువ్వు నమ్ముతున్నావు. ఆ నమ్మకంతోనే నానుండి దూరంగా వెళ్లిపోవాలని ప్రయత్నిస్తున్నావు. ఎలా నిన్ను నమ్మించగలను మేఘనా? నీ నమ్మకం తప్పని నీ భవిష్యత్తంతా ఆనందమయం చేసుకోవడం నీ చేతుల్లోనే ఉందని నీకు ఎలా తెలియచేయగలను? నీ భవిష్యత్తుని నువ్వే చేజేతులా నాశనం చేసుకుంటున్నావ్ మేఘనా!...నువ్వే నాశనం చేసుకుంటున్నావ్.

అతడి మనోవేదనను అర్థంచేసుకోలేని ఆమె ఆటో ఎక్కి ఇంటివైపు సాగిపోసాగింది.

★ ★ ★

"అమ్మా... ఇవాళ మిరియాల చారూ, చింతకాయ పచ్చడీ చెయ్యవే, కేరేజ్ లోకి"

నిద్రలేవగానే చెప్పింది మేఘన తల్లితో.

"అదేం కోరికే... జ్వరంపడినదాన్లా" నవ్విందామె.

"జ్వరమే... నా కోలీగ్ కోసం అవి" చెప్పింది మేఘన.

కొలీగ్ ఎవరంటే... దీపిక పేరు చెప్పాలనుకుందిగాని... మేఘనతల్లి ఆ ప్రశ్న అడగనేలేదు.

ధీరజ్ జ్వరపడిలేచి ఆఫీస్‌కొస్తున్నాడు.

ఎందుకో తెలీదుగానీ... అతనికోసం ఏదైనా తీసుకు వెళ్ళాలన్పించింది.

ముందు ఏ లెమన్ రైసో...బిరియానో అనుకుందిగాని... అవన్నీ ప్రస్తుతం అతని హెల్త్‌కి మంచిదికాదు అనుకుంది. పైగా... నోటికి రుచిస్తాయోలేదో కూడా తెలీదు.

అందుకే... స్వానుభవం మీద... జ్వరం తగిలిన మనిషి నోటికి... చింతకాయ పచ్చడీ, మిరియాల చారూ రుచిస్తాయని డిసైడ్ అయిపోయింది.

ముందు అట్లా... అతనికోసం పట్టుకెళ్ళడం... ఒకింత ఎక్స్‌ట్రాగా వుంటుందేమో... అన్పించిందిగాని... చివరికేదో ఫీలింగ్...ఆమె సందేహాన్ని జయించింది.

మేఘన స్నానం చేసి వచ్చి... తల్లి చేసిన ఐటమ్స్ శ్రద్ధగా కేరేజ్ లో సర్దింది.

నిన్న చెప్పినట్టుగానే ధీరజ్ కుమార్ ఆఫీస్‌కి వచ్చాడు. మేఘన ఆఫీస్‌కి వెళ్లేసరికి దీపిక, ధీరజ్ కుమార్ ఛాంబర్‌లో అతన్ని పరామర్శిస్తూ కనబడింది.

మేఘన కూడా అతన్ని పలకరించి తన సీట్లో కూర్చుంది.

దీపిక వెళ్లగానే హెడ్ క్లర్క్, రంగరావొచ్చి ధీరజ్‌ని పరామర్శించాడు. ఆయన వెళ్లాక రేణుశ్రీ, కావ్యా, టైపిస్ట్ శారదా... అట్లా ఒక్కొక్కరూ వచ్చి ధీరజ్ కుమార్‌ని పలకరించివెళ్లారు.

ధీరజ్ రాకతో పరిసరాలకి కొత్త కళ వచ్చినట్టన్పించింది మేఘనకు.

లంచ్ టైమ్‌లో... మేఘన ఎప్పట్లా రెస్ట్ రూమ్‌లోకి వెళ్లలేదు.

కాఫీ బ్రేక్‌లోనే దీపికతో చెప్పింది "నేని వాళ నా సీట్‌లోనే భోంచేస్తాను. నాకోసం వెయిట్ చెయ్యొద్దు"

దీపిక "ఎందుకు" అనడగలేదు. నర్మగర్భంగా నవ్వింది.

"ఎందుకు నవ్వుతున్నావ్" అంది చిరాకును అణచుకుంటూ.

"ఏంలేదు. హేవ్ ఎ నైస్ టైమ్ డ్యూరింగ్ లంచ్ బ్రేక్" అంది.

మేఘన ఇక పొడిగించలేదు. దీపిక చిలిపి నవ్వుల్ని దొంగచాటుగా గమనిస్తూ, టాపిక్ డైవర్ట్ చేసింది.

అలవాటుకు విరుద్ధంగా అక్కడే లంచ్ ప్యాక్ విప్పుతున్న మేఘనని ఆశ్చర్యంగా చూశాడు ధీరజ్.

"ఇవాళేంటి? మీరు ఇక్కడ... ఇలా... ఎనీవే, నైస్ కంపెనీ" అన్నాడు.

అతనూ తన లంచ్ ప్యాక్ విప్పుతుంటే "ఏం తెచ్చుకున్నారు సర్" అడిగింది మేఘన.

"ఊఁ... ఆలూ పరోటా" చెప్పాడు.

"ఇవాళే కదా పథ్యం చేస్తున్నారు. రెండూ హెవీనే. సూనాఫ్టర్ ఫీవర్ డైజెస్టివ్ సిస్టమ్ డెలికేట్‌గా వుంటుంది. లైట్ ఫుడ్ తీసుకోవాలి"

మేఘన అంత శ్రద్ధగా చెబుతుంటే ధీరజ్‌కి ముచ్చటగా అన్పించింది.

"అయితే... ఏం తినాలో మీరే చెప్పండి"

"చారన్నం... మజ్జిగన్నంలాంటివి మంచిది"

"చింతకాయ పచ్చడి నాలుక్కి రాసుకుంటే అరుచిపోతుందికదూ!" ఆమె కేరేజ్‌లోని ఐటమ్స్‌ని ఎక్స్‌రే లుక్స్‌తో చూస్తూ అన్నాడు.

నేను... ఇవన్నీ తనకోసం తెచ్చానని పసిగట్టాడా! నో... తను దొరికిపోకూడదు. కేజువల్‌గా కనబడాలి.

తన లంచ్ ప్యాక్‌ను అప్పుడే పరిశీలిస్తున్నట్టుగా చూస్తూ అంది మేఘన "అరే... ఇవాళ అమ్మ చారూ... చింతకాయ పచ్చడే చేసినట్టుందే మీకభ్యంతరం లేకపోతే"

"అభ్యంతరమా! నో... మీ లంచ్ ప్యాక్ నాకిచ్చి నాది మీరు తీసుకుంటే సంతోషిస్తాను"

మేఘన చప్పున తలూపి ఆమె తెచ్చుకున్న ఐటమ్స్‌ని అతని టేబుల్‌మీద సర్దింది.

అతనిచ్చిన ఆలూ పరోటాని, వద్దువద్దని మొహమాటపడుతూనే తన టేబుల్‌మీదకు తెచ్చుకుంది.

అతను చారన్నం తింటూ... పచ్చడి నంజుకుంటూ "రియల్లీ... చాలా టేస్టీగా వుంది నోటికి. థాంక్యూ వెరీమచ్. అరె మీరేంటాలా, కమాన్ హేవిట్. అది హోటల్ మేక్ లెండి. మీ ఐటమ్స్‌లా రుచిగా వుండకపోవచ్చు బట్ బాగానే వుంటుంది"

మేఘన పరోటా తుంచి నోట్లో పెట్టుకుంది బిడియంగా. తన లంచ్ ప్యాక్ అతనికివ్వడంలో ఏ ఇబ్బందీ లేదుగాని, అతనిది తినాలంటేనే కాస్త మొహమాటంగా వుంది.

ఎలాగో...తిన్నాననిపించింది.

"చట్నీ సుపర్బ్"

మేఘన సిగ్గుగా నవ్వింది.

ఆ సాయంత్రం, దీపికతో వెళ్లాస్తానని చెప్పి డిపార్ట్ అవుతుంటే.

"ఆలూ పరోటా బాగుందా?" అంది దీపిక. అంతా చూసేసిందన్నమాట. అయినా చూస్తే ఏమిటట? ధీరజ్‌గారికి జ్వరం. సో... అతనికి నచ్చిన ఐటమ్స్ ఫ్రెండ్లీగా ఆఫర్ చేసింది దట్సాల్.

"ఏంటమ్మా మాట్లాడవ్. కైసాహై ఆలూ పరోటా?"

మేఘన... తను మామూలుగానే వున్నట్టు దీపికకు అన్పించాలనుకుంది.

చాలా కేజువల్‌గా "బాగానే వుంది. కర్రీలో కాస్త సాల్టెక్కువ" అంది.

"సాల్టేనా... ఇంకేం ఎక్కువకాలేదా?" అమాయకంగా అడిగింది దీపిక.

"కారం కూడా" కోపంగా చూస్తూ మేఘన వెళ్ళబోయింది.

"సారీ మేఘనా... గమ్మత్తుగా అన్నాను" దీపిక నొచ్చుకుందని మేఘనకి అర్థమైంది.

"అది కాదు దీపికా! నేనేం కన్నెపిల్లనా, వూహల్లో తేలిపోవడానికి. నిజంగా కొలీగ్ అన్న అభిమానం మాత్రమే నేను ధీరజ్ మీద చూపించింది. అంతకుమించి ఏంలేదు" సిన్సియర్‌గా అంది.

"అంతకుమించి ఏం వుండదని నాకు తెలీకనా! ఉంటే బాగుండునన్నకోరికతో అట్లా మాట్లాడి నిన్ను ప్రొవోక్ చేస్తున్నా"

"చెప్పాగా... నేనేం కన్నెపిల్లను కాను ప్రొవోక్ కావడానికి"

"కన్నెపిల్లవి కాకపోవచ్చు కానీ వయసూ జీవితం, అన్నీ వున్నాయి నీకు".

"ఉండొచ్చు కానీ నేనెప్పటికీ వాటికి లొంగే బలహీనురాల్ని కాదు"

అట్లా చెప్పి వెళ్ళిపోతున్న మేఘనకేసి కన్నార్పకుండా చూసిన దీపిక నిట్టూర్చింది గాఢంగా.

కాలం ఎవ్వరి కోసం ఆగదు.

ఓ నాలుగు నెలల కాలం అనంతకాలగర్భంలో కలిసిపోయాయి.

ఈ నాలుగు నెలలకాలంలో ధీరజ్ కుమార్ మేఘన మనసుకు దగ్గరయ్యే ప్రయత్నాలు చేశాడుగాని, అతడి ప్రయత్నాలేవీ ఫలించలేదు. మేఘన అతడితో మాట్లాడుతోంది కాని ఆ ఒక్క విషయంలో మాత్రం అతడితో దూరంగానే మసలుకుంటోంది.



ఎందుకనో అతడికి ఆమె మనసును మార్చి పెళ్ళిచేసుకోగలననే నమ్మకం అలాగే ఉండిపోయింది. అందువల్లే మరెవ్వరయినా పెళ్ళి ప్రస్తావన తీసుకొచ్చినా, అదోలా నవ్వి టాపిక్ మార్చేస్తూ ఉన్నాడు.

ఆ విషయం మేఘన కూడా గమనించింది.

అతడికి కన్నెపిల్లలు దొరికే అవకాశం ఉన్నా తన వెంటే ఎందుకుపడుతున్నాడో మాత్రం అర్థంకావడంలేదు. అయితే మనసులో ఏమూలో అతడి ప్రవర్తన ఆనందాన్నే కలిగిస్తోంది. తనను సిన్సియర్‌గా ఓ మగాడు ప్రేమిస్తున్నాడని తెలిస్తే ఏ ఆడది మాత్రం ఆనందపడదు? అయితే ఆమె భయమంతా పెంచుకున్న అనుమానాల చుట్టూనే తిరుగుతోంది. అందుకే ఆమె అతడిని మానసికంగా దూరంగానే ఉంచగలుగుతోంది.

ఇలాంటి సమయంలోనే రేణుశ్రీకి పెళ్ళి జరిగిపోయింది.

అబ్బాయి కంప్యూటర్ ఇంజనీర్. అమ్మాయి తండ్రి అల్లుడికి కట్నకానుకలు బాగానే ముట్టచెప్పాడు. ఓ నాలుగు లక్షలు కట్నం, మోటార్‌బైక్, ఇంకా కొంత బంగారం. ఆడపడుచు లాంఛనాలు అన్నీ ఘనంగానే అందాయి.

అయితే పెళ్ళయ్యి అత్తారింటికి వెళ్ళిన రెండు నెలలకే రేణుశ్రీ తిరిగి పుట్టింటికి చేరింది.

ఓరోజు ఆఫీసునుండి ఇంటికి తిరిగి వెళ్తున్న మేఘనకు రేణుశ్రీ ఎదురుపడి పల

కరించింది. "మేఘనగారూ! ఎలా ఉన్నారు? "

రేణుశ్రీ రూపం చూసిన మేఘన అవాక్కయ్యింది. 'ఈమె ఈమె రేణుశ్రీయేనా' అన్న అనుమానం మనసులో జనించింది.

ఆమె ముఖంలో మునుపటి కళ లేదు. మాటల్లో హుషారులేదు. మనిషి సన్నబడింది. వెరసి రేణుశ్రీ, పదేళ్లు పైబడిన అమ్మాయిలా కనిపిస్తోంది.

"రేణూ! ఏమిటి... ఏమిటిలా అయిపోయావ్? " వెంటనే ప్రశ్నించింది మేఘన.

"ఏమయింది నాకు. బాగానే ఉన్నాను కదా? "

"బాగుండడమేమిటి రేణూ! పెళ్ళయ్యాక కొంతమంది అమ్మాయిలు లావవుతారు. కొంతమంది లావు కాలేకపోయినా సరికొత్త కళతో కళకళలాడిపోతారు. కాని నిన్ను చూస్తుంటే, నీ ముఖంలో ప్రేతకళ తప్ప మరేమీ కనిపించడంలేదు.

రేణుశ్రీ అదోలా నవ్వేసి "కాసేపలా మా



ఇంట్లో కూర్చుని వెళ్దరురండి" అని పిలిచింది.

ఆఫీసునుండి రావడంవల్ల కాస్త బడలికగా ఉన్నా రేణుశ్రీని అలా చూడడంతో కలిగిన షాక్ ఆమెను నిలువుగా తలూపేలా చేసింది.

"వెళ్దాం పదా"

ఇద్దరూ రేణుశ్రీ ఇంటివైపు అడుగులేశారు.

సింగిల్ బెడ్‌రూమ్‌తో ఉన్న డాబా ఇల్లు అది. ఆ ఇంటికి మేఘన రావడం అదే మొదటిసారి.

పెళ్ళికి ఆమె ఆఫీసుస్టాఫ్‌తో కలసి కళ్యాణమండపంకే వెళ్ళింది గాని, ఆ ఇంటికి రాలేదు.

మేఘన ఆ ఇంటి గేటు తీసుకుని లోపలికి అడుగుపెడుతున్నప్పుడే వరండాలో కూర్చుని పైకప్పుకేసి చూస్తున్న యాభైఏళ్ల ముసలాయనను చూసింది.

ఆయన రేణుశ్రీ తండ్రిగారని ఆమెకు తెలుసు. పెళ్ళిలో రేణుశ్రీ ఆయనను పరిచయం చేసింది.

అయితే అప్పుడే మేఘన ఈ రెండు నెలల్లో ఆయన చాలామారిపోయినట్టుగా అర్థంచేసుకోగలిగింది. మనిషి బాగా డీలాపడిపోయాడు. ఏదో కోల్పోయినట్టు నీరసంగా కనిపిస్తున్నాడు.

రేణుశ్రీ ఆమెను తండ్రిదగ్గరగా తీసుకెళ్లాక "డాడీ".

అప్పుడే ఆయన తలదించి చూశాడు. కూతురు పక్కనే ఉన్న మేఘనను చూశాక భృకుటి ముడివడింది.

"డాడీ! ఈమె మేఘనగారు. నేనింతకు ముందు వర్క్‌చేశానే ఆఫీసు. ఆ ఆఫీసులోనే పనిచేస్తున్నారు. పెళ్ళిలో మీకు పరిచయం చేశాను కూడా"

ఆయన ఇబ్బందిగా ముఖం పెట్టాడో లేక నిస్తేజంగా చూశాడో అర్థంకాలేదుగాని "ఆ...ఆ..." అన్నాడు ఏదో మాట్లాడాలి కదా అన్నట్టు.

"సరే డాడీ! మేము డాబామీదకెళుతున్నాం"

"అలాగేనమ్మా"

రేణుశ్రీ మేఘనను తీసుకుని డాబా మెట్లెక్కింది. డాబామీద ఆల్రెడీ నాలుగు కుర్చీలు వేసి ఉన్నాయి.

ఇద్దరూ కుర్చీలలో కూర్చున్నాక మేఘన కొద్దిక్షణాలు మౌనంగా ఉండిపోయింది. ఎందుకో రేణుశ్రీ ప్రవర్తన ఆ ఇంటి పరిస్థితి ఏదో తెలియని అనుమానం మనసులో కలిగేలా చేస్తోంది ఏం జరిగింది. అసలెందుకిలా ఉన్నారు వీళ్లు?'

"చెప్పండి మేఘనగారూ!"

"చెప్పాల్సింది నేను కాదు... నువ్వే"

"నేనేం చెప్పను?"

"ఏమిటిలా అయిపోయావ్ నువ్వు? మీనాన్నగారు కూడా ఏదోలా ఉన్నారు. చూస్తుంటే నాకేదో అనుమానంగా ఉంది"

"అనుమానం అంటే?"

"అనుమానం అంటే... ఏదో... ఏదో జరగకూడనిది జరిగిందని"

రేణుశ్రీ పకపకా నవ్వింది. అయితే ఆ నవ్వులో హుషారు లేదు. ఆ నవ్వు అదోలా ఉంది.

నవ్వు ఆపాక రేణుశ్రీ అంది "చాలా కరక్ట్‌గానే ఊహించారు మీరు! ఏదో జరగకూడనిది జరిగిపోయిందని. నిజమే..." ఒక్కసారిగా ఆమె గొంతులో మార్పు స్పష్టంగా తెలిసింది "నిజమే. జరగకూడనిదే జరిగిపోయింది"

"అంటే?" మేఘన ఒక్కసారిగా కుర్చీలో ముందుకు వాలింది.

"ఏముంది? నా పెళ్ళి పెటాకులయింది"

మేఘనకు అర్థంకాలేదు. అయోమయంగా అనిపించింది. "రంగరంగ వైభోగంగా పెళ్లి జరిగి రెండు నెలలు కాకముందే, పెళ్ళి పెటాకులు కావడమేమిటి? ఆ ఇంట్లో వాళ్ల ముఖాలలో కళాకాంతులు

లేకుండా పోవడమేమిటి? "

అందుకే అడిగిందామె "వివరంగా చెప్పు"

"ఏముంది మేఘనగారూ! మావారిది శాడిస్ట్ మనస్తత్వం. ఆయన ప్రతిదీ భూతద్దంలోంచి చూసి మాటలతో బాధపెట్టి, చేతలతో హింసిస్తూ ఉంటారు. అప్పటికీ రెండు నెలల పాటు ఆ నరకాన్ని అనుభవించాను. ఇక భరించేశక్తి లేక అతగాడికి 'గుడ్‌బై' చెప్పివచ్చేశాను"

"నువ్వు మీవారిని వదిలిపెట్టి వచ్చేశావా? "

"ఇందులో అంత ఆశ్చర్యపోవలసిందేముంది మేఘనగారూ! కష్టపెట్టే భర్తను కట్టుకుని ఎంతకాలం నరకం అనుభవించగలం చెప్పు"

"కాని పెళ్లయ్యి రెండు నెలలు కూడా కాలేదు"

"రెండు నెలలకే ఇరవయ్యేళ్లకు సరిపడా కష్టాలను అనుభవించేశాను నేను. నావి ఏ స్థాయి కష్టాలో చూస్తారా? " కుర్చీలోనే కూర్చుని నడుము కొద్దిగా పైకి లేపి చీరను వెనక్కు లాగింది రేణుశ్రీ. చీర మోకాళ్లను దాటింది. తెల్లని తొడలమీద కనిపించిన ఆ ఎర్రని మచ్చలు ఒక నిజానికి ప్రత్యక్షసాక్ష్యంగా కనిపిస్తుంటే మేఘనకు నోట మాట రాలేదు. ఆమె అవాక్కయిపోయినట్టు అలాగే చూస్తుండిపోయింది.

అప్రయత్నంగానే కళ్ళెత్తి చూస్తే, రేణుశ్రీ కళ్ళల్లో నీళ్ళు సుడులు తిరగడం కనిపించింది.

మేఘన విచలితురాలయింది.

రేణుశ్రీ చీరను కిందికి లాగేసింది.

ఇద్దరిమధ్యా నిశ్శబ్దం మిగిలింది.

ఒక సత్యాన్ని జీర్ణించుకోవడం ఒక్కోసారి చాలా కష్టమవుతూ ఉంటుంది. కానీ అది సత్యం కాబట్టి జీర్ణించుకోక తప్పదు.

చాలాసేపటి తర్వాత మేఘన గొంతు విప్పగలిగింది. "మీవారు మరీ... మరీ ఇంత దారుణంగా ప్రవర్తించేవారా? "

"కనిపిస్తూనే ఉందిగా"

"అతడు అంతలా రెచ్చిపోయి నిన్ను కష్టపెట్టడానికి కారణమేమిటి? " మేఘన మనసులో ఏదో అనుమానం మెదిలిందిగానీ అడగడం భావ్యంకాదని ఊరుకుండిపోయింది.

"కారణమంటూ ఏమీలేదు. ఏదయినా ఉంటుందని అనుమానం అతడికి పిచ్చిపట్టేలా చేస్తోంది. అతడు శోభనం రాత్రి నన్ను అడిగిన మొదటి ప్రశ్న. నాతో మాట్లాడిన మొదటిమాట ఏమిటో తెలుసా మేఘనగారూ? "

మేఘన కళ్ళెత్తి రేణుశ్రీ కళ్ళల్లోకి చూసి 'చెప్పమన్నట్టు'గా తలూపింది.

"హాయ్ రేణూ! నువ్వు చాలా అందంగా ఉన్నావ్. నీలాంటి అందగత్తెకోసం ఎంత మంది అబ్బాయిలు గాలం వేసి ఉంటారు. మరి నువ్వు ఎవరిగాలంలో చిక్కుకున్నావో చెప్పు? "

మేఘన షాక్ తిన్నట్టుగా వెనక్కు ఒరిగింది.

రేణుశ్రీ కంటిన్యూ చేసింది, "అతడలా అనగానే నేను షాక్ తిన్నాను. బహుశా అతడు నాతో జోక్ చేస్తున్నాడేమోననిపించింది. నిజానికి అతడు ఆ సమయంలో అలా మాట్లాడకుండా ఏదో సందర్భంలో అదే ప్రశ్నను జోక్‌గా అడిగి ఉంటే నేను తప్పక నిజం చెప్పి ఉండేదానిని. ఈ కాలంలో ఇది సర్వసాధారణమైన విషయమేనంటూ నా బోయ్‌ఫ్రెండ్ కబుర్లు వినిపించి ఉండేదాన్ని. కానీ... అతడు జోక్‌గా అడగడంలేదని అర్థం కావడానికి నాకు అర నిమిషం మాత్రమే అవసరపడింది. అతడు సీరియస్‌గానే అడుగుతున్నాడు. అయితే ముఖంమీద బలవంతపు నవ్వు పులుముకుని ఉన్నాడు. అంతలోనే నాలో మరో అనుమానమూ మొదలయింది. 'ఒకవేళ ఇతడికి నా బోయ్ ఫ్రెండ్ గురించి తెలిసిపోయిందా? ' ఆ అనుమానం నాలో కల

గడంతోనే నేను చాలా భయపడ్డాను. తెలిసో, తెలియకో పెళ్ళికి ముందు తప్పు చేస్తే, పెళ్ళయ్యాక ఆ తప్పు మనసులో ఎలా ముల్లులా గుచ్చుకుంటుందో అప్పుడే నాకర్థమయింది. అయితే... నా తప్పు అతడికి తెలిసే అవకాశం లేదని తెలిసి మనసు కుదుటపడింది.

అంతలోనే అతడు నన్ను మళ్ళీ ప్రశ్నించాడు, "చెప్పు రేణూ! నువ్వు పెళ్ళికిముందు ఎవరిగాలంలో చిక్కుకున్నావ్? ఎలా ఎంజాయ్ చేశావ్? అన్నది నాకిప్పుడు కావాలి. నాకు తెలుసు, ఇది కంప్యూటర్ యుగం. ఆడామగా తేడా లేకుండా కుర్రకారు తిరిగేస్తూ ఉంటారు. నువ్వూ అలా తిరిగే వుంటావని నా నమ్మకం. చెప్పు... చెప్పు నువ్వు ఎవరితో తిరిగావ్? సెక్స్‌ని ఎలా ఎంజాయ్ చేశావ్? "

నాకు కళ్ళల్లో నీళ్ళు సుడులు తిరిగాయి.

ఎంతయినా మొదటిరాత్రి కాబట్టి మరింత ఏడిపించడం సబబు కాదనుకున్నాడో ఏమో అతడూ వెంటనే టాపిక్ మార్చేశాడు. "ఏయ్! ఏడవకు, ఏడుపంటే నాకసహ్యం, నిజాలంటే నాకు చాలా ఇష్టం. ఏదో నిజం చెపుతావనే అనుకున్నానుగానీ ఇలా ఏడుపు సీన్ క్రియేట్ చేస్తావనుకోలేదు. అందులోనూ ఇది ఫస్ట్ నైట్. రొమాన్స్‌ని ఏడుపుతో మొదలుపెట్టకూడదు. సో...ఏడుపు ఆపెయ్యి. నేను బెడ్‌లైట్ ఆర్పేస్తాను"

అతడు నా రియాక్షన్ కోసం కూడా ఎదురుచూడకుండా లైట్ ఆర్పేశాడు.

"ఆ తర్వాత జరిగింది మధురమైన అనుభవం కాదు. అదో భయంకరమైన పీడకల..."

రేణుశ్రీ చెప్పడం ఆపింది.

మేఘన కన్నార్పడం కూడా మర్చిపోయి ఆమెనే చూస్తుండిపోయింది.

అది గమనించి రేణుశ్రీ అడిగింది "ఏమిటలా చూస్తున్నారు? "

అప్పుడే ఈ లోకంలోకి వచ్చినట్టు మేఘన తల విదిలించి చెప్పింది, "ఊహాతీతమైన విషయం విని, నన్ను నేను మర్చిపోయాను"

"చాలా చిత్రంగా అనిపిస్తోందికదూ? "

"ఇప్పటికీ అలా కూడా జరుగుతుందా? అన్న అనుమానం కలుగుతోంది నాకు"

"అందుకు నా అనుభవమే సాక్షి"

రేణుశ్రీ జీవితంలో ఆ తర్వాత ఏం జరిగిందో తెలుసుకోవాలన్న ఆతృత మేఘనలో పెరిగిపోసాగింది. "మరి ఆతర్వాతేమయింది? "

ఆమె పెదవి విప్పబోతుంటే, మెట్లదగ్గర చప్పుడయింది.

ఇద్దరూ తలలు తిప్పి అటు చూశారు.

నలభై ఐదేళ్ళ పెద్దావిడ మెట్లెక్కి పైకొస్తూ కనిపించింది.

ఆవిడ రేణుశ్రీ తల్లి అని తెలిసి ఉండడంతో మేఘన పెదాలమీదకు నవ్వు తెచ్చుకుని చూడసాగింది. ఆవిడ వాళ్ళ దగ్గరగా వచ్చాక అంది, "రేణూ! నువ్విక్కడ కూర్చుని ఉన్నావా? "

"అవును... ఏం? "

"ఏదో పనివుందంటూ బయటకు వెళ్లావు కదా, ఇంకా రాలేదేవిటా అనుకుంటూ ఉన్నాను. మీ నాన్నగారిని అడిగితే ఆc! ఎక్కడికో వెళ్లి ఉంటుంది. వస్తుందిలే అన్నారు"

"అదేంటమ్మా! నేను నాన్నగారిని పలకరించి, నా ఫ్రెండ్‌ని పరిచయం చేసే పైకొచ్చాను. ఆయన అలా అనడమేమిటి? "

ఆవిడ తలమీద కొట్టుకుంది. "గత నాలుగయిదు రోజులుగా ఆయన ఈ లోకంలో ఉండడం లేదులేమ్మా. ఎప్పుడూ ఏదో పరధ్యాస. కళ్లముందు ఏంజరుగుతోందో కూడా పట్టించుకోవడంలేదు" అన్నాక ఆగి మేఘన వైపు ప్రశ్నార్థకంగా చూసింది.

తల్లి చూపులు గమనించి రేణుశ్రీ చెప్పింది. "ఈమె మేఘనగారమ్మా! మనకా

లనీలోనే ఉంటున్నారు. అంతకుముందు నేను పనిచేసిన ఆఫీసులో పనిచేసేవారు. పెళ్లిలో మీకు పరిచయం చేశాను కూడా"

అప్పుడు గుర్తుకొచ్చినట్టుంది ఆవిడకు "ఆc, గుర్తొచ్చింది. నువ్వు జాబ్ చేస్తున్నప్పుడు ఇద్దరూ కలిసే వచ్చేవారని చెప్పావ్"

"కరక్ట్"

మేఘన కుర్చీలోనుండి లేచి, నిలబడి ఆమెకు నమస్కరించింది. "నమస్తే ఆంటీ"

"నమస్కారమమ్మా" అన్నాక, కూతురి వైపు తిరిగి చెప్పింది. "అన్నట్టు అసలు విషయం చెప్పడం మర్చిపోయాను. నీకు మీ పెదనాన్నగారు ఫోన్‌చేశారు. అందుకే నీకోసం వెతికాను. బయటకెళ్లింది, ఇంకా రాలేదని చెప్పాక ఓ అర్థగంటలో మళ్లీ ఫోన్ చేస్తానన్నారాయన"

"విషయం ఏమిటంట? "

"ఏమో తెలియదు, ఆయన చెప్పలేదు, నేను అడగలేదు, ఎలాగూ ఫోన్ చేస్తాన న్నారు కదా అని ఊరుకుండిపోయాను. ఆయన ఫోన్‌చేసి కూడా అర్థగంటయిపో యింది. ఫోన్ రావచ్చు"

"సరే పద, నేను వస్తున్నాను"

ఆవిడ మెట్లు దిగి వెళ్లాక, రేణుశ్రీ కుర్చీ లోనుండి లేచింది.

"నాకు ఆ సంబంధం తీసుకొచ్చింది మా పెదనాన్నగారే. ఇప్పుడు ఆయన నాతో మాట్లాడుతానన్నదీ ఆ విషయం గురించే అయివుంటుంది"

"ఆ విషయం గురించే. అంటే... రాజీ ప్రయత్నాలు"

రేణుశ్రీ నవ్వేస్తూ "అంతేకదా మరి" అంది.

ఆమెనుండి తను వినాలనుకున్న మాటలు వినే అవకాశం ప్రస్తుతానికి లేదని తెలిసి మేఘన "సరే! నీకు ఫోన్ రావ చ్చేమో, వెళ్దాంపద" అంది.

రేణుశ్రీ తలాడించింది.

మెట్లు దిగి కిందికి వెళ్లాక మేఘన వీధి గేటువైపు నడవబోతుంటే, రేణుశ్రీ ఆమె చెయ్యి పట్టుకుంది. "ఇంతదూరంవచ్చి, ఇంట్లోకి రాకుండా కాఫీ తాగకుండా వెళ్లడం ఏమీ బాగోలేదు"

మేఘన నవ్వేసి "సరేపద" అంటూ రేణుశ్రీ వెంట ఇంట్లోకి నడిచింది.

రేణుశ్రీ తనే స్వయంగా కాఫీ చేసి తీసు కొచ్చి ఆమెకు అందించింది.

"నేను రేపు మన ఆఫీసుకి వస్తాను. దీపి కను, కావ్యను చూసి చాలారోజులయిపో యింది" అంది రేణుశ్రీ ఆమె పక్కనే కూర్చుంటూ.

"నువ్వు తప్పకుండారా. ఎందుకంటే, మనవాళ్లు రోజుకోసారయినా నిన్ను తలచు కుంటూ ఉంటారు. నిన్ను చూస్తే వాళ్లు హేపీ ఫీలవుతారు"

"ఏదీ... నా పరిస్థితి ఇలా అయిందని తెలిశాక కూడానా? "

"జీవితంలో ఏదో చిన్న ఒడిదుడుకులు వచ్చి ఉండొచ్చేమోగాని, అంతలోనే ఏదో అయిపోయిందని, పరిస్థితి తారుమారయిం దని అనుకోవడం పొరపాటు. నీ జీవితం తప్పకుండా చక్కబడుతుంది"

రేణుశ్రీ బలవంతంగా నవ్వింది. "నాక లాంటి ఆశలేవీ లేవు"

"ఎందుకని? "

"అసమర్థుడితోనయినా ఏదో సర్దుకుపోవ చ్చేమోగాని, అనుమానం మొగుడితో సంసారం చేయడం చాలా కష్టం. ఆ విషయం నాకు తెలుసు"

"మీ పెదనాన్నగారేదో రాజీ ప్రయత్నం చేస్తున్నట్టున్నారు కదా? "

"అవన్నీ వ్యర్థప్రయత్నాలేనని నా నమ్మకం"

కాఫీ తాగడం పూర్తయింది.

మేఘన కుర్చీలోంచి లేచింది.

రేణుశ్రీ ఆమె వెంబడి వీధిగేటు వరకూ

వచ్చి సాగనంపింది.

★ ★ ★

ఆ రాత్రి... ఎంత ప్రయత్నించినా నిద్ర పట్టలేదు మేఘనకి.

మాటిమాటికీ... రేణుశ్రీ కళ్ళముందు కదలాడుతోంది.

జీవితాన్ని... ఎంత తేలిగ్గా తీసుకుంది రేణుశ్రీ ఒకప్పుడు! ప్రస్తుతం మోయలేని బరువుగా మారిందది.

నిన్నటివరకూ... బోయ్‌ఫ్రెండ్స్... డేటింగ్ అంటూ అల్ట్రామోడర్న్‌గా తిరిగిన ఓ ఆడపిల్ల మూడుముళ్ళు పడగానే, అల నాటి సీతలాగే... సుమతిలాగే కష్టాలపాల యింది.

ఫ్యాన్సీగా ఆలోచిస్తూ... భవిష్యత్తును ఫాంటసీగా భావిస్తూ, జీవితాన్ని రంగుటద్దా ల్లోంచి చూసుకుని మురిసిపోయే ఈకాలం అమ్మాయిలకు ఎప్పటికి తెలుస్తుందో, సమాజం ఎన్నటికీ మారదని, మగవాడు అసలే మారడని.

ఆలోచిస్తున్న మేఘనకు హఠాత్తుగా గుర్తుకొచ్చాడు రఘు.

అప్రయత్నంగా కళ్ళు చెమర్చాయి.

బెడ్‌మీంచిలేచి కిటికీ దగ్గర నిలబడింది.

నల్లటి ఆకాశంలో వెండిపూలలా మిల మిల మెరుస్తున్నాయి చుక్కలు.

వెన్నెల తాగిన మబ్బులు ధవళకాంతుల్ని విరజిమ్ముతున్నాయి.

ఆ ధగధగల మధ్యన ప్రశాంతంగా, నిండుగా నవ్వుతున్నాడు పౌర్ణమిచంద్రుడు.

'అచ్చం నా రఘులా వున్నాడు' అను కుంది మేఘన.

నిజం రఘు మనసంతా వెన్నెలే. అతని నవ్వుల్లో, కళ్ళల్లో అన్నీ నక్షత్రాలే.

అందుకేనా అందకుండా పోయాడు!

మేఘన కళ్ళలోంచి చివ్వున వూరిన కన్నీరు ఆమె చెక్కిళ్ళమీదకు జారింది.

తన బతుకులోకి అడుగిడిన మగ వాడు... అందరిలాంటివాడుకాడు. మంచికి ప్రతిరూపం... అభిమానానికీ, అనురాగానికి మారుపేరు.

అందుకేనేమో... విధికి కన్నుకుట్టింది. తనను కాటేసింది.

అంటే... స్త్రీ జీవితాన్ని మగవాడో, కాకుంటే విధో ఏదో ఒకటి వంచించాల్సిం దేనా!

పాపం రేణుశ్రీ!

ఎంత ఘనంగా జరిగిందామె పెళ్ళి?

ఎంత గొప్పగా అలంకరించారు కల్యాణ మండపాన్ని! ఇసకేస్తే రాలనంతమంది ఆహూతులు. అదుగో... ఆ ఆకాశంలో చుక్కలంతమంది. కనీవినీ ఎరుగని విందు! ఒక్కొక్క అతిథికి భోజనానికైన ఖర్చు.. దాదాపు నూటయాభై రూపాయలై వుంటుం దని అందరూ చెప్పుకున్నారు. అంత కాస్ట్లీ ఫుడ్ అరేంజ్ చేశారు.

పెళ్ళికొడుకు పెద్ద అందగాడు కాకపో యినా హుందాగా వున్నాడు.

"రేణుశ్రీలో అందముంటే... అతనిలో రాజసం వుంది" అంది దీపిక పెళ్ళిపీటం మీద అతన్ని రేణుశ్రీ పక్కన తొలిసారి చూడగానే.

'నిజంగా నిజం' అన్పించింది తనకు.

మూడుముళ్ళు పడగానే... రేణుశ్రీ చొర వగా భర్తకి ఆఫీస్‌స్టాఫ్‌నంతా పరిచయం చేసింది.

తనకి బాగా గుర్తు. రేణుశ్రీ... తననీ, కావ్యనీ...దీపికనీ చూపిస్తూ... "వీళ్ళు నా కొలీగ్స్‌కాదు... క్లోజ్ ఫ్రెండ్స్" అని చెప్పిన పుడు అతడు కొద్దిగా ముఖం చిట్లించాడు.

మేము నమస్తే అంటూ చేతులు జోడిస్తే... అతను ముభావంగా 'హలో' అన్నాడు.

"బాగా రిజర్వ్‌డ్ టైప్" అని తనంటే దీపిక

"అట్లాచూడు... తన ఫ్రెండ్స్‌తో ఎట్లా పడీపడీ నవ్వుతూ మాట్లాడుతున్నాడో? రిజర్వ్‌డేంకాదు... గర్విష్టి" అంది.

దీపికా, తనూ అతను చూడకుండా, విన కుండా రేణుశ్రీని "వంశీని పిలవలేదా?" అనడిగితే... రేణుశ్రీ మమ్మల్ని వెర్రివా ళ్ళను చూసినట్టు చూస్తూ "పెళ్ళి చేసు కుంటూ... ఎవరైనా పెళ్ళికి బోయ్‌ఫ్రెం డ్స్‌ని పిలుస్తారా? ఇంకేముంది పెళ్ళిపం దిరి భగ్గుమనదూ" అంది.

"రేణుశ్రీ తెలివైందే" అంది కావ్య.

"తెలివైనదాన్ని కనుకే... బోయ్‌ఫ్రెండ్‌ని మెయిన్‌టైన్ చేశాను. ఇక ఇవాళ్టితో వంశీ చాప్టర్ క్లోజ్. వంశీకర్ ఎవరో నాకు తెలీ దండీ" అంది చిలిపిగా నవ్వుతూ.

అంతటి తెలివితేటలూ... మొగుడనే మగాడిముందు ఎందుకూ కొరగాకుండా పోయాయి. ఈ సమాజంలోని సగటు ఆడ దానికి మల్లే... రేణుశ్రీ కూడా భర్తముందు ఓడిపోయింది.

ఓడిపోవడమేనా... భరించలేక అత న్నుండి దూరంగా పారిపోయింది.

"అక్కా! కిటికీ దగ్గరేం చేస్తున్నావ్?"

శ్రీలతకు మెలకువొచ్చి అడిగింది.

"ఏంలేదులే... నిద్రపట్టక నిలుచున్నా. నువ్వు పడుకో" చెప్పింది మేఘన.

"వచ్చి పడుకో అక్కా" గారంగా అంది శ్రీలత.

మేఘన మౌనంగా వచ్చి శ్రీలత పక్కన పడుకుంది.

శ్రీలత ·అక్కమీద ఓ కాలు, చెయ్యి వేసి ఆమె గుండెల్లోకి ఒదిగినట్టుగా పడుకుంది.

"నా చిన్నారి చెల్లెలికి ఎట్లాంటివాడొ స్తాడు! భగవంతుడా... శ్రీలతకైనా... మంచి భర్తనివ్వు. మంచి భర్తనేకాదు... దీర్ఘాయుష్కుడ్ని ఇవ్వు"

ప్రార్థిస్తూ అట్లాగే నిద్రలోకి జారిపో యింది.

★ ★ ★

మర్నాడు ఆఫీసులో అడుగుపెట్టిన వెంటనే మేఘన దీపిక దగ్గరగా వెళ్ళి చెప్పింది. "ఈరోజు రేణుశ్రీ మన ఆఫీసుకి రాబోతుంది"

"రేణునా?"

"అవును...నిన్న సాయంత్రం దార్లో కన పడి చెప్పింది"

దీపిక ఉత్సాహంగా అడిగింది. "రేణు ఎలా ఉంది?"

మేఘన ముఖంలో కొంత బాధ కదలా డింది. ఆ విషయం దీపిక గమనించింది.

"రేణు,.. రేణు..."

మేఘన నసుగుతుంటే దీపిక అడిగింది. "ఏమిటండి? ... రేణూకేమయింది?"

కొద్దిక్షణాలు తటపటాయించాక, ఇక చెప్పక తప్పదన్నట్టు మేఘన రేణుశ్రీ గురించి తను విన్నదంతా చెప్పేసింది.

ఆమె చెప్పిన విషయాలన్నీ విన్నాక దీపిక కూడా ఆశ్చర్యపోయింది. "ఏమిటీ... రేణు పరిస్థితి అలా అయిందా?"

"అవును"

"అయ్యో..." అన్నదేగాని, ఆ తర్వాత మరేం మాట్లాడాలో అర్థంకానట్టు మౌనంగా ఉండిపోయింది దీపిక.

"సరే! నేను వెళ్తాను. మనం మళ్ళీ మాట్లాడుకుందాం"

దీపిక తలాడించింది. మేఘన తన కాబి న్‌లోకి వెళ్ళిపోయింది.

ఆమె క్యాబిన్‌లోకి వెళ్ళేసరికి ధీరజ్‌కు మార్ అప్పటికే తన సీట్లో కూర్చుని ఉన్నాడు.

అతడిని చూసి ఆమె విష్ చేసింది "గుడ్ మార్నింగ్ సార్"

"గుడ్‌మార్నింగ్"

ఇప్పుడు ఇద్దరి మధ్యా ఎలాంటి గొడ వలూ లేవు. ఇద్దరూ చాలా క్యాజువల్‌గా పలకరించుకుంటారు, మాట్లాడుకుంటారు. అయితే అదంతా ఆఫీసుకు సంబంధించిన వ్యవహారమే. నో పర్సనల్ విషయాలు. ఇతరత్రా మాటలు. అదోరకమైన చూపులు. ప్రస్తుతం ఏవీ లేవు.

తన మనసులోని మాట చెప్పాడు ధీరజ్

కుమార్. అంతలా మారిపోతాడని ఆమె ఊహించలేదు. సమయం, సందర్భం వచ్చినప్పుడు మాత్రమే మనిషి యొక్క సంస్కారం తెలుస్తుంది.

అతడి ప్రవర్తన మొదట అతడిమీద కోపం పెంచుకునేలా చేసింది. తన వెంట పడడం చూసి మామూలు రోమియో కిందనే అతడిని జమకట్టింది.

కాని... ఎప్పుడయితే తను 'నా జోలికి రావద్దు' అంటూ అతడిని వేడుకుందో అప్పుడే అతడు ఒక్కసారిగా మారిపోయాడు. అప్పటివరకూ తనను వేధించేవాడల్లా ఉన్నతంగా ప్రవర్తించడం మొదలుపెట్టాడు. తమ మధ్య ఏమీ జరగనట్టు, అసలెలాంటి ప్రస్తావనలూ లేనట్టు చాలా క్యాజువల్‌గా మాట్లాడుతూ ఓ మంచి కొలీగ్‌లా ప్రవర్తించసాగాడు.

అందువల్లే అప్పుడప్పుడూ ఆమెకు అనుమానం కలుగుతూ ఉంటుంది. ఓ నాలుగు



నెలల క్రితం, 'నిన్నే పెళ్లాడుతా' అంటూ వెంటపడిన ఆ రోమియో ఈ ధీరజ్ కుమారేనా? ' అని!

అప్పుడే ఆమెకు అతడి సంస్కారం అర్థమయింది.

'అయితే అతడి మనసులో ఇంకా తను ఉన్నదా? లేక జరిగిందేదో జరిగిపోయిందని భవిష్యత్తును వెతుక్కునే ప్రయత్నంలో అతడు తనను మర్చిపోయాడా? లేదా అన్నదే ఇక తెలియవలసి ఉంది. అయినా ఆ విషయమూ తనకు అనవసరమే!'

ఆమె తన సీట్లో కూర్చుని పనిచేసుకోసాగింది.

ఆ మధ్యాహ్నం లంచ్‌టైమ్‌లో రేణుశ్రీ వస్తుందేమోనని ఎదురుచూశారు ఆ ముగ్గురూ.

ఓ పావుగంట ఎదురుచూశాక కావ్య లంచ్‌బాక్స్ సర్దేసుకుంది. "బహుశా అది సాయంత్రం వస్తుందనుకుంటాను" చెప్పింది వాళ్ళిద్దరితో.

"కావచ్చు" అంది దీపిక.

"ఓకే. నేను కొన్ని ఫోన్స్ చేసుకోవాలి. మీరు మాట్లాడుకుంటూ ఉండండి. మళ్ళీ వస్తాను" అంటూ ఆమె రెస్ట్‌రూమ్‌లో నుండి అవతలికెళ్ళిపోయింది.

ఆ రూమ్‌లో దీపిక, మేఘనలిద్దరూ మిగిలారు.

కొద్దిక్షణాలు తన అరచేతులవైపే చూసుకున్నాక దీపిక తలెత్తి, మేఘన ముఖంలోకి చూసింది.

అప్పటివరకూ దీపిక ఏవో ఆలోచనల్లో మునిగి ఉన్నట్టుగా అర్థం చేసుకుని, ఆమె ముఖంలోకే చూస్తున్న మేఘన ఆమె తలెత్తడంతో నవ్వుతూ చూసింది.

"రేణు... రేణు పరిస్థితి అలా అయిందంటే నాకు నాకు చాలా బాధగా ఉంది మేఘనగారూ"

"నిజంగా, నాకూ చాలా బాధగా ఉంది"

"అయితే రేణు పరిస్థితి తెలిశాక నాకో జీవితసత్యం అర్థమయింది"

మేఘన కనుబొమలు చికిలించి, ప్రశ్నార్థకంగా చూసింది.

దీపిక పలికింది. "పెళ్ళి తర్వాత ఆడదాని జీవితం అదృష్టంమీదే ఆధారపడి ఉంటుంది. మంచి మొగుడు దొరికితే స్వర్గం. దుర్మార్గుడు దొరికితే నరకం. మన వైవాహిక జీవితంలోని కష్టసుఖాలు మనకు దొరికే మగాడి మనస్తత్వం మీద ఆధారపడి ఉంటాయిగాని మనకు జరిగింది మొదటి పెళ్ళా, రెండో పెళ్ళా అన్నది కూడా సమస్య కాబోదని నాకిప్పుడే అర్థమయింది. అది నిజం కాదంటారా మేఘనగారూ? "

మేఘన తడబడింది. దీపిక ఆ మాటలు తనను దృష్టిలో పెట్టుకునే అన్నదన్న విషయం ఆమెకు అర్థమయిపోయింది.

జవాబు చెప్పడం కష్టమయిందేమోగాని, అప్పుడే ఆమెకు ఆ సత్యం అర్థమయింది. 'అవునూ! దీపిక చెప్పేవరకూ నేను ఈ కోణంలో ఎందుకు ఆలోచించలేదూ? ' ఆమె తనను తానే ప్రశ్నించుకుంది.

అరనిమిషమయినా ఆమెనుండి జవాబు రాకపోవడంతో దీపికనే పలికింది. "జవాబు ఇప్పుడే చెప్పనవసరం లేదులే మేఘనగారూ! కాకపోతే నామాట నిజమో కాదో కాస్త ప్రశాంతంగా ఆలోచించండి! అంతే"

ఆ తర్వాత ఇద్దరి మధ్యా సంభాషణ సాగలేదు. ఎవరి ఆలోచనల్లో వాళ్లుండిపోయారు.

కొద్దిసేపటి తర్వాత దీపికనే లేస్తూ "వెళ్దామాండి? " అంది.

మేఘన తలాడించి లేచింది.

ఇద్దరూ రెస్ట్‌రూమ్‌లోంచి బయటకు నడిచారు.

మేఘన పరధ్యాసగానే తన క్యాబిన్‌లో కెళ్ళి సీట్లో కూర్చుంది.

అకౌంట్ బుక్స్ ముందేసుకుని కూర్చుందిగాని, మనసు పనిమీద లగ్నం కాలేదు. దీపిక మాటలే చెవుల్లో గింగురుమంటు

న్నాయి.

"...వైవాహిక జీవితంలోని కష్టసుఖాలు మనకు దొరికే మగాడి మనస్తత్వంమీద ఆధారపడి ఉంటాయిగాని మనకు జరిగింది మొదటి పెళ్ళా, రెండోపెళ్ళా అన్నది అసలు సమస్య కాబోదు..." అది దీపిక స్టేట్ మెంట్.

అంతలోనే ఆమెకు రాజేశ్వరి గుర్తుకు వచ్చింది.

"రెండోపెళ్లి వలన కష్టనష్టాలుంటాయని రాజేశ్వరి జీవితం చెపుతున్న అనుభవ పాఠం"

మరిప్పుడు తను దేనిని నమ్మాలి.

అంతలోనే ఆమెకు ఆ ప్రశ్న ఎదుట నిలిచింది. "నీ జీవితం నీవు బతకదలచుకున్నప్పుడు అనుభవాల పాఠాలతోనేగానీ, ఇతరుల అభిప్రాయాలతో నీకు పనేముంది? "



ఆమె వెంటనే తల విదిలించింది. 'ఇవన్నీ పిచ్చిపిచ్చి ఆలోచనలు. ఇలాంటి ఆలోచనలవల్ల బుర్రపాడు కావడం తప్ప మరే ఉపయోగమూ లేదు. వీలయినంతవరకూ ఇలాంటి సంభాషణను వినకూడదు. ఇలాంటి ఆలోచనలు మనసులోకి రానివ్వకూడదు'

ఆమె అతికష్టంమీద మనసును పనిమీద లగ్నం చేసింది.

అయితే అది కొద్దిసేపే.

పాడుమనసు పనిమీద నిలువలేదు.

మేఘన యథాలాపంగా తలెత్తి అటు చూస్తే ధీరజ్‌కుమార్ తలొంచుకుని తన పని తాను చేసుకుంటూ కనిపించాడు.

అప్పుడు అలా ఆత్రుత ప్రదర్శించిన వ్యక్తి ఇప్పుడు ఏమీ పట్టనట్టు ఇలా ఎలా నిశ్చింతగా ఉండగలుగుతున్నాడు. నిజంగా నిజంగానే అతడు తనను పూర్తిగానే మర్చిపోయాడా? లేక మర్చిపోవడానికి ప్రయత్నిస్తున్నాడా? ఇప్పుడు తనే చొరవ చూపితే ఏమవుతుంది? 'సారీ! మేడమ్' అంటాడా లేక సంతోషపడిపోతాడా?

ప్రశ్నలకు జవాబు దొరకలేదుగాని మనసు మాత్రం మరోసారి హెచ్చరించింది. వద్దనుకుంటూనే ఇలాంటి ఆలోచనలు మళ్ళీ మనసులోకి రానిస్తావేంటి?

అదే మనసుగుణం. వద్దనుకున్నా ఊరుకోదు. కావాలనుకున్నా దానిమీద లగ్నం కాదు.

మనసు మన మాట వినేలా చేసుకోవడం చాలా కష్టం!

**ఆ** సాయంత్రం అయిందింటికి రేణుశ్రీ ఆఫీసుకొచ్చింది.

ఆమెను చూసి ఆఫీసు స్టాఫ్ అందరూ ఆనందంగా చుట్టుముట్టారు. అయితే ఆమె వాలకం చూసి కొద్దిగా ఆలోచనలోనూ పడ్డారు.

రేణుశ్రీ ఆఫీస స్టాఫ్ అందరినీ పేరు పేరునా పలకరించింది.

ఆఫీస్ అవర్స్ అయిపోయాక కావ్య, దీపిక, మేఘనలతో కలిసి బయటకు నడిచింది.

రోడ్డుమీదకు చేరాక ఆమె మిగిలిన ముగ్గుర్నీ చూస్తూ ప్రశ్నించింది. "చెప్పండి, ఎక్కడికెళ్దాం? "

"నీ ఇష్టం"

"ఏదయినా రెస్టారెంట్‌కెళ్ళి కాసేపు కబుర్లు చెప్పుకుంటూ కూర్చుందామా? "

ఆమె మేరీడ్ లైఫ్ గురించి తెలుసుకోవాలన్న ఆతృత ఆ ముగ్గురిలో ఉండడంతో వాళ్ళు వెంటనే తలాడించారు.

ముగ్గురూ దగ్గరే ఉన్న రెస్టారెంట్ వైపు అడుగులేశారు.

రెస్టారెంట్‌లో ఓ కార్నర్ సీట్‌లో రిలాక్స్‌గా కూర్చున్నాక రేణుశ్రీ ఆ ముగ్గురికేసి ఒకసారి చూసి "చెప్పండి! ఏమిటి విశేషాలు? " అడిగింది.

"మా దగ్గర విశేషాలేముంటాయి. కంప్యూటర్ ప్రోగ్రామింగ్, అకౌంట్స్ చూసుకోవడం. ఫోన్‌కాల్స్ రిసీవ్ చేసుకోవడం. ఇవేకదా. మా ముగ్గురి పని. గత ఆరునెలలుగా మా పనిలో ఏ మార్పూ లేదు. రొటీన్ వర్క్. ఏదయినా మార్పంటూ ఉంటే అది నీ లైఫ్‌లోనే ఉంది. మేరీడ్ లైఫ్. కాబట్టి విశేషాలు నువ్వే చెప్పాలి" కావ్య గలగలా చెప్పేసింది.

ఆ మాటల్ని బట్టి మేఘన కావ్యకు తను చెప్పిన విషయాలేవీ వివరించలేదన్న సంగతి రేణుశ్రీకి అర్థమయింది.

ఆమె మేఘనను చూసి అదోలా నవ్వింది.

ఏదో మాటల మధ్య అనుకోకుండానే దీపికకయినా ఆమె విషయం చెప్పిందిగాని లేకపోతే తను అసలు దీపికకూ ఆ విషయాలేవీ చెప్పి ఉండేదికాదు. మనసులో అనుకుంది మేఘన.

రేణుశ్రీ భుజాలెగరేసి "ఓ... కే. ఇప్పుడు నా గురించే. నేను మీకు చెప్పాలి. నో ప్రాబ్లమ్ చెపుతాను. ముందుగా మీరేం తీసుకుంటారో చెప్పడి. సప్లయిర్‌కి ఆర్డరిచ్చేద్దాం" అంది.

"కూల్‌డ్రింక్"

రేణుశ్రీ సప్లయర్‌ని పిలిచి కూల్‌డ్రింక్స్‌కి ఆర్డరిచ్చింది.

రెండు నిమిషాలలోనే అతడు నాలుగు బాటిల్స్ ఓపెన్‌చేసి టేబుల్‌మీద ఉంచి దూరంగా వెళ్ళిపోయాడు.

"ఓ.కే. ఇక చెప్పు. ఏమిటి విశేషాలు? "

కావ్యకు తన గురించి తెలుసుకోవాలన్న క్యూరియాసిటీ ఎక్కువగా ఉందన్న విషయం రేణుశ్రీకి అర్థమయిపోయింది.

క్రితంరోజు మేఘనతో తను చెప్పిన విషయాన్ని వాళ్లకు క్లుప్తంగా వివరించింది రేణుశ్రీ.

ఆమె చెప్పిన విషయాన్ని ఉదయమే విని ఉండడంతో దీపిక ఆశ్చర్యపోలేదుగాని కావ్య షాక్ తిన్నట్టుగా కొద్దిసేపు మాట్లాడలేకపోయింది.

"మైగాడ్ ఇలా జరిగిందా? " అంది చాలా సేపటి తర్వాత.

"అవును"

మేఘన చెప్పినట్టే దీపిక ఆమెకు ధైర్యం చెప్పే ప్రయత్నం చేసింది. "ఏవో చిన్న మనస్పర్థలతో ఇలా అయిందిగాని నాలుగు రోజులు గడిస్తే అంతా అదే సర్దుకుపోతుంది. చూస్తూ ఉండు ఓ వారం పది రోజుల తర్వాత మీవారు పరుగెత్తుకొచ్చి 'సారీ రేణూ! ఏదో అలవాటయిన మనస్తత్వంతో అలా అనుమానించి మాట్లాడాను. నువ్వు దూరమయ్యాక నువ్వేంటో నాకు తెలిసింది. నా అనుమానాలన్నీ అనవసరమయినవని తెలిసింది. రా ఇంటికెళ్లిపోదాం' అని బతిమలాడి ఇంటికి తీసుకెళ్లిపోతాడు"

"అంత సీనేంలేదు" వెంటనే అనేసింది రేణుశ్రీ.

"అదేం? "

"మామధ్య వచ్చినవి అపార్థాలు కాదు. అనుమానాలు. అపార్థాలు తొలగిపోవచ్చుగాని అనవసరంగా పెంచుకున్న అనుమానాలు అంత సులభంగా తొలగిపోవు"

ఆమె అంత నమ్మకంగా చెప్పాక తాము చెప్పగలిగిందేమీ లేనట్టు దీపిక, కావ్యలు మౌనంగా ఉండిపోయారు.

అప్పటికే రెస్టారెంట్‌కి వచ్చి చాలాసేపవడంతో రేణుశ్రీ అంది "ఓకే, ఫ్రెండ్స్! మనం

మరోసారి కలుద్దాం"

వాళ్లు తలాడించారు. మేఘన బిల్లు చెల్లించింది. నలుగురూ రెస్టారెంట్‌లోంచి బయటకు నడిచారు.

రేణుశ్రీ స్కూటీ తెచ్చి ఉండడంతో మేఘనతో అంది "మనం నా స్కూటీ మీద వెళ్లి పోదాం"

"అలాగే"

దీపిక, రేణుశ్రీలకు గుడ్‌నైట్ చెప్పాక, వాళ్లిద్దరూ స్కూటీ మీద ముందుకు సాగారు.

స్కూటీ కొద్దిదూరం సాగాక మేఘన బాధగా అడిగింది. "రేణూ! నీ మాటలు... నీ మాటలు వింటుంటే మీరిద్దరూ ఇక కలసి కాపురం చేయడం కష్టమనే భావమే ధ్వనిస్తోంది. నిజంగా నీ కాపురం చక్కబడడం అంత కష్టమా? "

"మేఘనగారూ! మీకు మావారి గురించి పూర్తిగా చెప్పాను. అతడి పైశాచికత్వానికి నిదర్శనంకూడా చూపించాను. అలాంటి వ్యక్తి మారడు అన్నది సత్యం. ఎందుకంటే ఒక నమ్మకం, ఒక విపరీత లక్షణం నరనరాన జీర్ణించుకుపోయి ఉంటే అవి మరణం వరకూ మనిషిని వదలవు. మరి అలాంటప్పుడు అలాంటి వ్యక్తితో నిత్యం నరకం అనుభవిస్తూ కాపురం చేయడం ఎలా సాధ్యమో మీరే చెప్పండి? "

"నిజమే! మరీ అంత దారుణమయిన మనస్తత్వం ఉన్న వ్యక్తితో కలిసి కాపురం చేయడం కష్టమే. పాముతో సావాసం చేసినట్టే ఉంటుంది. ఏ నిమిషం ఏం జరుగుతుందో తెలియదు. అతడు ఎప్పుడు ఎలాంటి మాటలతో ఎలాంటి చేష్టలతో హింసిస్తాడో అనుకుంటూ ప్రతి నిముషం టెన్షన్ అనుభవిస్తూ బతకాలి. ఆ బతుకు బతకడంకన్నా చావడం మేలు. కానీ అలా అని...

ప్రశ్న మళ్లీ మొదటికే వస్తోంది. జీవితంలో కొన్నిసార్లు కొన్ని సమస్యలను ఏ కోణంలో విశ్లేషించి చూసినా ఒకే ప్రశ్న మిగులుతుంది. మరి ఇంకేం చేయగలం? "

ఆ ప్రశ్నకు జవాబు ఒక్కొక్కరు ఒక్కోరకంగా చెప్పొచ్చు అది వేరే సంగతి. ఆ జవాబు చెప్పే విధానం వారివారి మనస్తత్వం మీద, వ్యక్తిత్వం మీద, వారున్న పరిస్థితుల ప్రభావం మీద ఆధారపడి ఉంటుంది.

తన ఎదుట నిలిచిన ఆ ప్రశ్నకు రేణుశ్రీ ఏం జవాబు చెప్పబోతోంది.

అది తెలుసుకోవాలనే అడిగిందామె "అయితే మరిప్పుడేం చేయాలనుకుంటున్నావ్ రేణూ? "

అప్పటికే ఆలోచించుకుని ఓ నిర్ణయానికి వచ్చేసి ఉందేమో. రేణుశ్రీ వెంటనే జవాబు చెప్పింది.

"విడాకులు తీసుకుందామనుకుంటున్నాను"

చుట్టూ ఉన్న గాలి గాఢతను సంతరించుకున్నట్టు కదిలే దృశ్యాలు నిశ్చలన చిత్రాలుగా మారిపోయినట్టు మేఘనకు అదోరకమైన అనుభూతి కలిగింది.

చాలాసేపు ఆమె మాట్లాడలేకపోయింది.

ఆమె తేరుకుని చూసేసరికి స్కూటీ తమ కాలనీలో రోడ్డు అంచున ఆగి ఉంది.

రేణుశ్రీ తల తిప్పి చూసి "ఏమిటి మేఘనగారూ! ఉన్నట్టుండి ఏదో లోకంలోకి వెళ్లిపోయినట్టున్నారే" అంది నవ్వుతూ.

మేఘన తలాడించింది "నీ గురించే ఆలోచిస్తున్నాను"

"నా కథ కంచికి చేరిందని చెప్పేశాను కదా! ఇక ఆలోచించడానికేమీ లేదు"

మేఘన తలాడించి "వస్తాను రేణుశ్రీ" అని చెప్పి అక్కడినుండి ఇంటివైపు అడుగు లేసింది.

ఆమె ఇంటివైపు నడుస్తోందేగాని మనసు మనసులో లేదు.

"రేణుశ్రీ విడాకులు తీసేసుకుంటుంది. ఏ కారణానయితేనేం ఈ దేశంలో మరో స్త్రీ తన భర్తకు దూరమవుతుంది. అంటే

మూడు ముళ్లబంధంతో ముడిపడి సప్తప దితో బలపడిన బంధం చాలా సులభంగా తెగిపోయింది. ఆ తర్వాత ఏం జరుగుతుం దన్నది వదిలేస్తే ఒకవేళ ఆమె మరో పెళ్లికి సిద్ధపడినా బంధానికి బంధానికి మధ్య ఆడ దాని జీవితం చాలా బాధాకరంగా నడు స్తుంది. అది నిజం. అయ్యో! ఎన్నో ఆశ లతో ఎంతో ఘనంగా చేసిన పెళ్లి ఇలా అయిపోయిందేమిటా అని ఆమె తల్లిదం డ్రులు బాధపడుతూ ఉంటారు. ఇరుగుపొ రుగు ఆమెకేసి జాలిగా చూస్తారు. ఆమె కూడా ఎన్నో కలలుకన్న నా వైవాహిక జీవితం ఇలా ఎందుకు మారిపోయింది అని కుమిలిపోతుంది. కొంతకాలానికి బాధ తొలిగినా ఆ విషయం గుర్తుకొచ్చినపుడల్లా మనసులో ముల్లుగుచ్చుకున్నట్టే ఉంటుంది. ఇది నిజం...

"మేఘనా!"

ఆలోచనలు కట్ అయ్యాయి. మేఘన తల తిప్పి అటు చూస్తే రాజేశ్వరి వీధిగేటు దగ్గరే నిలబడి ఉంది.

మేఘన ఆమె దగ్గరగా నడిచాక అడి గింది "ఏమిటక్కా"

"ఆఫీసు నుండి రావడం లేటయినట్టుంది"

"అవునక్కా! నా కొలీగ్ ఒకమ్మాయి మన కాలనీలో ఉంటోంది తను ఆఫీసుకొస్తే అందరం కలిసి అలా రెస్టారెంట్‌కి వెళ్లి కాసేపు మాట్లాడుకుంటూ కూర్చున్నాం"

"అయితే ఆఫీసు వర్క్‌తో లేట్ కాలేదన్న మాట"

"కాదు ఫ్రెండ్స్ కబుర్లు"

"నేను చాలాసేపటి నుండి నీకోసమే ఎదురుచూస్తున్నాను"

"ఎందుకు? "

"ఏమీ లేదులే. ఏమీ తోచక కాసేపు మాట్లాడుకుంటూ కూర్చుందామని"

"అమ్మకు చెప్పేసి వస్తాను. ఇప్పటికే ఆలస్యమయింది. కాబట్టి తను ఎదురు చూస్తూ ఉంటుంది"

"అలాగే"

మేఘన ఇంట్లోకి నడిచింది.

శ్రీలత ఇంట్లోనే కూర్చుని చదువుకుం టూనే టీవీ ప్రోగ్రామ్స్ చూస్తూ ఉంది. ఈమధ్యకాలంలో తను చాలా చోట్ల చూస్తూనే ఉంది. పిల్లలు ఒకవైపు చదువు కుంటూనే మరోవైపు టి.వి. చూస్తూ ఉం టారు. చదువుకునే సమయంలో ఎంతో ఏకాగ్రత ఉండాలి. కాని మధ్యమధ్యలో మనసు డైవర్ట్ చేసి మళ్లీ చదువు మొదలు పెట్టడం వల్ల ఖచ్చితంగా ఏకాగ్రత దెబ్బతిం టుంది. ఏకాగ్రత లేని చదువులు చదవడం ప్రమాదకరం. అయితే చాలా ఇళ్లల్లో పెద్దలు ఈ విషయాన్ని గుర్తించడం లేదు. టి.వి చూస్తూ చదువుకునే పిల్లల్ని అలా చేయొద్దని మందలించడంలేదు.

మేఘన అరిచినట్టు చెల్లెల్ని పిలిచింది. "శ్రీలతా! నీకెన్నిసార్లు చెప్పాను. టీవీ ముందు కూర్చుని చదవొద్దని"

"ఏదో మంచి ప్రోగ్రామ్ వస్తుంటేనూ..." శ్రీలత నసిగింది.

మంచి ప్రోగ్రాం వస్తుంటే పుస్తకం మూసేసి చూడు. అంతేగాని కాసేపు టి.వి చూడడం, కాసేపు పుస్తకం చదవడం చేస్తుంటే అటు చదివిందీ బుర్రకెక్కదు. ఇటు ఈ ప్రోగ్రామ్‌ని ఎంజాయ్ చేయలేవు"

"సర్లే" అనేసి పుస్తకాన్నే పక్కన పెట్టే సింది శ్రీలత.

మేఘన వంటగది వైపు నడిచింది.

వంటగదిలో వంట పనిలో మునిగి ఉన్న సుగుణమ్మ అలికిడికి తల తిప్పి చూసింది. మేఘన కనిపించాక అడిగింది "ఇంతాలస్య మయిందేమిటే? "

"కొలీగ్ ఒకమ్మాయి ఆఫీసుకొస్తే అందరం అలా రెస్టారెంట్‌కి వెళ్లి మాట్లాడు కుంటూ కూర్చున్నాం"

"సర్లే! స్నానం చేసిరా కాఫీ ఇస్తాను"

మేఘన తలాడించి బాత్‌రూమ్‌వైపు వెళ్లింది. స్నానం ముగించుకుని వచ్చాక

అమ్మ అందించిన కాఫీ తాగింది.

కాఫీ గ్లాసు తీసుకెళ్లి వంట గదిలో పెడుతూ సుగుణమ్మతో చెప్పింది "అమ్మా! నేనలా రాజేశ్వరక్క ఇంటివరకూ వెళ్లొస్తాను"

"ఇంత పొద్దుపోయాక అక్కడికెందుకే? "

"రాజేశ్వరక్కకు ఏమీ తోచట్లేదట. కాసేపు కబుర్లు చెప్పుకుందాం రమ్మంది"

సుగుణమ్మ దీర్ఘంగా నిశ్వసించి స్వగతంగా అంది "పాపం రాజేశ్వరి..."

ఆమె నిట్టూర్పుతో పాటు ఆ మాటలు విని మేఘన కనుబొమలు ముడివేసింది. "ఏమిటమ్మా ఏంటలా అంటున్నావ్? "

"అదేనే! ఆ అమ్మాయి కష్టాలు వింటుంటే చాలా బాధగా అనిపిస్తూ ఉంటుంది. ఈ లోకంలో ఆడదానికి ఎన్నెన్ని రకాల కష్టాలున్నాయోకదా అని మనసు తరుక్కుపోతుంది"

మేఘన నిలువుగా తలాడించింది. ఆ సమయంలో ఆమె కనుల ముందు రేణుశ్రీ కదలాడింది. రెండో పెళ్లి చేసుకుని రాజేశ్వరి కష్టపడుతుంటే మొదటి పెళ్లికే నరకాన్ని చూసి ఇంటికి చేరింది రేణుశ్రీ. నిజమే... ఈ లోకంలో ఆడదానికి ఎన్నెన్ని కష్టాలో?

కూతురు మౌనంగా ఉండిపోయినా ఆవిడ మనసు ఊరుకున్నట్టులేదు.

"ఒక్కోసారి ఆ అమ్మాయి నా దగ్గరకొచ్చి కన్నీళ్లు - పెట్టుకుంటుంది. ఈ బతుకు నాకొద్దు, నాకు చచ్చిపోవాలనుంది పిన్నిగారూ! అంటూ ఉంటుంది. మనం ఆమె కష్టాలను వినగలమేగాని ఆర్చగలమా తీర్చగలమా? నేనేదో కాసిన్ని ఓదార్పు మాటలు చెప్పి పంపుతాను. అంతకుమించి నేను మాత్రం ఏం చేయగలను చెప్పు? "

"నిజమే కొన్ని జీవిత సమస్యలను ఎవ్వరూ తీర్చలేరు. కనీసం ఆ సమస్యలో వేలు పెట్టడానికి భయపడితీరాలి. ముఖ్యంగా అది భార్యాభర్తల మధ్య జరుగుతున్న సమస్య అయినప్పుడు"

"అయినా వాడొట్టి పనికిమాలిన వెధవలా గున్నాడు. తనకది రెండో పెళ్లి అని తెలిసి కూడా ఇష్టపడి పెళ్లి చేసుకున్నప్పుడు, ఇప్పుడు ఏదో త్యాగం చేసేసినట్టు మాట్లాడడం, తనేదో నష్టపోయినట్టు బాధపడడం, అది మనసులో పెట్టుకుని ఆ అమ్మాయిని చిత్రహింసలు పెట్టడం ఎంతవరకూ సబబూ? అడిగేవాళ్లు లేకపోతే ఈ మగాళ్లు ఎంతకయినా తెగిస్తారు. నేను ఆ అమ్మాయికి ఆ విషయమే చెప్పాను. నువ్వు మీ పుట్టింటోళ్లకి ఈ విషయం వివరంగా చెప్పు అని! కాని ఆ అమ్మాయికి అలా చెప్పడం ఇష్టం లేనట్టుంది. 'నా బతుకు రెండోసారి కూడా ఇలా అయిందంటే వాళ్లింక బతకరు పిన్నిగారూ' అంటూ ఒకటే ఏడుపు..."

మేఘనకు మనసంతా వాసిలేటింగ్‌గా తయారయింది.

"అమ్మా! నేనిక వెళ్లొస్తాను"

"ఆc... త్వరగా వచ్చెయ్యి"

మేఘన తలాడించి ఇంట్లోంచి బయటకు నడిచింది.

రాజేశ్వరి హాలులోనే కూర్చుని తన కోసమే ఎదురు చూస్తున్నట్టుంది. ఆమెను చూడగానే "రా మేఘనా! రా... ఇలా కూర్చో" ఆహ్వానించి తన పక్కన ఉన్న కుర్చీని చూపించింది.

మేఘన ఆ కుర్చీలో కూర్చున్నాక అటు నిటు తల తిప్పి చూసింది.

భర్త ఇంట్లో ఉన్నప్పుడు లేదా వచ్చేస్తాడని తెలిసినప్పుడు ఆమె తనను ఆ ఇంట్లోకి పిలవదన్న విషయం తెలిసి కూడా మేఘన అడిగింది "మీ వారు ఇంట్లో లేరుకదా? "

రాజేశ్వరి అదోలా నవ్వి చెప్పింది "రాత్రికి ఇంటికి రారని నా నమ్మకం"

"అదేమిటి? "

"ఆయన ఓ చిన్నిల్లు ఏర్పాటు చేసుకున్నారు కాబట్టి"

మేఘన జాలిగా రాజేశ్వరి ముఖంలోకి

చూసింది. ఎందుకో ఆమెను చూస్తే ఆ క్షణం అగ్నిపర్వతమే గుర్తుకొచ్చింది. లావాను గుండెల్లో దాచుకుని పైకి ప్రశాంతంగా కనిపించే అగ్నిపర్వతం. ఈ దేశంలో చాలామంది ఆడవాళ్లు కష్టాలను, కన్నీళ్లను దిగమింగుకుని అగ్నిపర్వతాల్లానే బతుకుతున్నారు. వాళ్లలో ఏ కొందరో ఫెటిల్లున పగిలి చరిత్రను సృష్టించడమో లేక తమ జీవిత చరిత్రను తామే తిరగరాసుకోవడమో చేస్తున్నారు.

"మీవారు... మీవారు మరీ శృతిమించి పోతున్నట్టుందక్కా"

"నా జీవితం మొదట్లోనే శృతి తప్పింది. ఇక ఆయన ఇప్పుడు శృతి తప్పి ప్రవర్తించడంలో తప్పేముంది. తప్పించగలిగేది ఏముంది? "

తానిక ఏమీ చేయలేననుకుని తెలుసుకుని నిస్సహాయ స్థితిలో పడిన ఆడది అంతకన్నా ఆశావాదంతో ఎలా మాట్లాడగలదు?

మేఘనకు కూడా ఆమె పరిస్థితిపట్ల బాధ కలుగుతోంది. కనీసం తానయినా ఏదో చేయాలనిపిస్తుంది. అయితే ఏం చెప్పగలదు?

"అయితే... అయితే నిన్నిలా కష్టపెడుతున్న మీవారిని ఏమీ చేయలేవా? "

"ఏం చేయగలం? ఆలోచించి చూడు. ముఖ్యంగా నా గతాన్ని దృష్టిలో పెట్టుకుని ఆలోచించు. ఒకసారి భర్తను కోల్పోయిన దురదృష్టవంతురాల్ని. ఇప్పుడు పునర్జన్మ లాంటి ఈ రెండో పెళ్లిలో దొరికిన భర్తను వదిలి, సంసారాన్ని కాలదన్నుకుని చేయగలిగేదేముంది? నేనలా చేస్తే లోకం నన్నే ఆడిపోసుకుంటుంది. వళ్లు కొవ్వెక్కిన ఆడదానినని నిందవేస్తుంది. నేనేం చేయగలనో నువ్వే చెప్పు. తానేదో త్యాగం చేశానని, మరేదో కోల్పోయానని అసంతృప్తితో వేగిపోయే భర్తను ఎలా తృప్తిపరచను? ఆయన నన్ను చిత్రహింసలు పెట్టకుండా నన్ను నేను ఎలా కాపాడుకోగలను? నువ్వే చెప్పు మేఘనా!"

తన స్థాయికి జవాబు దొరకని ప్రశ్నలే అవి. మరిక తాను జవాబేం ఇవ్వగలదు?

"నాకు జవాబులేం తోచడం లేదక్కా"

"చాలామంది అంటూ ఉంటారు ప్రతి సమస్యకూ ఒక పరిష్కారం ఉంటుందని. మరి ప్రస్తుత నా పరిస్థితికి సరయిన పరిష్కారమేమిటో చెప్పమనండి. నేను దురదృష్టవశాత్తు భర్తను కోల్పోయాను. ఆదర్శవాదిగా పేరు తెచ్చుకోవాలన్న కోరికతో నన్ను మళ్లీ పెళ్లి చేసుకున్నాడు. అయితే కొద్దిరోజులకే అతడి ఆవేశం ఎగిరిపోయింది. ఆదర్శం అడుగంటిపోయింది. తనేదో కోల్పోయానన్న ఫీలింగ్ ఎక్కువయిపోయింది. అతడు నన్ను చిన్నగా బాధపెట్టడం మొదలుపెట్టి, ఇప్పుడు చిత్రహింసలు పెట్టే స్థితికి చేరుకున్నాడు. చెడు అలవాట్లను పెంచుకున్నాడు. నన్ను మరింత బాధపెట్టే ప్రయత్నంలో మరో ఆడదాన్ని ఉంచుకున్నాడు. నిజానికి నేను నిమిత్తమాత్రురాలినే. జరిగిన, జరుగుతున్న సంఘటనల్లో నా ప్రమేయం చాలాకొద్ది. కాని బలి పశువును మాత్రం నేనే. ప్రతి సమస్యకూ ఒక పరిష్కారం ఉంటుందనే వాళ్లు నా సమస్యకు ఏం పరిష్కారం చెపుతారు? చిత్రహింసలు అనుభవించడం కన్నా ఈ భర్తను వదిలేసి మరో కొత్త జీవితం మొదలుపెట్టమని చెప్పొచ్చు. నేనిప్పుడు ఇతడిని వదిలేస్తే నా పరిస్థితి తారుమారు కావడమే కాదు, నన్ను కన్నవాళ్ల బతుకులూ బజారునపడతాయి. నన్ను కన్న పాపానికి వాళ్ల బతుకులన్నీ బజారుపాలు చేయడం ఎంతవరకు న్యాయం? నేను ఆ పని చేయలేను. అలా అని ఈ చిత్రహింసనూ ఎక్కువకాలం భరించలేను" రాజేశ్వరి గొంతు జీరవోయింది.

అప్రయత్నంగానే మేఘన రాజేశ్వరి భుజం మీద చెయ్యివేసింది. "అక్కా..

# ఏరినముత్యాలు

❖ అర్థం చేసుకోలేని విషయాన్ని ఏ వ్యాఖ్యానాలు వివరించలేవు.

– విన్సెంట్ పీలె

❖ భాష అభివ్యక్తికి సాధనమైతే అనుభూతి భాషకు ఇంధనం.

– బుచ్చిబాబు

❖ వ్యక్తిగత హృదయపరిణామంవల్లే సామాజిక పరిణామం జరుగుతుందిగాని చర్చలవల్లకాదు.

– ఎమర్సన్

❖ ఇనుమునందు పుట్టి ఇనుమునే తినివేయు తుప్పువంటిది తులువతనం.

– నార్ల వెంకటేశ్వరరావ్

❖ బాట చూడవలసిన బాధ్యత బండివానిదేకాని బండిలో ఉన్నవారిది కాదు.

– జయప్రకాష్‌నారాయణ

❖ చాలామంది జీవితాన్ని అనుభవించడానికి బదులుగా వాయిదా వేసుకునేవారే

– హెలెన్‌కెల్లర్

❖ పగ్గాలు లేక అదుపు తప్పిన అశ్వాలు రథాన్ని, రథికుణ్ణి నాశనంచేసినట్టే, వశం తప్పిన ఇంద్రియాలు మానవుణ్ణి సర్వనాశనం చేస్తాయి.

– వివేకానంద

❖ మంచి చేకూర్చని చదువు, హాయికలిగించని సంగీతం, సభ మెచ్చని మాటలు నిస్సారము.

– భర్తృహరి

❖ ప్రతి ఒక్కరూ జాగ్రత్తగా అనుసరించదగ్గ విషయాలు మూడు. శరీర నియమం, వాక్‌నియమం, మనో నియమం.

– శ్రీ నిర్మలానంద

❖ సహచరుల ఆదరాభిమానాలను చూరగొనడమే మానవజీవితం యొక్క ముఖ్యధర్మం.

– వాషింగ్‌టన్

❖ తెలియని మూర్ఖునికంటే కుచ్చితుడుచేసే అపకారం చాలా ఎక్కువ.

– అరిస్టాటిల్

❖ అహాన్ని, అధర్మాన్ని చీల్చే సమాజహితమే సాహిత్యలక్ష్యం.

– తాపీ ధర్మారావు

సేకరణ: **ముద్దంశెట్టి అండమ్మ**

అక్కా" ఓదార్పుగా ఏదో చెప్పాలనిపిస్తోంది గాని తనకీ గొంతు పెగలడం లేదు.

రాజేశ్వరి కళ్ల నుండి ధారగా అశ్రువులు జారసాగాయి.

కలకంఠి కంట కన్నీరొలికితే... ఏం జరుగుతుంది ఏమీ జరగడంలేదు.

రాజేశ్వరి ఆ రోజు మరింత ఎక్కువగా బాధపడుతోందంటే బహుశా ఆ రోజు ఆమె మనసు మరింత బాధపడే సంఘటన ఏదయినా జరిగి ఉండొచ్చని అనిపించింది మేఘనకు.

అందుకే ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని అడిగింది. "ఈ రోజు ఏదో జరిగినట్టుంది. అందుకే నువ్వింతగా బాధపడుతున్నావ్. ఏం జరిగిందక్కా? అసలేం జరిగింది? "

రాజేశ్వరి కొద్ది క్షణాలపాటు పెదవులు బిగపట్టి ఉండిపోయింది.

"చెప్పక్కా! ఏం జరిగిందో చెప్పక్కా"

"ఏం చెప్పను మేఘనా!" రాజేశ్వరి కొంగుతో కళ్లు తుడుచుకుంది. "ఈ రోజు సాయంత్రం మావారు ఇంటికొచ్చి ట్రిమ్‌గా తయారయ్యి బయటికెళుతుంటే బుద్ధి తక్కువయ్యి ఎక్కడికండీ వెళుతున్నారు? అని అడిగాను. అంతే నా చెంప పగిలింది. 'ఏమిటే! నేను ఎక్కడికెళితే నీకెందుకు? నువ్వేమయినా నా కోసమే పుట్టి నా కోసమే పెరిగావా? ఎవడో అదృష్టవంతుడు నిన్ను మధ్యలోనే వదిలేసి చస్తే దురదృష్టవంతుడిని నేను నిన్ను కట్టుకున్నాను. చేసిన పొరపాటుకి బాధపడుతున్నాను. నీలాంటి సెకండ్‌హాండ్ ముండతో ఎంతకాలం అసంతృప్తితో గడపమంటావ్? అందుకే 'చిన్నిల్లు' సెటప్ చేసుకున్నాను. ఆ విషయం నీకూ తెలుసు. అయితే నీకు తెలియని విషయం ఏమిటంటే- ఈరోజు నుండి నేను ప్రతిరాత్రి ఆ ఇంటికెళ్లి అక్కడే గడుపుతాను. ఎప్పుడయినా ఇష్టమున్నప్పుడు ఒకరోజు ఇక్కడికి వస్తుంటాను. కాసేపు ఉండి వెళ్ళిపోతుంటాను. ఏదో బుద్ధి తక్కువయి కట్టుకున్న ఖర్మానికి జేబులో ఉన్నప్పుడు కాస్తో కూస్తో ఇచ్చి వెళ్తుంటాను. సో! ఇకమీదట నేను ఎప్పుడు వచ్చినా, ఎప్పుడు వెళ్లినా ఏమిటండీ ఇంత ఆలస్యమయింది? ఇప్పుడు ఎక్కడికెళుతున్నారు? ఇలాంటి ప్రశ్నలు అడగకూడదు. అడిగితే చంపేస్తాను' అన్నాక మరో రెండు దెబ్బలు కసితీరా కొట్టి వెళ్ళిపోయాడు"

"వాడు... వాడు మనిషా లేక పశువా? " అతడు ఆమె భర్త అని, అలా అంటే ఆమె బాధపడుతుందేమోనన్న విచక్షణనూ మరచిపోయింది మేఘన. ఆ క్షణం ఆమెకు అంత కసి కలిగింది. ఒకవేళ ఆ సమయంలో ఆమె భర్త ఎదురుగా ఉండిఉంటే అనుమానం లేకుండా నిర్భయంగా ఆ ప్రశ్న అతడినే అడిగి ఉండేది మేఘన.

రాజేశ్వరి విరక్తిగా నవ్వింది. "ఆ విషయమే నాకూ అర్థం కావడంలేదు. కానీ ఒక్క విషయం మాత్రం నాకు అర్థమయిపోయింది"

"ఏమిటి? "

"అతడిప్పటివరకూ నా తిండికి, గూడుకి లోటు లేకుండా చూశాడు. కానీ ఇకమీదట మెల్లగా నన్ను పట్టించుకోవడం మానేస్తాడు. ఇప్పటివరకూ నన్ను తిండిపెట్టి కొట్టిన అతడు ముమ్మందు తిండిపెట్టకుండా మాడ్చి చంపుతాడు"

"పరిస్థితి అంత దూరం రాదులే అక్కా! ఒకవేళ దురదృష్టవశాత్తు అతడు అలా చేసినా నీకు మేమంతా లేమా? సాధ్యమయినంతలో నీకు ఏ లోటూ రాకుండా చూసుకుంటాం"

"థాంక్సమ్మా మేఘనా" అంది రాజేశ్వరి రుద్ధమైన కంఠంతో.

మరికాసేపు ఆమెను ఓదార్పు మాటలతో ధైర్యంగా ఉండమని చెప్పాక మేఘన కుర్చీలోంచి లేచింది.

ఆమె బయల్దేరబోతోందని తెలిసినట్టు

రాజేశ్వరి అడిగింది "మేఘనా... మేఘనా... ఈ రాత్రికి నువ్వు ఇక్కడే పడుకోకూడదూ"

"పడుకోడానికి నాకు అభ్యంతరమేమీ లేదుగానీ కొత్తచోటున నాకు వెంటనే నిద్ర పట్టదక్కా. ఈరోజు రాత్రి నిద్ర పోకపోతే రేపు ఆఫీసులో మత్తుగా ఉంటుంది. పనికి ఆటంకం కలుగుతుంది. అందుకని ఏదయినా శనివారం రాత్రి ఇక్కడ పడుకుంటాను. మొదటిరోజు నిద్రపట్టకపోయినా ఫర్వాలేదు. మర్నాడు ఆదివారమే కాబట్టి ప్రాబ్లమ్ లేదు. హాయిగా పగలు నిద్రపోవచ్చు ఆ తర్వాత ఇక్కడ పడుకోవడం అదే అలవాటయిపోతుంది"

"సరే... అలాగే కానివ్వు" అంది రాజేశ్వరి.

మేఘన ఆ ఇంటిలోనుండి బయటకు నడుస్తుంటే వెంట వాకిలివరకూ వచ్చిన రాజేశ్వరి ఆమె చెయ్యి పట్టుకుంది.

ముందుకు అడుగులేస్తున్న మేఘన రాజేశ్వరి చెయ్యి పట్టుకోవడంతో ఆగి, తల తిప్పి ఆమె ముఖంలోకి చూసింది "ఏమిటక్కా? "

రాజేశ్వరి తడబడ్డట్టు వెంటనే ఆ చెయ్యి వదిలేసి "అది అది ఏంలేదులేమ్మా. నువ్వెళ్ళు" అంది.

ఆమె మనసు పరిపరివిధాలా ఆలోచించి బాధపడుతోందన్న విషయం మేఘనకు అర్థమయింది. ఆ సమయంలో తోడుగా ఎవరయినా ఉంటే బాగుంటుందని ఎవరికయినా అనిపించడం సహజం. కానీ తన పరిస్థితిని దృష్టిలో పెట్టుకుని మేఘన అయిష్టంగానే బయటకు నడిచింది.

తన జీవితంలో తను చేసిన అతి పెద్ద పొరపాట్లలో అదొకటన్న విషయం, మర్నాడు ఉదయంగానీ మేఘనకు అర్థంకాలేదు.

★ ★ ★

ఆ సమయంలో మేఘన బాత్‌రూమ్‌లో ఉంది.

బయటనుండి తలుపు దబదబా బాదాక శ్రీలత అరిచింది "అక్కా! త్వరగా బయటకు రా"

"ఎందుకే? "

"బయటకు రా చెపుతాను"

నాలుగు చెంబులు నీళ్ళు వంటిమీద పోసేసుకుని బట్టలు చుట్టుకుని బయటకొచ్చింది మేఘన.

అప్పటివరకూ బాత్‌రూమ్ తలుపు దగ్గరే ఉన్న శ్రీలత రొప్పుతూ చెప్పింది. "అక్కా! మన... మన ఎదురింటి రాజేశ్వరక్క చనిపోయింది"

మేఘనకు శ్రీలత చెప్పిందేమిటో మొదట అర్థం కాలేదు. తన చెవులు సరిగా పనిచేయడం లేదేమోనన్న అనుమానం కలిగి అడిగింది. "ఏమిటే...! ఏమిటే నువ్వు చెప్పేది? "

"నిజమక్కా! మన ఎదురింటి రాజేశ్వరక్క చనిపోయింది. అమ్మా నాన్న అక్కడికే వెళ్ళారు"

కొద్దిక్షణాల పాటు మెదడు పనిచేయలేదు. తను విన్న మాటల్ని రిసీవ్ చేసుకోవడానికి ఇష్టపడనట్టు ఆమె మెదడు స్థంభించిపోయింది.

"రా అక్కా... ఇంకా ఇక్కడే నిలబడ్డావేం. రా వెళ్దాం" శ్రీలత చెయ్యి పట్టుకున్నాకే ఆమె ఈ లోకంలోకి వచ్చింది.

చెల్లెలి వెంట ఎలా వెళ్ళిందో తెలియదు. ఎదురింటికెళ్ళి అటు చూస్తే-

సీలింగ్ ఫ్యాన్‌కి వేలాడుతున్న రాజేశ్వరి శరీరం కనిపించింది.

మేఘన కళ్ళెత్తి ఆ శవాన్నే చూస్తుండిపోయింది.

ఆ దృశ్యం సత్యమన్న నమ్మకం ఆమెకింకా కలగడంలేదు. రాత్రి తన చెయ్యి పట్టుకుని 'ఈ రాత్రికి ఇక్కడే ఉండిపో మేఘనా' అని బతిమిలాడిన రాజేశ్వరక్కనే ఆమె కళ్ళముందు ఇంకా కదలాడుతోంది.

కొద్దిసేపు ఆమెకు ఏడుపు రాలేదు. ఆమె

✤ ఆఫీసులకొచ్చిన అరగంటలోపే కునికి పాట్లు పడే నిద్రపెద్దమ్మలు కొందరుంటారు. ఉదయం పదిగంటల నలభై నిమిషాలకైనా, సాయంత్రం నాలుగు గంటల నలభై నిమిషాలకైనా, ఈ రెంటికీ మధ్యకాలంలో ఏ నిమిషంలోనైనా నిర్భయంగా, నిశ్చింతగా, నిర్లజ్జగా నిద్రపోతారు. భోజనం తేనీరులకు రెండు గంటలు కేటాయించి ఇక మిగిలిన సమయంలో సదా నిద్రమొహంతో చిరాకు పుట్టిస్తూ, ఏ మూల సీటో సంపాదించి మరీ నిద్రపోతారు. రైతు బజార్లో కూర్చోబెట్టినా నిద్రను ఆపుకోలేని ఇలాంటివారు అధికారుల ఎదుట మాత్రం నక్క వినయాలే ప్రదర్శిస్తుంటారు. ఇలాంటి సన్నివేశాలతో సినిమా తీస్తే ప్రేక్షకులకు లోకం పోకడలు మరింత బాగా అర్థమవుతాయి. ఉద్యోగులు ఎలా ఉండకూడదోననే సందేశం సినిమా ద్వారా అందుతుంది. 'ముంబయినీ శేఠాని' అనే తొలి గుజరాతీ సినిమా రెండు రీళ్లే ఉంది. మదన్ థియేటర్స్ వారు 1932 జనవరి 9న దీనిని నిర్మించారు. కాగా ఇదే 1932 ఏప్రిల్ 9న ముంబయిలో వెస్ట్ ఎండ్ సినిమా అని పిలిచే 'నాజ్'వద్ద నానూ భాయి వకీల్ దర్శకత్వం వహించిన 'నర్సింహమెహతా' పేరిట పూర్తి నిడివిగల తొలి చిత్రం నిర్మించటం విశేషం.




## విచిత్ర విశ్వం

✤ అప్పుదీయ రోత హరి హరాదులకైన, మొప్పెతోడ మైత్రి మొదలెరోత, తప్పు బలుకరోత తాకట్టు కడురోత" అన్నాడు వేమన. అప్పుచేసిన వారి బతుకు అసహ్యకరమవుతుంది. కనుక "అప్పులేనివాడె అధిక సంపన్నుడు" అన్నాడాయన. ఒకప్పుడు అప్పులకోసం షావుకార్లచుట్టూ తిరిగి వడ్డీలిచ్చి మరీ డబ్బు అప్పుగా తెచ్చుకునే వారు. కానీ ప్రస్తుతం 'నేనంటే నేనని' పోటీ పడి బ్యాంకులు రుణాలందిస్తున్నాయి. రుణాలు తిరిగి వసూలు చేసుకోవడానికి ఒక్కొక్కరు ఒక్కో పద్ధతి నవలంబిస్తారు. అలాగే డబ్బు దాచుకోవాలంటే పూర్వం భోషాణాలను ఆశ్రయించేవారు. బ్యాంకులు వచ్చాక డబ్బు దాచేపని సులువైంది. సేవింగ్స్ బ్యాంక్ సౌకర్యాన్ని మొట్టమొదటిసారిగా కలకత్తాలోని ప్రెసిడెన్సీ బ్యాంక్‌లో ప్రవేశపెట్టారు. ఇందులో బ్రిటిషర్లకూ, భారతీయులకూ డబ్బు దాచుకునే సౌకర్యాన్ని కల్పించారు.



పెదవులు బిగపట్టి అటే చూస్తుండిపోయింది.

అది ఆత్మహత్య కేసు అని తెలియడంతో ఎవ్వరూ ముందుకు అడుగు వేయడంలేదు. అప్పటికే ఎవరో పోలీసులకి ఫోన్ చేశారట.

జనమంతా ఆ ఇంట్లో మూగిపోయి చోద్యం చూస్తున్నట్టు వేలాడుతున్న శవాన్నే చూస్తున్నారు.

పది నిమిషాలు గడవకముందే పోలీసులొచ్చారు. వారి వెంట ప్రెస్ జనం, ఫొటోగ్రాఫర్లు వచ్చారు.

పోలీసులు ఇరుగు పొరుగువాళ్ళని ఆ ఆత్మహత్య ఎలా జరిగి ఉంటుందో తెలుసుకోవడం కోసం వివిధ ప్రశ్నలు అడగసాగారు. వాళ్ళంతా వాళ్ళకు తెలిసిన విశేషాలు పోలీసులకు వివరించారు.

ఫొటోగ్రాఫర్లు ఫొటోలు తీశాక పోలీసులే శవాన్ని కిందికి దించారు.

అప్పటివరకూ అసలేమీ ఆలోచించని మేఘన అప్పుడే చుట్టూ పరిశీలించి చూసింది. 'రాజేశ్వరి భర్త అక్కడెక్కడా కనిపించడంలేదు. అంటే రాత్రంతా అతడు ఇంటికి రాలేదన్నమాట. ఉదయమూ ఇంటికి చేరుకోలేదు'

అప్పుడే పోలీసులు అనుకుంటున్న మాటలు ఆమె చెవిన బడ్డాయి. 'ఈమె చనిపోయి ఓ గంట అయిఉంటుంది'

మేఘనకు నీరసం ముంచుకొచ్చింది. కళ్లు తిరుగుతున్నట్టనిపించింది. ఆమె అలాగే గోడకు చేరగిలబడి పక్కనే ఉన్న తలుపును ఆసరాగా పట్టుకుంది.

ఎందుకో ఒక భావం మనసులో ముల్లులా గుచ్చుకుంటోంది. రాత్రి తను పొరపాటు చేసిందన్నది నిజం.

'రాత్రి... రాత్రి తను ఇక్కడే పడుకుని ఉంటే రాజేశ్వరికి ఆత్మహత్య చేసుకోవాలనే కోరిక కలిగిఉండేది కాదు'

అదిగో ఆ భావమే ఆమెను కుంగదీస్తోంది. మనసులోని దుఃఖం అక్కడే ఘనీభవించిపోయేలా చేసేస్తోంది.

'రాదేం... ఎంత ఏడవాలన్నా ఏడుపు రాదేం?'

పోలీసులు ఇల్లంతా గాలించి ఓ టెలిఫోన్ డైరెక్టరీ తీసుకున్నారు. బహుశా ఆ టెలిఫోన్ డైరెక్టరీ ద్వారా రాజేశ్వరి అమ్మా నాన్నలకు తెలియచేసి ఆమె భర్త ఆచూకీని కనుక్కుంటారేమో!

ఇంటిముందు పోలీసు జీపులోకి శవాన్ని ఎక్కించి పోస్ట్‌మార్టమ్‌కి తరలించసాగారు.

అప్పటివరకూ చోద్యం చూసిన జనం ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోయారు.

మేఘన తను కుటుంబసభ్యులతో తమ ఇంటివైపు నడిచింది.

ఆ వీధిలో మిగతా ఇళ్లవాళ్ళు ఎలా ఫీలవుతున్నారో తెలియదుగాని, ఆ ఇంట్లోని వాళ్లంతా చాలా ఎక్కువగానే బాధపడుతున్నారు. ఎందుకంటే రాజేశ్వరికి ఆ వీధిలో మిగతా కుటుంబాలతో కన్నా ఆ ఇంటి వాళ్ళతోనే ఎక్కువ అనుబంధం. ఆమె తన కష్టనష్టాలన్నీ ఆ ఇంట్లోవాళ్ళకి చెప్పుకునేది.

అందుకే ఆ ఇంట్లోవాళ్లు అంతగా కదిలిపోయారు.

సుగుణమ్మకయితే ఇంటిపనులు చేయడానికి కూడా మనస్కరించినట్టులేదు. ఆ ఇంట్లో ఆ ఉదయం టిఫిన్ తయారుకాలేదు.

శ్రీలత కళ్లనీళ్లు పెట్టుకుంటే నరసింగరావు ఆ అమ్మాయిని ఓదార్చాడు.

ఇక మేఘన విషయమయితే చెప్పనక్కర్లేదు. ఆరోజు ఆఫీసుకు రావడంలేదని ఫోన్‌చేసి చెప్పేశాక ఆమె తన రూమ్‌లో కెళ్ళి బెడ్‌మీద వాలిపోయింది.

రాజేశ్వరితో గడిపిన క్షణాలన్నీ మేఘనకు గుర్తుకు రాసాగాయి. ముఖ్యంగా గతరాత్రి రాజేశ్వరి తనను అక్కడే నిద్రపొమ్మని కోరడం పదేపదే గుర్తుకొస్తోంది. అంటే అప్పటికే ఆమె మనసు అల్లకల్లోలంగా

ఉండిఉంటుంది. ఆత్మహత్య చేసుకోవాలన్న ఆలోచన అప్పుడే మొదలయ్యి ఉండొచ్చు. తను కాస్త ఓపిక చేసుకుని ఉంటే ఆమెకు ఆ ఆలోచన తొలగిపోయి ఉండేదేమో. ఒక్కసారి ఆ ఆలోచన తొలగిపోయాక, మళ్ళీ ఆ ప్రయత్నం చేయడం కష్టమే!

ఆమె ఆ రోజంతా అలాంటి మూడ్‌లోనే ఉండిపోయింది.

మరోవైపు జరగాల్సిన పనులు జరిగిపోతూఉన్నాయి.

పోలీసులు రాజేశ్వరి అమ్మానాన్నల అడ్రస్‌లు పట్టుకుని వాళ్ళకు తెలియచేశారట. వాళ్లు వచ్చి కన్నీరు మున్నీరుగా విలపించడం జరిగింది.

ఆమె భర్తమీద పోలీసులు కేసు నమోదు చేశారు.

పోస్ట్‌మార్టమ్ తర్వాత శవాన్ని దహనం చేశారు.

మరో రెండురోజుల తర్వాత ఎదురింటి ఆ ఇల్లు ఖాళీ అయిపోయింది.

కాని- మేఘన మనసులో రాజేశ్వరి తాలూకు ఆలోచనలు బలంగా ముద్రించుకుపోయాయి.

★ ★ ★

రాజేశ్వరి చావుకు కోదండం ఆమెని పెట్టిన మానసిక హింసే కారణమని... ఆమె తల్లిదండ్రులు కేసు పెట్టడంతో అతడ్ని పోలీసులు అరెస్ట్ చేశారు.

"మా బాగా అయింది వెధవకి" శ్రీలత అంది.

"బలమైన రుజువులు చూపగలిగితే... దుర్మార్గుడికి లైఫ్ పడుతుంది" నరసింగరావ్ అన్నాడు.

"వాడికి లైఫ్ చాలదండీ... ఉరే వాడికి సరయిన శిక్ష" సుగుణమ్మ కసిగా అంది.

అట్లా అంటుంటే... ఎదురింట్లో రాజేశ్వరి ఆమె కళ్ళముందు కదలాడింది. కళ్లని సన్నటి నీటిపొర కమ్మేసింది.

"సరైన సాక్ష్యం దొరకాలిగా" మళ్ళీ అన్నాడు నరసింగరావు.

"సాక్ష్యం నేనిస్తా నాన్నా. రాజేశ్వరక్క అనుభవించిన మానసిక వేదన మొత్తం నాకు తెలుసు. అక్షరం పొల్లుపోకుండా అప్పజెబుతాను కోర్టులో" మేఘన ఆవేశంగా అంది.

అందరిలా నరసింగరావు "మనకెందుకు లేమ్మా ఈ లేనిపోని రిస్కు" అన్లేదు.

"గుడ్... అవసరమైతే అట్లాగే చెప్పు తల్లీ" అన్నాడు.

"రాజేశ్వరక్కను ఓసారి వాడు కొట్టడం నేను కళ్ళారా చూశాను. ఇంత పెద్ద బెల్టుతో నాన్నా. అక్క నా చేతే ఆయింట్‌మెంట్ తెప్పించుకుని... వాతలమీద రాసుకుంది. నేనీ విషయం కోర్టులో చెప్పేస్తా" శ్రీలత ఉత్సాహంగా అన్నది.

"ఇకవాడు చచ్చినట్టేలే. పెళ్ళాన్ని చంపి వాడేం బాగుపడతాడు. రాజేశ్వరి ఉసురు ఊరికేపోదు" అంటూ మెటికలు విరిచింది సుగుణమ్మ.

అయితే... ఆ మర్నాడు సాయంత్రమే పంజాబీడ్రస్ అమ్మాయిని స్కూటర్ మీదెక్కించుకుని కోదండం ఝామ్మని వెళుతుండటం ట్యూషన్ కెళుతున్న శ్రీలత కళ్ళబడింది.

'ఇదేంటి... లాకప్‌లో వుండాల్సిన వాడు స్కూటర్‌మీద తిరగడమేంటి?' అనుకుంటూ ఆఘమేఘాలమీద ఇంటికెళ్ళి విషయం చెప్పింది మేఘనతో.

మేఘనతోపాటు ఇంటిల్లిపాదీ అవాక్కయ్యారు.

ఆ తర్వాత నలుగురితోపాటూ వాళ్ళకీ తెలిసిన విషయం ఏంటంటే...

కేసు కోర్ట్‌దాకా వెళ్ళకుండా పోలీసుల్ని డబ్బుతో కొనేశాడు కోదండం.

గొంతు చించుకోబోతున్న అత్తమామలకూ... కోదండానికీ మధ్య కూడా పోలీసులే సంధిచేసి వాళ్ళకో లక్ష రూపాయలిప్పించారు.

"కోర్టులూ... కేసులూ అంటూ తిరిగితే... మిగిలిన మీ ఇద్దరాడపిల్లలకి పెళ్ళిళ్ళవుతాయా? " అంటూ హెచ్చరించారు.

అంతే...

రాజేశ్వరి కథ అంతటితో ముగిసిపోయింది.

★ ★ ★

మేఘన ఆఫీసుకు వెళుతూనే ఉంది.

అయితే రాజేశ్వరి మరణం తర్వాత ఆమె మరింత భయపడిపోయింది. అప్పటివరకూ ఆమె మనసులో ఎప్పుడయినా ద్వైదీభావం కలుగుతూ ఉంటే, ఆ సంఘటనతో అది పూర్తిగా తొలగిపోయింది. ఆమె ఇప్పుడు పూర్తిగా నమ్ముతోంది. రెండో పెళ్లి చేసుకున్న ఆడదానికి కష్టాలు తప్పవు.



ఎప్పుడయితే అలాంటి నమ్మకం బలపడిందో అప్పటి నుండి ధీరజ్ కుమార్‌కి మరింత దూరంగా మసలుకో సాగింది.

ఒకసారి దీపిక ఆమెను కదిలించి చూసింది. "ఏమిటీమధ్య నువ్వు మీ బాస్‌తో మరీ దూరంగా ఉంటున్నట్టున్నావ్? "

"అవును"

"ఎందుకని? "

"రెండోపెళ్లి చేసుకుంటానన్న ప్రతి మగాడిలోనూ నాకిప్పుడు రాజేశ్వరి భర్త కనిపిస్తున్నాడు కాబట్టి" వెంటనే పలికింది మేఘన.

దీపికకు రాజేశ్వరి కథ తెలుసు. ఒకసారి మాటల మధ్య మేఘన ఆ కథ చెప్పి కళ్ల నీళ్లు పెట్టుకోవడం జరిగింది.

"మరి నాకిప్పుడు ప్రతి మగాడిలోనూ రేణుశ్రీ భర్త కనిపిస్తే? "

దీపిక ప్రశ్న మేఘనకు అర్థం కాలేదు. అందుకే ఆమెకేసి ప్రశ్నార్థకంగా చూసింది.

"ఏంలేదు. నేను పెళ్ళికాని అమ్మాయిని. రేణుశ్రీకి మొన్నా మధ్య పెళ్లి జరిగింది. ఆమె భర్త చేసిన దారుణాల గురించి వింటే గుండె కదలిపోతుంది. ఆమెకది మొదటి పెళ్లే కాబట్టి ఈ లోకంలోని మగాళ్లందరూ అలాగే ఉంటారని అనుకుంటే నేనిక పెళ్లి చేసుకోగలనా?"

"కాని... మొదటి పెళ్లికన్నా రెండో పెళిలో పదింతలు రిస్క్ ఉందనే నేనంటున్నాను"

"అసలు ఆడదాని జీవితం అనుక్షణం రిస్కే. అలా అనుకుంటే మనమిక ఏమీ చేయలేం"

"అవును ఏమీ చేయకుండా ఉండడమే మేలని నేననుకుంటున్నాను"

"మిమ్మల్ని మార్చడం చాలా కష్టం"

"ఎట్టి పరిస్థితుల్లో మారకూడదనే నా నిర్ణయం"

"అయితే నేను ఇక ధీరజ్‌కుమార్‌గారి గురించి మాట్లాడకపోవడమే ఉత్తమం"

"ఇప్పటికయినా గ్రహించినందుకు సంతోషం"

దీపిక తల విదిలించింది. "సరే ఇక మీ ఇష్టం"

ఆ తర్వాత దీపిక మరోసారి ఆ టాపిక్ తీసుకురాలేదు.

అయితే ధీరజ్‌కుమార్ తాలూకు వ్యవహారం అంతటితో సమసిపోలేదు.

ఆ వ్యవహారాన్ని కంటిన్యూ చేయడానికి అన్నట్టు మరొకరు మేఘనను కలిశారు.

అలా కలిసిన ఆ వ్యక్తి పేరు ప్రశాంతి

★ ★ ★

"నమస్తే! నా పేరు ప్రశాంతి"

మేఘన ఆమె ముఖంలోకి పరిశీలనగా చూసింది.

ఇరవై రెండేళ్లుంటాయి ఆమెకు. కలిగిన కుటుంబంలోంచి వచ్చిన అమ్మాయి అని, చదువుకున్న సంస్కారవంతురాలని అర్థమయిపోతూనే ఉంది. ఆ అమ్మాయి మంచి అందగత్తె కూడానూ.

"యస్, వాట్ కెన్ ఐ డూ ఫర్ యూ మేడమ్"

"నేను మీతో కాసేపు పర్సనల్‌గా మాట్లాడాలి"

"పర్సనల్‌గానా? "

"యస్, పర్సనల్‌గానే"

"ఏ విషయం? "



ఆమె నవ్వింది. "చెపుతానుగా... మరో పది నిముషాలలో ఆఫీసు అయిపోతుంది కదా? మనం అలా ఏదయినా పార్కుకెళ్లి కూర్చుని మాట్లాడుకుందాం"

మేఘనకు కొద్దిగా ఇబ్బందిగా అనిపించింది. 'ఆమె అపరిచిత యువతి. తనతో పర్సనల్‌గా మాట్లాడేందుకు పార్కుకి రమ్మంటోంది'

"కూర్చోండి"

ఆమె కూర్చున్నాక పక్కనున్న సీట్‌కేసి చూస్తూ "ఇది... ఇది ధీరజ్‌కుమార్‌గారి సీట్‌కదూ? " ప్రశ్నించింది.

మేఘన కనుబొమలు ముడివడ్డాయి.

"మీకు ధీరజ్‌కుమార్‌గారు తెలుసా? "

"చాలా బాగా తెలుసు. ఎలా తెలుసు? అని ఇప్పుడే అడక్కండి. వివరాలన్నీ పార్కులో చెపుతాను. అవన్నీ మీకు చెప్పాలనే నేను మిమ్మల్ని కలిశాను"

మేఘనకు చాలా క్యూరియాసిటీగా అనిపించింది. 'ఈమెకు ధీరజ్‌కుమార్ ఎలా తెలుసు? ఒకవేళ ఈమె ఈ ఆఫీసులో ఇంతకుమునుపు పనిచేసి మానేసిందేమో? ధీరజ్‌కుమార్ ఆఫీసులో లేడని తెలిశాకే, ఈక్యాబిన్‌లోకి వచ్చిందేమో!' రకరకాల అనుమానాలు మనసులో మెదిలాయి.

మరో పది నిముషాలకు ఆమె అకౌంట్ బుక్స్ మూసేసి లేచి నిలబడింది.

"వెళ్దాంపదండి"

ఇద్దరూ క్యాబిన్‌లోనుండి బయటకు నడిచారు.

మేఘన మరెవరితోనో కలిసి ఆఫీసు నుండి వెళ్లడం చూసి దీపిక అడిగింది "ఇంటికేనా? "

"ఆం!..."

"బై"

"బై" అనేసి మేఘన ఆఫీసులోంచి బయటపడింది. రోడ్డెక్కాక ఆమె ప్రశాంతిని అడిగింది. "ఇప్పుడయినా చెపుతారా? ... ఎవరు మీరు? నాతో ఏం మాట్లాడాలనుకుంటున్నారు? "

ప్రశాంతి ప్రశాంతంగానే నవ్వింది. "ముందే చెప్పాను. మనం ఎక్కడయినా ప్రశాంతంగా కూర్చుని మాట్లాడుకుందామని! దగ్గర్లో ఏదయినా పార్కు ఉందా? "

"ఆం... అరకిలోమీటరు దూరంలోనే ఉంది"

"మనం ఆ పార్కులోకెళ్లి కూర్చుందాం"

"అలాగే"

మేఘన ఆమెను ఆ పార్కువైపు నడిపించింది.

ఇద్దరూ పార్కులోకి వెళ్లాక పచ్చికమీద పక్కపక్కనే కూర్చున్నారు.

ఈసారి మేఘన నవ్వుతూ అడిగింది. "ఇకనైనా మీరెవరో చెపుతారా? "

"తప్పకుండా" అన్నాక, పదిసెకనులు మౌనంగా ఉండి తర్వాత చెప్పింది. "నేను ధీరజ్‌కుమార్‌కి మరదల్ని"

తన పక్కనే తుపాకీ పేలినట్టు మేఘన అదిరిపడి ఆమె ముఖంలోకి చూసింది. "మీరు... ధీరజ్‌కుమార్‌గారి మరదలా? "

ప్రశాంతి నిలువుగా తలాడించింది "అవును"

ఊహాతీతమయిన విషయమేదో ఎదుట నిలచినట్టు మేఘన ఆమెనే చూస్తుండిపోయింది. ఆ క్షణం ఆమెకు ఏంమాట్లాడాలో అర్థంకాలేదు.

ప్రశాంతి మాటలు కలిపింది. "ఏమిటండీ షాక్ తిన్నట్టు అలా ఉండిపోయారు? ... కొంపదీసి నాతో మాట్లాడడం ఇష్టంలేక అలా ఉండిపోలేదు కదా? "

మేఘన ఈలోకంలోకి వచ్చినట్టు, తల అడ్డంగా ఆడించింది. "నోనో! అలాంటిదేమీ లేదు"

"అయితే నేను నా గురించి చెప్పుకోవచ్చా? "

"నిరభ్యంతరంగా" వాతావరణాన్ని తేలిక పరచడానికన్నట్టునవ్వేసింది మేఘన.

"నేను ధీరజ్‌కుమార్‌కి మరదల్ని. మేము సిటీలోనే ఉంటున్నాం. నేను కంప్యూటర్ కోర్సు పూర్తిచేసి, విజ్ కంప్యూటర్‌లో ప్రోగ్రామర్‌గా పనిచేస్తున్నాను. ఓ ఆరు నెలల క్రితంవరకూ నా బావతో నా పెళ్లి జరగబోతుందనే నేను అనుకుంటూ ఉండే దాన్ని. అయితే ఆరు నెలల క్రితమే నాకు తెలిసింది బావతో నా పెళ్లి జరగబోవడంలే దని, అతడు మరో అమ్మాయిని ప్రేమిస్తూ ఉన్నాడని. నేను నమ్మలేకపోయాను. బావను నిలదీసి అడిగాను. అతడు మనసు లోనిమాట దాచుకోలేదు. 'అది నిజమేనని' వప్పుకున్నాడు. అంతేకాదు, మరోమాట కూడా చెప్పాడు. "శాంతీ! ఈ జన్మకు నాకు పెళ్లిచేసుకునే అవకాశంలేదు". ఈసారి మాత్రం నేను షాక్ తిన్నాను. తేరుకుని 'అదేమిటి?' అని అడిగితే బావ మీ గురించి చెప్పాడు. బావ ఆదర్శానికి వెంటనే అభినం దించాను. అప్పుడే నేను మీ అదృష్టానికి అసూయపడ్డాను. ఎందుకంటే, ఆస్తిపాస్తు లున్న కన్నెపిల్లను నన్ను కాదని, ఒక వితం తువయిన మీ మీద అతడు మనసు పడ్డా డంటే, మీ అందం, వ్యక్తిత్వం అతడిని ఎంతగానో ఆకట్టుకుని ఉంటాయన్నది అర్థమయింది. కాని మీరు పెళ్ళి వ్యతిరేకి స్తున్నారని తెలిసి 'అలాంటి పరిస్థితిలో ఏ ఆడపిల్లయినా కొద్దికాలం పెళ్లంటే విము ఖత చూపడం సహజమేకదా' అనుకు న్నాను. రోజులు గడిచేకొద్దీ దగ్గరితనం పెరిగి, పెళ్లికి అంగీకరించొచ్చని తలచాను. అయితే ఆరునెలలు గడిచినా మీ ఆలోచ నాధోరణిలో, మీ ప్రవర్తనలో మార్పు రాలే దని తెలిసి నమ్మలేకపోయాను. నిన్ననే బావ ఆ మాట చెప్పాక వెంటనే నాకు మిమ్మల్ని చూడాలనిపించింది. చూశాక మా బావ సెలక్షన్ ఏమాత్రం తప్పుకాదని పించింది. కాకపోతే ఇక... మా బావను మీరు వద్దనడానికి కారణమేంటన్నది మాత్రం మీరు చెప్పాల్సి ఉంది"

చెప్పడం ఆపి, మేఘన ముఖంలోకి చూసింది ప్రశాంతి.

ఆమె ఎవరో, ఎందుకొచ్చిందో? మేఘ నకు అర్థమయింది.

"చెప్పండి! మిమ్మల్ని మనస్ఫూర్తిగా ఇష్ట పడతున్న మా బావను కాదనడానికి కారణ మేమిటి?"

ఏం చెప్పాలి? ... నా మనసులో పేరుకు పోయిన భయాలను ఎలా వివరించాలి? అతడిని కాదనడానికి తను చూసిన సంఘ టనల బలమైన ముద్రలేనని ఎలా తెలియ చేయాలి? మేఘనకు ఏం చెప్పాలో అర్థం కాలేదు. ఆమె మౌనాన్ని ఆశ్రయించింది.

"చూడండి! ప్రతికథకి ఓ ముగింపు అంటూ ఉండాలి. అలాగే ఏ మనిషి జీవి తమయినా ఏదో సమయంలో ఓ మలుపు తిరగాలి. ఇంచుమించు ఓ సంవత్స రంనుండి మా బావ మిమ్మల్ని ప్రేమిస్తూనే ఉన్నాడు. మిమ్మల్నే పెళ్లిచేసుకోవాలనే ఉద్దే శ్యంతో మీ కోసమే ఎదురుచూస్తున్నాడు. మీరేమో అతడిని అసలు పట్టించుకోవడం లేదు... ఎందుకు... మీరెందుకిలా చేస్తు న్నారు?"

మేఘన వెంటనే అంది, "మనమిక బయ ల్దేరుదామా?"

"అంటే... మా బావను మీరు కాదనడా నికి గల కారణాలు నాకు చెప్పడం మీకిష్టం లేదన్నమాట, అంతేకదూ?"

ప్రశాంతి ముఖంలో కదలాడిన నిరాశను చూసి మేఘనకు మనసులో కాస్త బాధ కలి గింది. 'పాపం ఆ అమ్మాయి ఎంతో ఆశతో నన్ను కలసింది. ఆ కలయికలో మంచి చేయాలన్న తపన ఉందేగానీ, చెడు చేయా లన్న ఆలోచన ఎంత మాత్రమూ లేదు. అలాంటప్పుడు మరీ అలా మనసు నొప్పించి పంపించేయడం ఎంతవరకూ సబబు? కానీ...'

చివరికి మేఘన ఓ నిర్ణయానికి వచ్చింది. తన మనసులోని భయాలను, అనుమానా

లను ఆమె ముందుంచాలనే అనుకుంది.

"నేను ధీరజ్‌కుమార్‌గారిని ఎందుకు పెళ్లిచేసుకోవడానికి అంగీకరించడంలేదంటే..." అంటూ మేఘన, తను చూసిన రాజేశ్వరి కథను చెప్పింది.

"అనుమానంలేదు. ఏ మగాడయినా తనకు భార్యగా కన్నెపిల్లనే కోరుకుంటాడు. ఒకవేళ ఒక వితంతువును ప్రేమించినా పెళ్లిచేసుకున్న ఆరు నెలలకే ఆ ప్రేమ తగ్గిపోతుంది. తనేదో కోల్పోయానన్న అభిప్రాయం అతడిలో మొదలవుతుంది. ఫలితంగా ఆ ఇంట్లో మనస్పర్ధలు ఏర్పడుతాయి. వాళ్ల జీవితంలో అసంతృప్తి కలుగుతుంది. మెల్లగా ఘర్షణ మొదలవుతుంది. ఫలితంగా ఆడదానిమీద మగాడి దౌర్జన్యం ప్రారంభమవుతుంది. అలాంటి దుశ్చర్యలను సహించేస్థితిలో లేను నేను. అందుకే... మరో తప్పటడుగు వేసి జీవితాంతం మరింత దిగులుతో గడిపేయడం కాకుండా ఈ జీవితాన్ని ఇలాగే గడిపేయాలనుకుంటున్నాను నేను. ఈ విషయంలో ఎట్టిపరిస్థితుల్లోనూ నా నిర్ణయం మారదు"

ప్రశాంతికి ఆమె మనసులోని భావం అర్ధమయింది.

'మేఘన మాటల్లో కొంతవరకూ నిజం ఉండొచ్చుకానీ అదే పూర్తి సత్యంకాదు. రెండోపెళ్లి చేసుకున్నామని అసంతృప్తి ఫీలయ్యే భర్తలు కొందరుంటే, రెండోపెళ్లి అమ్మాయి తన భార్య అన్న భావన రానివ్వకుండా ఇల్లాలిని గుండెల్లో పెట్టి పూజించుకునే మగాళ్లు ఈదేశంలో ఎందరో ఉన్నారు. ఈ విషయం మేఘనకు అర్ధమయ్యేలా ఎలా చెప్పడం? ఆమె మనసులోని అనుమానాలు అర్ధరహితమని, భయాలకు సరయిన పునాది లేదని ఎలా వివరించగలను?

ఆ ప్రశాంతి మౌనాన్నిచూసి ఆమె తనను పూర్తిగా అర్ధంచేసుకున్నదనే అభిప్రాయంతో "సో! నేను మీ బావను పెళ్లి చేసుకోలేకపోవడానికి బలమైన కారణమే ఉందన్న విషయం అర్ధమయిందనుకుంటాను" నవ్వుతూ అంది మేఘన.

"ఆ విషయం అర్ధమయింది. కానీ మీరు బలమైన కారణం అనుకుంటున్నది మీ అపోహ మాత్రమే అని ఎలా వివరించాలన్నది మాత్రమే నాకు అర్ధం కావడంలేదు"

"అంటే?"

"ఈ ప్రపంచంలో మంచీచెడూ రెండూ వున్నాయి మేఘనగారూ! రెండో పెళ్లి చేసుకున్నామని అసంతృప్తి ఫీలయ్యే భర్తలు కొందరుంటే, రెండోపెళ్లి అమ్మాయి తన భార్య అన్న భావన రానివ్వకుండా ఇల్లాలిని గుండెల్లో పెట్టుకుని పూజించే మగాళ్లూ ఈదేశంలో ఉన్నారు"

"ఒకవేళ నాకు చెడు ఎదురయితే?"

మేఘన వెంటనే ప్రశ్నించింది.

"మీకు చెడు ఎదురయ్యే అవకాశం అసలులేదు"

"ఎందుకని?"

"మా బావ గురించి మాకు బాగా తెలుసు కాబట్టి"

"కానీ నాకు తెలియదు కదా?"

"మీరిద్దరూ ఒకేచోట ఇంతకాలంనుండి కలసి పనిచేస్తున్నారు. ఆయన ఎలాంటివాడో అర్ధం చేసుకోలేరా?"

"ఎంత మంచివాడయినా, పెళ్లి జరిగాక మారిపోకూడదని రూలేమయినా ఉందా?"

తన ప్రతి మాటకూ ఎదురు ప్రశ్న వస్తుండడంతో ప్రశాంతి మరేం మాట్లాడలేకపోయింది. అయితే ఆమె మనసులోని మాట మాత్రం అర్ధమయింది.

"సరే! వెళ్దాం పదండి"

ఇద్దరూలేచి పార్కులోనుండి బయటకు నడిచారు.

ప్రశాంతిని వదిలి ఇంటివైపు నడిచేప్పుడు మేఘన మనసులో అనుకుంది 'ఇక మరెన్నడూ ఈ ప్రశాంతి నాకు కనిపించదుగాక కనిపించదు'

కాని ఆమె అభిప్రాయం తప్పని రెండురోజుల తర్వాతే అర్థమయింది.

ఆరోజు సాయంత్రం-

తనకు ఫోన్ వచ్చిందని దీపిక వచ్చి చెపితే, లేచి వెళ్ళి రిసీవర్ అందుకుని "హలో" అంది.

"నేనూ ప్రశాంతిని"

మేఘన ఉలిక్కిపడింది.

"మీ మాటలు విన్నాక ఈ రెండురోజులు తీవ్రంగా ఆలోచించాను. చివరికి నేనో నిర్ణయానికి వచ్చాను. అదేమిటన్నది ఫోన్‌లో చెప్పడంకన్నా ఎదురుగా చెపితేనే బాగుంటుంది. కాబట్టి నేను మిమ్మల్ని కలవాలనుకుంటున్నాను. అయితే ఆఫీసులో మా బావ ఉంటాడు. కాబట్టి నేను అక్కడికి రాలేను. నేను పార్క్‌లో మొన్న మనం కూర్చున్న చోట నిలబడి మీకోసమే ఎదురు చూస్తుంటాను... ప్లీజ్ అక్కడికి రండి"

మేఘన కొద్ది సెకనుల తర్వాత "సరే! అలాగే వస్తాను" అంది.

"కానీ... ఈ విషయం మా బావకు చెప్పకండేం? "

"అలాగే"

మేఘన ఫోన్ పెట్టేశాక దీపిక అడిగింది "ప్రశాంతి ఎవరు? "

"నా ఫ్రెండ్" అనేసి క్యాబిన్‌లోకి వెళ్ళిపోయింది మేఘన.

మరో గంట తర్వాత మేఘన పార్కులో ప్రశాంతిని కలిసింది.

"రండి... ఇలా కూర్చుందాం"

ఇద్దరూ పచ్చికలో ఒకచోట కూర్చున్నారు.

"చెప్పండి ఎందుకు నన్ను పిలిచారు? "

"మీ మాటలు విన్నాక మా బావ విషయంలో మీ భయాందోళనలు అర్థంలేనివని చెప్పడానికి నేనో నిర్ణయం తీసుకున్నాను. ఆ నిర్ణయం మీద నమ్మకంతోనయినా మీరు మా బావను పెళ్ళిచేసుకోవడానికి అంగీకరిస్తారనే అనుకుంటాను..."

ప్రశాంతి ఇంకా ఏదయినా చెపుతుందేమోనని పది సెకనులు ఎదురుచూసి, ఆమె మరేం మాట్లాడకుండా ఉండిపోవడంతో తనే అడిగింది, "ఇంతకీ ఏమిటా నిర్ణయం? "

కొద్దిక్షణాల నిశ్శబ్దం. తన నిర్ణయం చాలా దారుణమయిందనీ, అది మేఘనను కదిలించి తీరుతుందనీ ప్రశాంతికి తెలుసు. కానీ ఆమె పెళ్ళికి అంగీకరిస్తుందో లేదోనన్నదే అనుమానం.

ప్రశాంతి పెదవి విప్పింది. "మీరు మా బావను పెళ్ళిచేసుకోవడానికి ఎందుకు భయపడుతున్నారో అర్థమయింది. అయితే మా బావ విషయం అర్థరహితమనీ, అసలీ ప్రపంచంలో మంచీచెడూ రెండూ వున్నాయనీ, చెడుని చూసి మంచే లేదనుకోవడం పొరపాటని నిరూపించదలచుకున్నాను. అందుకే... మీరు మా బావను పెళ్ళిచేసుకోండి. మీరు 'ధీరజ్‌కుమార్‌తో సంతోషంగా కాపురం చేస్తున్నాను. నా అనుమానం అర్థరహితం' అని అనేంతవరకూ నేను పెళ్ళిచేసుకోను. ఇది నన్ను కన్నవాళ్ళ మీద నేను ప్రమాణం చేసి చెపుతున్నాను"

మేఘన ప్రశాంతికేసి అయోమయంగా చూసింది. ఆమె అన్నమాటలు అర్థమయ్యాయి. తను ధీరజ్‌కుమార్‌ని పెళ్ళిచేసుకుని, తమ కాపురం సాఫీగా సాగిపోతోందని తెలిసేంతవరకూ ఆమె పెళ్ళిచేసుకోదట. ఒక ఆడపిల్లకు తన బావ మీద వున్న నమ్మకానికి అంతకన్నా పరాకాష్ఠ ఏముంటుంది?

ప్రశాంతి మాటలు అర్థమయ్యాక కొద్దిక్షణాలపాటు మేఘనకు నోటమాట రాలేదు.

మేఘన మౌనంగా ఉండిపోవడంతో ప్రశాంతి అనుమానంగా అడిగింది. "మీరు మాట్లాడడంలేదంటే మీరు నన్ను అనుమానిస్తున్నట్టుంది"

"లేదు... లేదు"

"ఈ అమ్మాయి ఏదో ఆవేశం మీద 'మీ సంసారం నిలబడిందనీ, సంతోషంగా సాగి పోతుందని తెలిస్తేనే నేను పెళ్లిచేసుకుంటా నని అంటోంది. కాని మా పెళ్లి అయిపో యాక ఈమె మాటమీద నిలబడాలని ఎలా నమ్మగలం? మా పెద్దలు బలవంతపెడు తున్నారు. అనుకోని పరిస్థితుల్లో అలా పెళ్లి జరిగిపోయింది' అని అంటే నేనేం చేయగ లను? అని మీరనుకోవడంలో తప్పులేదు. కానీ నేను ప్రమాణంచేసి చెపుతున్నాను. మీ సంసారం చక్కగా సాగిపోతుందని తెలి శాక నేను పెళ్లిచేసుకుంటాను. కావాలంటే అలా నేను రాసిస్తాను. ఆ కాగితం మీ దగ్గరే ఉంచుకోండి. మీరు మీనోట 'మా సంసారంలో కలతలు లేవు' అన్నాకే నేను పెళ్లిచేసుకుంటాను" ప్రశాంతి గొంతులో ఆర్ద్రత ధ్వనించింది.

'నమ్మడం, నమ్మకపోవడం అన్న ప్రసక్తే లేదు. ఆలోచించాల్సింది ఆమె తీసుకున్న ఆ నిర్ణయం గురించి. మరొకరిని తను ఇష్ట పడ్డ వ్యక్తికిచ్చి పెళ్లిచేయడానికి ఏ ఆడపిల్లా అలాంటి నిర్ణయం తీసుకోదుగాక తీసుకోదు'

మేఘన దీర్ఘంగా నిశ్వసించాక పలికింది "ప్రశాంతిగారూ! మీ బావను మీరెంతగా నమ్ముతున్నారన్న విషయమే కాదు, మా ఇద్దర్నీ కలపాలని మీరెంతగా తాపత్రయ పడుతున్నారన్న విషయమూ నాకర్థమ యింది. మీకు మీ బావమీద చాలా నమ్మకం వుంది. నేను మీ బావను నమ్మా లని, నమ్మి రిస్కుల్లో పడాలని అనుకోవడం లేదు. కానీ మీ నమ్మకం నన్ను ఉత్తేజపరు స్తోంది. నీ బావకోసం నువ్వు ముందడుగు వేయాలనుకోవడం లేదుగాని, ఎందుకో తెలి యదు. ఒక్కసారి పునరాలోచించుకోవాలని అనుకుంటున్నాను. నాకు ఓ రెండురోజులు గడువు ఇమ్మని కోరుతున్నాను"

ప్రశాంతి ముఖంలో సంతోషం కొట్టొచ్చి నట్టు కనిపించింది.

 

"థాంక్స్ మేఘనగారూ"

"ఎందుకు"

"నా మాట మీద నమ్మకం ఉంచి మీరు కనీసం పునరాలోచించుకోవడానికయినా ఒప్పుకున్నందుకు..." నవ్వింది ప్రశాంతి.

"కానీ నా నిర్ణయం మిమ్మల్ని సంతోష పెడుతుందని ఇప్పుడే భావించకండి"

"ఇప్పుడు నా భావం ఏదయినా నేనె ప్పుడూ పాజిటివ్‌గానే ఆలోచిస్తాను"

"ఇక బయల్దేరుదామా? "

"అలాగే"

ఇద్దరూ లేచి పార్కులోంచి బయటకు నడిచారు. ప్రశాంతి మేఘన వెంట బస్టాప్ వరకూ నడిచింది.

బస్సొచ్చేవరకూ ఆమె వెయిట్ చేస్తుంటే "మీరెందుకు, నేను బస్సెక్కి వెళ్తాలెండి" అంది మేఘన.

"ఫర్వాలేదు బస్సెక్కించాకే వెళ్తాను"

మేఘనను బస్సెక్కించాకే తిరిగి వెళ్లింది ప్రశాంతి.

★ ★ ★

టేబుల్ లైట్ వెల్తురులో పెళ్లి ఫొటో లోంచి కొంటెగా నవ్వుతున్నాడు రఘు.

రఘునే చూస్తున్న మేఘన కళ్లకు అడ్డు పడిందో నీటితెర.

"చూడు రఘూ! నీ జ్ఞాపకాలతో ప్రశాం తంగా బతుకుతున్న నన్ను ఎవరెవరో చీకాకు పెడుతున్నారు. ఏమిటేమిటో అంటు న్నారు. నిన్ను నా ప్రాణంలో ప్రాణాన్ని మర్చిపోయి నేనట... మళ్లీ పెళ్లి చేసుకోవా లట. అది... అది నాకు సాధ్యమా? నిన్ను పొదుపుకున్న ఈ గుండెల్లో మరొకర్ని ఎప్ప టికైనా నిలుపుకోగలనా? నిన్ను ముద్దాడి ఎంగిలిపడిన ఈ పెదవుల్ని నీకుగాక ఇంకొ కరికి నైవేద్యం పెట్టగలనా? నీ స్పర్శలో పులకరించిన ఈ శరీరం ఇంకొకరి బాహు వుల్లో ఇమిడి సుఖిస్తుందా? చెప్పు రఘూ ప్లీజ్! మాట్లాడు" మేఘన కళ్లలోంచి ధారా పాతంగా వర్షిస్తున్నాయి కన్నీళ్లు.

"ఆ ధీరజ్ ఎవరో మొన్నటివరకూ నాకు

తెలీదు. ఇవాళ నా వెనకపడుతున్నాడు. నన్ను వెంటాడుతున్నాడు. నేను కాదంటే బతకలేడట. నన్ను పెళ్లి చేసుకుని ఉద్ధరిస్తాడట. కళ్లలో పెట్టుకుని కాపాడతాడట. నేను కాదంటే జీవితాంతం పెళ్లే లేకుండా వుండిపోతాడట.

నాకు నాకేం పాలుపోవటంలేదు రఘూ. నన్నేం చెయ్యమంటావ్... ఏం చెయ్యమంటావ్"

మేఘన టేబుల్ పైన తల పెట్టుకుని ఏడుస్తూ అట్లాగే నిద్రపోయింది.

కాసేపటికి తలనెవరో మార్దవంగా నిమురుతున్నట్టన్పించి చివుక్కున కళ్లు విప్పింది.

ఎదురుగా రఘు నవ్వుతూ ఫొటోలో కాదు నిజంగానే నిలువెత్తునా నిలబడి...

'రఘూ! మీరు మీరు' ఆనందం అలలైపోతుంటే సముద్రంలా అతన్ని కమ్ముకోబోయింది.

సాధ్యంకాలేదు. రఘు కంటికి కనబడుతున్నాడు. స్పర్శకు అందడంలేదు.

"ఏంటిది రఘూ!" దుఃఖంతో వణికిపోయింది మేఘన.

"ధీరజ్ ని నువ్వు పెళ్లి చేసుకో మేఘనా"

"రఘూ"

"చెప్పేది విను మేఘనా! మోడువారిన నీ జీవితాన్ని చిగురింపచేస్తానంటున్నాడు ధీరజ్. అట్లా జరిగితే సంతోషించే వాళ్లలో నేను మొదటివాడ్ని" మేఘన అయోమయంగా చూస్తోంది.

"నా మేఘన ఎప్పుడూ నవ్వుతూ వుండాలి. కళకళలాడుతుండాలి. సంతోషం తప్ప దుఃఖం నీ దరిదాపులకు రాకూడదు. సుఖం తప్ప కష్టాన్ని నువ్వు అనుభవించకూడదు. శాంతి సౌభాగ్యాలతో నా మేఘన విలసిల్లాలి. ఇవన్నీ జరగాలంటే నా కల నిజం కావాలంటే నువ్వు ధీరజ్ ని పెళ్లి చేసుకోవాలి. పెళ్లి చేసుకుని తీరాలి. ఈ పెళ్లికి నువ్వు ఒప్పుకోవాలి. నాకోసం... ప్లీజ్ నా కోసం నువ్వు ఊఁ అనాలి"

"నో... నో... నో..." పూనకం వచ్చిన దాన్లా అరుస్తూ రఘుని ఒక్క తోపుతోసింది.

భళ్లున కిందపడింది ఏదో వస్తువు. చివుక్కున మెలకువ వచ్చింది మేఘనకి. ఇదంతా... ఇదంతా కలా! రఘు... నా రఘు నిజంగా నా ముందుకు రాలేదా!

ఆమె ఆత్రంగా ఫొటో ఫ్రేమ్ వంక చూసింది. అదక్కడలేదు.

ఆమె కళ్లు ఆదుర్దాగా కింద వెదికాయి. పగిలిన ఫొటో ఫ్రేమ్‌లోంచి స్పష్టంగా కనబడింది రఘు ముఖం.

రెండు చేతుల్నీ ముఖానికి అడ్డుపెట్టుకొని భోరుమని ఏడ్చింది మేఘన శ్రీలత లేస్తుందన్న ధ్యాస కూడా మరిచి.

ఆమె రోదన శ్రీలతని తట్టిలేపింది. "అక్కా ఏంటక్కా" మేఘన ముఖానికి అడ్డుగా వున్న చేతుల్ని లాగుతూ అడిగింది శ్రీలత కంగారుగా.

కాసేపలాగే ఏడ్చి కళ్లు తుడుచుకుంది మేఘన.

శ్రీలత ఓ గ్లాసు మంచినీళ్లిస్తే గటగటా తాగేసింది.

శ్రీలత పక్కనే పడుకుని కాసేపలాగే సీలింగ్ కేసి చూస్తూ వుండిపోయింది.

"ఏదైనా పీడకల వచ్చిందా అక్కా? "

"కలవచ్చిన మాట నిజం శ్రీలూ... అయితే అది పీడకలా మంచికలా అనేది నాకర్థం కావడంలేదు"

"అదేంటి చెప్పు. అది మంచిదో కాదో నేను చిటికెలో చెప్పేస్తాను" అంది శ్రీలత.

మేఘనకు తన దుఃఖాన్ని ఎవరితోనో ఒకరితో పంచుకోవాలన్పించింది.

అందుకే చిన్నదైనా శ్రీలతతో అన్నది "మీ బావ కల్లోకొచ్చారే"

"రఘు బావా? "

"ఆఁ..."

"వచ్చి.."

"వచ్చి... వచ్చి" మేఘన ఒక్క క్షణం తడబడి తరువాత అంది "నన్ను ఇంకో పెళ్లి చేసుకోమంటున్నాడు"

శ్రీలత హఠాత్తుగా మౌనంగా వుండిపోయింది. శ్రీలత ఏం మాట్లాడక పోవడంతో మేఘనే అంది "మీ బావ అట్లా చెప్పడం ఏమైనా న్యాయంగా వుందా శ్రీలూ? "

"అక్కా నేనొకటి చెబ్తా. ఏమనుకోవుగా"

శ్రీలత ఆరిందాలా మాట్లాడుతుంటే మేఘనకు ఆశ్చర్యం వేసింది. ఏం చెబుతుందోనన్న కుతూహలం ఆమెని కుదిపేసింది.

"ఏమనుకోను చెప్పు" అంది.

"ప్రామిస్? " శ్రీలత చేతిని చాచింది లేచి కూర్చుని.

మేఘన తనూ లేస్తూ ఆమె చేతిలో చెయ్యేసింది "ప్రామిస్" అంటూ

"నీకు మళ్లీ పెళ్లి చేసుకోవాలన్న కోరిక కలుగుతోందికదూ" శ్రీలత రపీమని అడిగింది.

"శ్రీలతా" మేఘన అరిచేసింది.

"చెప్పానా ఏమనుకోకూడదని ప్రామిస్ కూడా చేశావ్" శ్రీలత బెదురుతూ చూసింది.

"నన్ను చూస్తే నీకట్లా అన్పిస్తోందా? " తీవ్రంగా అడిగింది.

"నిన్ను చూస్తే కాదు నీ కల వింటుంటే..." చెప్పింది శ్రీలత.

"కల వింటే? " రెట్టించింది మేఘన.

""మన మనసులో మనకు తెలీకుండా కలిగిన కోరికలు సబ్‌కాన్షస్‌లో నిక్షిప్తమైపోయి నిద్రలో వున్నప్పుడు కలలుగా కాన్షస్‌లోకి వస్తాయట. మా ఇంగ్లీష్ మేడమ్ చెప్పారు"

శ్రీలతని ఒక్కసారి తేరిపార చూసింది మేఘన.

శ్రీలత చిన్నపిల్లకాదు. చాలా ఎదిగిపోయింది.

"ఇంగ్లీష్ మేడమ్‌కీ, కలలకీ ఏంటట సంబంధం? ఆమె క్లాసులో కలలు కంటుందా. పాఠాలు చెబుతుందా? " అంది దురుసుగా దొరికిపోకుండా.

"ఆ మేడమ్‌కి చాలా నాలెడ్జ్ వుంది. ఎప్పుడైనా ఆమె లీజర్ పీరియడ్స్‌లో ఎవరైనా మేడమ్ ఆబ్సెంట్ అయితే మా క్లాసుకు సబ్‌స్టిట్యూట్‌గా వస్తారు. అట్లాంటప్పుడు ఆమె చాలా సంగతులు చెబ్తారు"

"గొప్ప మేడమేకాని పడుకో" చెప్పింది మేఘన.

"కాదక్కా మొన్న క్లాసులో మేడమ్..."

"నోర్మూసుకుని పడుకో" మేఘన తల వరకూ దుప్పటి తన్నేసింది.

శ్రీలత ఇక మాట్లాడలేదు.

ఓ అయిదు నిమిషాల తర్వాత ముఖం మీంచి దుప్పటి తొలగించి శ్రీలత ముఖంలోకి అలాగే చూసింది మేఘన.

చిన్నదానివైనా ఎంత గొప్ప సైకాలజీ చెప్పావే.

నిజమే నాలో ఏమూలో ఎంతవద్దనుకున్నా ధీరజ్ మీద అనురక్తి కలిగి వుంటుంది. నాకే తెలీకుండా నా హృదయాంతరాళంలో ఆ కోరిక నిక్షిప్తమైపోయి వుంటుంది. అది బయటపడకుండా నా ఈగో అడ్డుపడుతూ వుండి వుంటుంది. నిన్న ప్రశాంతి కలవడంతో నాలోని ఈగో అణగారి పోయి వుంటుంది. దాంతో ఆ కోరిక విజృంభించి కలగా నా కట్టెదుట నిలబడివుంటుంది.

రఘుని మర్చిపోలేని మనసు అటూ ఇటూ వూగిపోతుంటే నన్ను నేనే సమర్థించుకునే దిశలో రఘే నన్ను ప్రోత్సహిస్తున్నట్టుగా వూహించుకుని వుంటాను.

అంటే అంటే నేను ధీరజ్‌ని కోరుకుంటున్నానా? నాకు తెలీకుండానే అతని వైపు మొగ్గుచూపుతున్నానా?

మేఘన ఆలోచనలైతే తెగలేదుగాని నిద్ర కళ్ల మీదకు తెరలుగా కమ్ముకొచ్చేసింది.

★ ★ ★

ఉదయమే మేఘన చెప్పింది "అమ్మా! నేనీరోజు ఆఫీసుకి వెళ్లడంలేదు. లంచ్‌బాక్స్

# ఏరినముత్యాలు

* ఆర్భాటంగా వేసే రెండు అడుగులకన్నా నింపాదిగా వేసే ఒక అడుగు మంచిది.
  - సెర్వీన్

* స్వీయ విశ్లేషణే నిజమైన విజయం.
  - ప్లాటో

* బద్ధకం మనిషికి సజీవసమాధి వంటిది.
  - స్పెన్సర్

* అగ్ని జల్లినా, అమృతం కురిసినా, అందాన్నిచ్చినా, ఆనందాన్ని పంచినా గ్రంధాలే.
  - తిలక్

* ప్రశంస పన్నీరులాంటిది, వాసనచూసి వదిలేయాలికానీ, తాగుతూ కూచోకూడదు.
  - జాన్ బిల్లింగ్స్

* అవివేకి హృదయం అతని నోటిలో వుంటుంది. కాని వివేకి నోరుమాత్రం అతని హృదయంలో ఉంటుంది.
  - ఫ్రాంక్లిన్

* వీలైనంత వరకు నవ్వుతూ ఉండు, అది చేదైన ఔషధం.
  - బైరన్

* తృప్తి-సంతోషాలే మనిషికి సహజ సిరిసంపదలు.
  - సోక్రటీస్

* భిన్నత్వంవైపు పురోగమనమే నాగరికత.
  - స్పెన్సర్

* పోరాటం చేయలేనివాడు పిరికివాడు. పారిపోవడానికి తాపత్రయపడతాడు.
  - హుబర్ట్

* మండిన కొవ్వొత్తి మనది కానట్లే గడిచిన కాలమూ తిరిగిరాదు.
  - అంబేద్కర్

* భగవంతుడు సృష్టించినట్లే స్త్రీ వుండాలి. అరువు తెచ్చుకున్న ప్రవాహంలో కలిసే కాలువ కారాదు.
  - ఆంథని

* ఉదయం ఆలోచించు, మధ్యాహ్నం ఆచరించు, రాత్రివేళ నిద్రించు.
  - విలియం బ్లాక్

* స్వార్థానికి లోబడి పురుషులు, బలహీనతల మూలంగా స్త్రీలు పొరపాట్లు చేస్తుంటారు.
  - డీస్టాల్

సేకరణ: **దాసరి వెంకటరమణారావు**

# ఏరిన ముత్యాలు

✲ దేశం అభివృద్ధి చెందడం అంటే అద్దాల మేడలు, రంగులు గోడలు కాదు. పౌరుని నైతిక అభివృద్ధే నిజమైన దేశాభివృద్ధి.

– మహాత్మాగాంధీ

✲ ప్రపంచంలో నిద్రతో సమానమైన సులభమైన వస్తువు మరొకటిలేదు.

– శరత్‌చంద్రుడు

✲ మంచి ఏ కొంచెమైనా చాలు మార్పు తేవడానికి.

– డా. సి. నారాయణరెడ్డి

✲ ఎవరు కష్టపడి సంపాదిస్తారో, వారికి వృథాగా ఖర్చుపెట్టబుద్ధిగాదు.

– శ్రీరామశర్మ ఆచార్య

✲ కఠిన పరిశ్రమ వుంటేనే ఏ విజయమైనా సాధ్యపడుతుంది.

– శ్రీరామశర్మ ఆచార్య

✲ లక్షలాదిమంది ఆకలితో, అజ్ఞానంతో బతుకుతున్నంతకాలం, విద్యావంతులై, వారిపట్ల కనీస బాధ్యత కూడా వహించని ప్రతివ్యక్తిని నేను ద్రోహిగానే చూస్తాను.

– వివేకానందుడు

✲ సంఘంలోని అవకతవకలను సరిదిద్దడమే సామాజికవేత్తల నిరంతరకృషి.

– మాలతీచందూర్

✲ మనిషి జీవితం సాఫీగా సాగిపోవడానికి నిజం ఎంత అవసరమో అబద్ధమూ అంతే అవసరం.

– నండూరి పార్థసారథి

✲ నిత్యచైతన్యంతో జీవించగల్గినప్పుడే జీవితం అర్థవంతంగా గడుస్తుంది.

– జిడ్డు కృష్ణమూర్తి

✲ తమ తెలివితేటల్లో సగం అప్పు పుట్టించడానికీ, తక్కిన సగం అది ఎగవేయడానికీ కొందరు ఉపయోగిస్తారు.

– జార్జ్ డి.ప్రెంటిస్

✲ వ్యక్తిత్వాన్ని కోల్పోయిన మనిషికి మిగిలేది ఏమీ ఉండదు.

– గాంధీ

✲ నరకాన్ని చూడగోరితే ఎప్పుడూ దిగులుగా వుండేవాడి మనస్సు చూడాలి.

– రాబర్ట్‌బర్టన్

✲ స్వేచ్ఛా వాతావరణంలో మేధాశక్తి పూర్ణవికాసం చెందుతుంది.

– జాన్‌స్టూవార్ట్‌మిల్

సేకరణ: డి. శ్రీధరాచార్య

సర్దాల్సిన అవసరంలేదు"

"ఆఫీసుకెళ్లడంలేదా? ఏం? ఎందుకని? " సుగుణమ్మ కూతురి ముఖంలోకి చూసింది.

"వెళ్లాలనిపించడంలేదు. ఈ రోజు రెస్ట్ తీసుకోవాలనిపిస్తోంది"

వంట్లో నలతగా ఉండి ఇంట్లోనే ఉండిపోవాలని మేఘన అనుకుంటోందని అనుకుంది సుగుణమ్మ. అందువల్లే "సరయితే" అంది.

అయితే మధ్యాహ్నానికే సుగుణమ్మకు కాస్త అనుమానం కలిగింది.

రెండు మూడు సార్లు మేఘనను పలకరిస్తే ఆమె పరధ్యాసగా ఉంది. ఆ తర్వాత ఎప్పటికో "ఆఁ పిలిచావా అమ్మా? " అంటూ ఎదురు ప్రశ్న వేసింది.

ఎందుకో మేఘన పరధ్యాసగా ఉందన్న సంగతి సుగుణమ్మకు అర్థమయింది.

ఆ మధ్యాహ్నం భోజనాలు ముగిశాక సుగుణమ్మ కూతురి రూమ్‌లోకొచ్చింది. మేఘన పక్కనే కూర్చుంటూ ఆమె భుజం మీద చెయ్యి వేసింది.

అప్పుడు కూడా పరధ్యాసగానే ఉన్న మేఘన తల్లి రాకను గమనించలేదుగానీ తన భుజం మీద చెయ్యి స్పర్శకు ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చింది. తల తిప్పి తల్లి ముఖంలోకి చూసింది.

"మేఘనా!"

"ఏమిటమ్మా"

"నేనో మాట అడుగుతాను. నిజం చెపుతావా? "

"అడుగమ్మా"

"ఉదయం నుండి నేను నిన్ను గమనిస్తూనే ఉన్నాను. నువ్వెందుకో చాలా పరధ్యాసగా ఉన్నావు. ఎందుకిలా ఉన్నావ్? "

తన పరధ్యాస తల్లికి తెలిసిపోయిందని మేఘన భయపడలేదు. కాకపోతే తన పరధ్యాసకు కారణం తల్లికి చెప్పాలా వద్దా అని మాత్రమే ఆలోచించింది.

మనసులో ద్వైదీభావం చెప్పాలా వద్దా అన్న సందిగ్ధం.

కొద్దిసేపటికి ఆమె ఓ నిర్ణయానికి వచ్చింది. ఒకవేళ తను అతడిని పెళ్లి చేసుకోవాలనే అనుకుంటే అప్పుడయినా పెద్దలకు చెప్పక తప్పదు కాబట్టి ఇప్పుడే వాళ్ల మనసులోని అభిప్రాయమేమిటో తెలుసుకుంటే మంచిదికదా?

"అమ్మా నేను నిన్నో మాట అడుగుతాను ఏమీ అనుకోవుకదా? "

"అది తప్పు ఆలోచనయితే తప్ప తప్పుగా అనుకునే ప్రసక్తే లేదు కదమ్మా"

"అలా ఆలోచించడం తప్పో ఒప్పో నాకింకా తెలియలేదమ్మా"

"అయితే నువ్వు ఆ మాట తప్పకుండా చెప్పి తీరాలి"

"ఎందుకని? "

"పిల్లలకు తప్పొప్పుల మీమాంస తెలియనప్పుడు అది తప్పో ఒప్పో వివరించి చెప్పగలిగేది తల్లితండ్రులే. కాబట్టి నువ్విప్పుడు ఆ మాట చెపితే అందులోని తప్పొప్పులను నేను నిర్ణయిస్తాను"

ఆమె ఇక సంశయించలేదు.

ఆఫీసులోని పరిసరాలు, అందులో ఒకే క్యాబిన్‌లో ధీరజ్ కుమార్‌తో కలిసి తను కూర్చోవడం, అతడు తనతో ప్రేమించానని పెళ్లి చేసుకుంటానని చెప్పడం, అప్పుడే రాజేశ్వరక్కతో పెరిగిన పరిచయం, రెండో పెళ్లి వలన ఆడదానికి ఎదురయ్యే రిస్కులు, ఆమె నోట వినడం దాంతో కంగారుపడి అతడికి దూరంగా మసలుకోవడం, తామిద్దర్నీ కలపాలని దీపిక చెప్పిన మాటలు, ఇంతలో రాజేశ్వరక్క చనిపోవడం, దాంతో తనలో మరింత భయం పెరిగిపోవడం... నిన్నటికి నిన్న ప్రశాంతి వచ్చి ఇచ్చిన హామీ అన్ని విషయాలూ తల్లికి పూర్తిగా వివరించింది మేఘన.

అంతా చెప్పేశాక ఆమెకు మనసులో బాధ సగం తగ్గిపోయినట్టనిపించింది.

కూతురు చెప్పినంతసేపూ మౌనంగా

ఉన్న సుగుణమ్మ, చెప్పడం పూర్తయ్యాక కూడా కొద్దిక్షణాలు మౌనంగానే వుంది.

ఆమె మౌనం చూసి మేఘన కొద్దిగా భయపడింది.

ఒకవేళ ఆమెకు తెలియకుండా నేనింత దూరం వెళ్లిపోయానని తెలిసి తనకు కోపం వచ్చిందేమో అందుకే ఆమె మౌనంగా ఉండిపోయిందేమో.

"ఏమ్మా! ఏం మాట్లాడవు?"

"ఏం మాట్లాడను మేఘనా?"

"అంటే?"

"ఆనందం నన్ను ఉక్కిరిబిక్కిరి చేస్తోందమ్మా! ఈ జీవితానికి నా బిడ్డ బతుకింతే అని నేను నిర్ణయించుకుంటున్న సమయంలో లేదు నీ బిడ్డ సుఖసంతోషాలకు శాశ్వతంగా దూరం కాలేదు. ఆమె ఆనందంగా గడపబోయే రోజులు వస్తున్నాయని తెలిసిన క్షణం... ఏం మాట్లాడాలో అర్థం కావడం లేదు మేఘనా"

అప్పుడు చూసింది మేఘన తల్లి ముఖంలోకి. ఒక అవధిలేని ఆనంద తరంగం. ఆమె ముఖంలో ఎగిసిపడుతోంది.

"నువ్వు... నువ్వనేదేమిటమ్మా?"

"అదృష్టం నీ ముంగిట నిలిస్తే అనుమానంగా చూస్తావేమిటమ్మా? ఆలోచనలతో సమయం వృథా చేసుంటావెందుకమ్మా"

"అయితే... అయితే ధీరజ్ కుమార్..."

"నీ ముంగిట నిలచిన నీ అదృష్టం"

"కానీ... కానీ నేను చూసి ఆ దృశ్యాలు, పెంచుకున్న భయాలు..."

సుగుణమ్మ కూతురి రెండు చేతులూ తీసుకుని తన ఒడిలో ఉంచుకుంది. "చూడమ్మా! ఈ ప్రపంచంలో మంచీచెడూ రెండు ఉన్నాయి. చెడే ఉందని మంచి లేదేమోనని భ్రమ పడడం పిచ్చితనం. ఆదర్శాల పేరుతో ఆవేశంతో రెండో పెళ్లి ఆడదానికి మెడలో తాళికట్టి ఆ తర్వాత మానసికంగా శారీరకంగా హింసించే మగాళ్లు కొందరు ఈ లోకంలో ఉన్నారు. ముఖ్యంగా ఆడది అంటే శరీరం తప్ప మరేదీ కాదు అనుకునే ఈ దేశంలో ఓ ఆడది రెండో పెళ్లి చుట్టూ చాలా అవాంతరాలున్న మాట నిజమే కాని అసలు వాళ్లిద్దరిదీ రెండో పెళ్లి కాదేమో అన్నంతగా ఏమాత్రం అనుమానం రానివ్వకుండా ఒకటిగా కలిసిపోయి జీవితాలను గడుపుకునే జంటలు ఎందరో ఉన్నారు. నీకు దొరికింది నూటికి నూరుపాళ్లు నికార్సయిన వజ్రమేనని నా నమ్మకం. అందులో ఏమాత్రమూ అనుమానంలేదు. ఎందుకంటే మంచివాడు కాని ఏ మనిషికి ప్రేమించిన ఆడపిల్ల తన వివాహాన్నే హామీగా ఉంచి అతడి పెళ్లి కోసం ప్రయత్నాలు చేయడం జరగదు. దయచేసి అతడిని పెళ్లి చేసుకోవడానికి నువ్వు అంగీకరించు. నువ్వు అంగీకారం తెలిపితే ఆ తర్వాత జరగాల్సినవన్నీ మేము చూసుకుంటాం"

చాలాకాలం తర్వాత మేఘన బుగ్గలు ఎరుపెక్కాయి.

అది గమనించిన సుగుణమ్మ, మేఘన భుజాలు పట్టుకుని దగ్గరగా తీసుకుని ఆమె నుదుట ముద్దు పెట్టుకుంది. "ఇక నువ్వు నిశ్చింతగా ఉండు మేఘనా" చెప్పేసి అక్కడి నుండి హుషారుగా బయటకు నడిచింది.

ఆ సాయంత్రం నరసింగరావు కూతురి రూమ్‌లోకొచ్చి ఆమె పక్కనే కూర్చుని మరి కొన్ని వివరాలు అడిగి తెలుసుకుని వెళ్లాడు.

రెండు రోజుల తర్వాత మేఘన ఆఫీసుకెళ్లింది.

తన క్యాబిన్‌లో కూర్చుని అటు చూస్తే ధీరజ్ కుమార్ తలొంచుకుని ఫైల్ చూడడం కనిపించింది.

ఆ సమయంలో అతడిని చూస్తుంటే ఆమెకు ఓ సరికొత్త భావం మనసంతా నిండిపోయింది. తనువులో అదోరకమయిన పులకరింత. మనసు పనిలో లగ్నం కాకుండా అతడికేసే చూస్తుండిపోవాలనే

అనిపిస్తోంది.

ఎందుకో తలెత్తి చూసిన అతడు ఆమె కేసి చూశాడు.

ఆమె తడబడి తల వంచుకుంది.

చాలా రోజులక్రితం ఇలాగే ఇలాగే కదూ అతడు తనకేసి దొంగ చూపులు చూసింది.

మేఘనకు ఆఫీసులో చేరిన తొలి రోజులు గుర్తుకొచ్చాయి.

మధ్యాహ్నం నరసింగరావు ఆఫీసుకొచ్చారు.

మేఘన తండ్రిని ధీరజ్‌కుమార్‌కి పరిచయం చేసింది.

ధీరజ్‌కుమార్‌కి ఆశ్చర్యమేసింది. మేఘన తండ్రి ఆఫీసుకు రావడమేమిటి? ఆయనకు ఆమె తనను పరిచయం చేయడమేమిటి?

అతడు ఆ ఆశ్చర్యంలో ఉండగానే ఆయన అన్నాడు. "బాబూ! నేను నీతో పర్సనల్‌గా కాసేపు మాట్లాడాలి"

ధీరజ్‌కుమార్‌కి గుండెవేగం పెరిగింది. ఈయన.. ఈయన నాతో పర్సనల్‌గా మాట్లాడడమంటే ఈమధ్యకాలంలో తనేమీ మేఘనను ఇబ్బంది పెట్టేలా మాట్లాడలేదే.

అతడు నిలువుగా తలాడిస్తూ "అలాగే ఇక్కడ కూర్చుందామా? " అడిగాడు.

"అలా బయటకు వెళ్లి మాట్లాడుకుందాం"

"సరయితే"

ఇద్దరూ బయటకు నడిచారు.

మరో గంట తర్వాత ధీరజ్‌కుమార్ ఒక్కడే తిరిగి వచ్చాడు.

క్యాబిన్‌లోకి వచ్చాక అతడు ఆమె టేబుల్ ముందుకు నడిచాడు.

అతడు తనకు పూర్తిగా దగ్గరగా, నడుస్తుంటే ఆమెకు తనువు వణుకుతున్నట్టనిపించింది. రక్తం వడివడిగా పరుగెత్తసాగింది.

ధీరజ్‌కుమార్ ఆమె దగ్గరగా వచ్చి టేబుల్ మీద చేతులుంచి కొద్దిగా వంగాడు.

అతడి ముఖం తన ముఖానికి ఎదురుగా నిలవడం గమనించి కూడా కళ్లెత్తి చూడడానికి ఆమె సాహసించలేకపోయింది.

ధీరజ్‌కుమార్ గొంతు వినిపించింది "థాంక్స్ మేఘనా"

ఆమెకు అతడు ఎందుకలా అంటున్నాడో కొంతవరకూ అర్థమయింది.

అతడు మరింత విడమర్చి చెప్పాడు. "ఎందుకో తెలుసా? మీ నాన్నగారు నాకు విషయం వివరించి చెప్పారు. నువ్వు నన్ను పెళ్లి చేసుకోవడానికి అంగీకరించడం, అందుకు మీ వాళ్లు ప్రోత్సహించడం, ఆ పనిలో మీ నాన్నగారు నన్ను కలవడం, నేను ఆయనకు నా అంగీకారం తెలియచేయడం జరిగిపోయాయి. ఇక పెళ్లి ఒక్కటీ మిగిలి ఉంది"

"అయితే... అయితే" ఆమె కళ్లెత్తి అతడి కళ్లల్లో కలిపింది "మీరు థాంక్స్ చెప్పాల్సింది నాకు కాదు"

"మరెవరికి? "

"ప్రశాంతికి"

అతడు నిలువుగా తలాడించాడు "మనిద్దరం నిజంగానే ప్రశాంతికి థాంక్స్ చెప్పుకోవాలి. ఎందుకంటే ఆమె చూపిన చొరవ, ఆమె హామీ ఇచ్చిన ఆత్మవిశ్వాసమే నిన్ను పునరాలోచించుకునేలా చేసి మీ అమ్మకు విషయం చెప్పగలిగేలా చేసింది. ఇలాంటి వ్యవహారాలలో అలా కదిలేవాళ్లు, కదిలించేవాళ్లు ఎవరయినా ఉండాలి. అప్పుడే కథ సుఖాంతమో, దుఃఖాంతమో తేలిపోతుంది. ఈవిధంగా మనం ప్రశాంతికి థాంక్స్ చెప్పుకోవాలి"

ఆ సాయంత్రం ధీరజ్‌కుమార్ ప్రశాంతికి ఫోన్ చేసి ఆఫీసుకు వచ్చేలా చేశాడు.

ముగ్గురూ దగ్గరలో ఉన్న రెస్టారెంట్‌కి వెళ్లి కూర్చున్నాక మేఘన ప్రశాంతి చేతులు

రెండూ తన చేతుల్లోకి తీసుకుని ఏం చెప్పాలో ఎలా మాట్లాడాలో తెలియని స్థితిలో అలాగే ఉండిపోయింది. అయితే వద్దు వద్దంటున్నా రాకుండా మానమంటూ రెండు కన్నీటి బొట్లు ఆమె కళ్లల్లో నిలి చాయి.

"ఏమిటక్కా ఏమయింది? "

"నీకు... నీకు ఎలా కృతజ్ఞతలు చెప్పుకో వాలో నాకర్థం కావడంలేదు"

"ఇందులో కృతజ్ఞతలు చెప్పే ప్రసక్తి ఏముంది? "

"నీవిచ్చిన హామీని తనఖాపత్రాలుగా భావించి ఆ ధైర్యంతో నేనీ పెళ్లి చేసుకోవడం లేదు. కాని ఆ మాటలో నువ్విచ్చిన ధైర్యంలో నా అనుమా నాలన్నీ పటాపంచల యిపోయాయి. నేను ఒకడుగు ముందుకు వేయగలిగాను. నన్ను ముందడుగు వేయిం చిన ఘనత మాత్రం నీదే" మేఘన గొంతు జీరపోయింది.



"అక్కా! మిమ్మల్ని కలపడం వల్ల నాకు అనంతమైన సంతృప్తి మిగిలింది. ఈ జీవితానికి ఆ సంతృప్తి చాలు"

ధీరజ్ కుమార్, మేఘనలు ప్రశాంతికేసి జాలిగా ఆరాధనా భావాలు మిళితం చేసి చూశారు.

"మేఘనా! ఎక్కడమ్మా కాబోయే పెళ్లి కూతురా!"

ప్రశాంతి హడావుడిగా వచ్చేసింది.

సుగుణమ్మ చెప్పింది "అదుగోనమ్మా గంట నుంచీ పెరట్లో కూర్చుని వుంది. ప్రశాంతి వస్తుందే షాపింగ్ వెళ్లాలి, త్వరగా రెడీకా అంటే ఉలకదూ పలకదూ"

"కలలు కంటోందేమో ఆంటీ" ప్రశాంతి నవ్వేసి పెరట్లోకెళ్లింది.

ఓ చెయిర్లో చేరబడి కూర్చుని ఎటో చూస్తోంది మేఘన.

ప్రశాంతి అడుగుల సవ్వడి ఆమె ఏకాగ్ర తను ఏమాత్రం చెడగొట్టలేకపోయింది.

ప్రశాంతి అడుగుల వేగం తగ్గించి మెల్లగా నడుస్తూ మేఘన వెనగ్గా వెళ్లి ఆమె కళ్లు మూసేసింది.

మేఘన ఆ చేతుల్ని ఓసారి తడిమి 'ప్రశాంతి' అన్నది.

"అరె భలే కనిపెట్టే శావే" నవ్వింది ప్రశాంతి.

మేఘన బదులుగా నవ్వింది.

"ఏంటో అంత మైమరచిపోయి చూస్తున్నావ్. ఎటు చూసినా మా ధీరజ్ కనబడుతున్నాడా? "

ప్రశాంతి మాటలకు మేఘన నవ్వలేదు. ఆమె సీరియస్‌నెస్‌ని కనిపెట్టిన ప్రశాంతి అడిగింది "అట్లా వున్నావేం? "

"ఏం లేదు. ఇదుగో మా పెరట్లో చెట్లు చూశావా? మొన్నీమధ్య వరకూ పచ్చగా కళకళలాడుతుండేవి. ఇప్పుడు చూడు ఆకులు రాలిపోయి ఎట్లా మోడువారిపో యాయో!" దిగులుగా చెప్పింది మేఘన.

"ఇది బాగుంది. అవన్నీ సీజనల్ చేంజస్. ఆటమ్ వచ్చిందీ ఆకులు రాలాయి. రేపు వసంతం వస్తే అన్నీ ఒక్క సారిగా చిగురిస్తాయి. ఇట్సె నేచురల్ ఫెనో

మినా"

"అక్కా! అమ్మా నేనూ రెడీ" శ్రీలత వచ్చేసింది చున్నీ సవరించుకుంటూ.

ఓ అరగంట తర్వాత మేఘనా, ప్రశాంతీ, సుగుణమ్మా, శ్రీలతా.. అతిపెద్ద షాపింగ్ కాంప్లెక్స్‌లో పట్టుచీరల సెలక్షన్‌లో మునిగిపోయారు.

మేఘన మాత్రం ఫార్మల్‌గా చూస్తోంది తప్ప పెద్ద ఉత్సాహంగా లేదు.

అది కనిపెట్టిన ప్రశాంతి ఆమెను యాక్టివేట్‌చేసే ప్రయత్నంలో "ఇంతకీ... పట్టుచీరల సెలక్షన్ నీ టేస్ట్ ప్రకారమా... మా బావగారి టేస్ట్ ప్రకారమా... ఎట్లా కొనాలో" అంది.

"నీ ఇష్టం ప్రశాంతీ" అంది మేఘన.

"వెరీ గుడ్! బాగుందమ్మా! మీ ఇద్దరి మధ్యలో నా టేస్టేమిటి? ఎవరైనా వింటే నవ్విపోతారు" అంది.

"సరే మీ బావగారి టేస్ట్ ప్రకారం, సెలెక్ట్ చెయ్యి"

"అట్లా అన్నావ్ బాగుంది" అంటూ ప్రశాంతి సీరియస్‌గా కౌంటర్‌మీద స్ప్రెడ్ చేసిన పట్టుచీరలన్నిటినీ పరిశీలించి... ఓ పీచుమిఠాయి రంగు చీరె తీసి చూపింది మేఘనకు. "ఈ కలర్ అంటే పంచప్రాణాలు మా ధీరజ్‌కి. ఈ రంగు చూస్తే చాలు... ఇట్టే బాల్యస్మృతుల్లోకి వెళ్ళిపోతారు. చిన్నప్పుడు తిన్న పీచుమిఠాయి రుచిని ఇట్టే ఏకరువు పెట్టేస్తారు. సో... ఈ శారీ సెలెక్టెడ్"

అంతవరకూ ఉదాసీనంగా వున్న మేఘన ఆ చీరెవంక కంపరంగా చూస్తూ "కొంపదీసి నిజంగానే సెలెక్ట్ చేశావా ఏంటి?" అంది.

"అవును" చెప్పింది మేఘన.

"మీ ధీరజ్‌కాదుగదా... ఆ దేవుడొచ్చి చెప్పినా ఆ రంగు నా ఒంటిమీద పెట్టను" నిక్కచ్చిగా చెప్పింది మేఘన.

"అలారా దారికి... బుద్ధిగా సెలెక్ట్ చేసుకోవాలి"

ప్రశాంతి మాటలకు సుగుణమ్మా... శ్రీలతా ఒకటే నవ్వులు.

ఇట్లాంటి సందర్భాల్లో తను మరీ ఇంత మూడీగా వుండటం తనకే ఎబ్బెట్టుగా వుందనిపించిందేమో... మేఘన కూడా ముఖాన నవ్వు పులుముకుని సెలక్షన్‌లో మునిగిపోయింది.

ఓ రెండు పట్టుచీరలూ, ఓ పది కేజువల్ వేర్‌గా ఉపయోగపడే శారీస్ కొన్నాక... నలుగురూ ఆటోలో బయలుదేరారు.

ఆటో ఎక్కుతున్నప్పుడు గమనించింది మేఘన ఆకాశం మేఘావృతమై వుండటాన్ని.

ఉండి ఉండి మెరుపులూ... ఉరుములూ కూడా మొదలైనై.

"ఇదేంటి... వచ్చేప్పుడు అంత ఎండ కాసింది, వెళ్లేప్పటికి ఇంతమార్పు" సుగుణమ్మ ఆశ్చర్యపోయింది.

"అవి వసంతమేఘాల్లే ఆంటీ. ఓ జల్లు పడ్డాక ఎట్లా వచ్చాయో అట్లాగే పోతయ్" చెప్పింది ప్రశాంతి.

ఆ రాత్రంతా వర్షం పడుతూనే వుంది.

ఒకటే మెరుపులూ... ఉరుములూ. శ్రీలతైతే భయంతో చెవుల్లో వేళ్ళుపెట్టుకుని, మేఘనను హత్తుకుపోయి పడుకుంది.

"ఇంకో వారంలో పెళ్ళి పెట్టుకున్నాం. ఈ పాడు వానేంటో ఇప్పుడు పట్టుకుంది" సుగుణమ్మ వాపోయింది.

మేఘనకి ఆ ప్రకృతి భీభత్సం చూస్తుంటే... అది అచ్చం, తన జీవితానికి సింబాలిక్ ఇన్సిడెంట్‌లా అన్పించింది.

తెల్లగా తెల్లారాక కళ్ళు విప్పితే... సూర్యుని లేలేత కిరణాలు పడి... అక్కడొకటీ అక్కడొకటిగా మిగిలివున్న ఆకులమీది

# ఏరినముత్యాలు

★ ధైర్యరహితమైన సత్యం ఉండదు. సత్యరహితమైన ధర్మం ఉండదు.

– సర్‌వాల్టర్ స్కాట్

★ ప్రపంచంలో డబ్బే ప్రధానమని అనుకునేవారు డబ్బుకోసం ఏ పనైనా చేస్తారు.

– సోమర్‌సెట్‌మామ్

★ మానవజీవితం పర్వతారోహణం వంటిది. ఒక శిఖరం ఎక్కితే మరో శిఖరం కనిపిస్తుంటుంది.

– విన్‌స్టన్ చర్చిల్

★ ఏ దేశంలోనైనా పౌరులను జాతి అభివృద్ధి కృషికి సమాన భాగస్వాములుగా చేసేది జాతీయభావం.

– జవహర్‌లాల్ నెహ్రూ

★ ఉదయం లేస్తూనే కర్తవ్యం సాధించటానికి బయలుదేరి, సాయంత్రం సంతృప్తిగా నడుం వాల్చు.

– హెన్రీ

★ అశ్రద్ధ అసలు కూడదు. ఒకచిన్న విషయంలోనైనా అశ్రద్ధ చూపితే, అదే ఒక పెద్ద విఘాతానికి దారితీయవచ్చు.

– టెన్నిసన్

★ ప్రేమించేవారు దూరమైనప్పుడు ఆ స్థితి మరణం కంటే కూడా చాలా బాధాకరంగా ఉంటుంది.

– విలియం జౌసర్

★ ఎవరి లోపాలను వారు గుర్తించగలగటమే నిజమైన విజ్ఞత.

– పాకాల్

★ ప్రకృతిపట్ల ఎప్పుడూ ఆరోపణ చేయకు. దానివంతు పని అది చేస్తుంది. నీవు చేయాల్సిన పని నీవు చెయ్యి.

– జాన్‌మిల్టన్

★ పండ్లతో నిండిన చెట్టు పండ్ల బరువు కారణంగా ఒంగి పోతుంది. గొప్పవాళ్లు కావాలంటే నమ్రతతో వినయంగా ఒంగి ఉండండి.

– శ్రీరామకృష్ణ పరమహంస

★ మౌనంగా ఉన్నవారంతా బుద్ధిమంతులు కారు. కాని బుద్ధిమంతులు మాత్రం సాధారణంగా మౌనంగానే ఉంటారు.

– విలియం జేమ్స్

సేకరణ: ముద్దంశెట్టి అందున్న

నీటిబిందువులు మిలమిల మెరుస్తూ కనబడ్డాయి మేఘనకి.

వారంరోజులూ పెళ్ళిపనులతో క్షణాల్లా గడిచిపోయాయి.

ఇక రేపు పెళ్ళనగా... పెరట్లో మొక్కలకు నీళ్ళు పెడుతున్న మేఘన దగ్గరకు పరిగెత్తుకొచ్చి ప్రశాంతి "నో...నో... రేపు కాబోయే పెళ్ళికూతురేంటీ, ఇవాళ పనిచేయడమేంటి? " అంది మేఘన చేతిలోని పైప్ లాక్కుంటూ.

వాటరింగ్ చేస్తున్న ప్రశాంతితో మేఘన అంది, "నువ్వు చెప్పింది నిజం ప్రశాంతీ. మొన్నటి మబ్బుల్ని చూసి బెంబేలు పడ్డాంగాని... అవి నువ్వన్నట్టూ వసంత మేఘాలే. చూడూ... మోళ్ళన్నీ ఎట్లా చిగుళ్ళు తొడిగాయో"

"సో... జీవితసత్యం అమ్మాయిగారికి ఇప్పటికర్థమైందన్నమాట" నవ్వింది ప్రశాంతి.

"నా మనసులోని మబ్బులన్నీ కరిగిపోయి... ఇలా కళ్ళవెంట జారిపోయి... నా జీవితం ఇప్పుడిప్పుడే చిగురిస్తోంది" మేఘన నవ్వింది కళ్ళవెంట నీళ్ళు జలజల రాలిపోతుండగా.

"ఏయ్... ఏంటా కన్నీరు? " ప్రశాంతి కంగారుపడింది.

"ఛ...ఛ... ఇది కన్నీరు కాదు..."

మేఘన మాటల్ని మధ్యలోనే అందుకుని అంది ప్రశాంతి, "నాకు తెలుసులే. పన్నీరు కదూ"

ధీరజ్‌కుమార్, మేఘనల పెళ్లి కొద్దిమంది ఆహూతులమధ్య నిరాడంబరంగా జరిగిపోయింది.

"మేఘనగారూ! ఆరోజు నేను ధీరజ్‌కుమార్‌గారి గురించి మంచిగా ఎంతో చెపితే మీ బుర్రకెక్కలేదు. ఇప్పుడు ఆయన మరదలు బావగారి గుణగణాలు వివరించి చెప్పాకే మీకు నమ్మకం కుదిరిందన్నమాట" నిష్ఠూరమాడినట్టుగానే నవ్వుతూ పలికింది దీపిక.

"అది... అది..."

"అది ఏదయినా మీరిద్దరూ ఒకటయినందుకు నాకెంతో సంతోషంగా ఉంది"

వాళ్ల పెళ్లికి కంపెనీ యం.డి.గారు కూడా హాజరయ్యి తన శుభాకాంక్షలు అందచేశారు.

★ ★ ★

పెళ్లయ్యాక మేఘన తన ఉద్యోగానికి రాజీనామాచేసింది.

వాళ్లిద్దరూ ఆఫీసుకు దగ్గరలోనే ఓ పోర్షన్ అద్దెకు తీసుకుని కొత్త కాపురం పెట్టారు.

ఆరు నెలలు గడిచాయి.

ఓరోజు మేఘన ప్రశాంతిని కలిసి చెప్పింది, "నా జీవితం నేనూహించనంత ఆనందంగా గడిచిపోతోంది. అయితే ఒకే ఒకలోటు మిగిలింది"

ప్రశాంతి కంగారుగా "ఏమిటాలోటు? " ప్రశ్నించింది.

"నీ పెళ్లి"

ప్రశాంతి మాట్లాడలేదు.

మేఘనే పలికింది "నీపెళ్లి జరిగిపోతే నేను నిశ్చింతగా కాపురం చేసుకుంటాను"

"అలాగే" ఆమె చేతిలో చెయ్యేసింది ప్రశాంతి.

✤

# చతుర కతలు

## సారీ సర్

రమణ ఆ ఆఫీసు ఫైళ్లలో మునిగి తేలుతు న్నాడు.

"నమస్తే సార్" తల ఎత్తి చూశాడు. చేతిలో సూట్‌కేసుతో టకప్ చేసుకున్న ఒక వ్యక్తి అతని ఎదురుగా నిలబడి వున్నాడు. రమణ తన రొట్టె విరిగి నేతిలో పడిందను కున్నాడు. రమణ ఆ ఆఫీసులో సిబ్బందిని



ఇబ్బందుల పాలు చేసే సిబ్బంది గుమాస్తా.

"ఎవరక్కడ, ఒక కుర్చీ వేయండిరా" అన్నాడు. అతనికి కుర్చీ వేశాడు రమణకు విధేయుడైన ఒక అటెండర్.

"నేను పోచంపాడు నుండి వచ్చానండి. నేను ఇక్కడి నుండి బదిలీ అయ్యేటప్పుడు నాకు ఇంక్రిమెంట్లు శాంక్షన్ చెయ్యలేదు. ఆ తరువాత పే ఫిక్సేషన్ కూడా చెయ్యాలి. నేను వెళ్లి చాలాకాలమైంది. ఎన్నో కాగి తాలు పెట్టాను. ఇప్పుడు అర్జెంట్‌గా నాకు ప్రమోషన్ విషయంలో నా సర్వీసు పుస్తకం కావాలి. మీరు ఆ పనులన్నీ చేసి నాకు నా సర్వీసు బుక్ ఇస్తే వెళ్లిపోతాను. హెల్ప్ చెయ్యండి" అన్నాడు.

రమణ వెంటనే "సారీ సర్! థర్డ్‌వీక్ గదా మేము పేబిల్స్ ప్రిపరేషన్‌లో వున్నాం. ఇప్పుడు పాత పనులేవీ చెయ్యడం కుదరదండి. దయచేసి వచ్చే నెల మొదటి వారంలో రండి" అనేసి తలవంచుకుని తన పని చేసుకోసాగాడు.

అతను వెంటనే బయటకు వెళ్లి వరం డాలో తచ్చాడి మళ్లీ లోపలకు వచ్చి రమణ దగ్గర కూర్చున్నాడు.

"నేను చాలా దూరం నుండి వచ్చానండి. మీరు తలచుకుంటే చెయ్యగలరు. ఎలాగో నా పని పూర్తి చెయ్యండి. అవసరమైతే ఆఫీ సరు గార్ని కలుస్తాను" అన్నాడు.

"ఆఫీసరు గార్ని కలుసుకున్నా వీలు పడ దండి. అయినా ఆయన క్యాంప్‌లో వున్నా

రండి. వారం రోజుల దాకా రారు" అంటూ బాంబ్ పేల్చాడు రమణ. వల విసరకపోతే చేప దొరకదని అతనికి తెలుసు.

ఆయన గుండెల్లో రాయి పడింది. తన పని ఎలాగోలాగు అయితే చాలు అని దేముళ్లకు మొక్కుకో సాగాడు. రమణ ఆయన పరిస్థితిని గమనించి ఎర తయారు చెయ్యడం మొదలుపెట్టాడు.

"సర్ మీ ఊరికి టికెట్ ఎంత? "

"వంద రూపాయలు"

"రాత్రికి వున్నారనుకోండి ఎంత ఖర్చు అవుతుంది? "

"ఎందుకవదండి, రోజుకు కనీసం వంద రూపాయలు"

"అయితే మళ్లీ వస్తారా? "

"ఏం చేయను. మీరు పని కాదంటున్నారుగదా? "

అప్పుడు పక్కనే నిలబడి వున్న రమణ విధేయుడైన అటెండర్ "గురువుగారూ, మా రమణగార్కి ఆ ఖర్చులు ఇచ్చెయ్యండి. పనయ్యే ఏర్పాటు చేస్తాను నేను" అన్నాడు ఆయనతో.

"అలాగే" అన్నారాయన.

ఒక గంటలో ఆఫీసరుగారు వచ్చారు. రమణ చకచకా ఆయన పని పూర్తి చేసేశాడు. ఆయన వెళ్తూ "అదేవిటండి అలా చెప్పారు. ముందుగా చెప్తే నేను మిమ్మల్ని సంతోషపెట్టేవాడిని గదా? చాలా టెన్షన్‌లో పెట్టేశారు"

అందుకు రమణ నవ్వుతూ "అయ్యా సర్వీసులో ఎంతోమందిని చూశాను. నేను మిమ్మల్ని చూడగానే పని చేసిపెట్టాననుకోండి. నన్ను కనీసం పలకరించకుండా వెళ్లిపోతారు. కొంతమందైతే నాతో చెప్పకుండా అటెండర్స్ చేతిలో పది రూపాయలు పెట్టి వెళ్లిపోయారు. అందుకని ఈ పద్ధతి అనుసరిస్తున్నాను. సారీ" రమణ మాటలు పూర్తికాకుండానే ఆయన వెనక్కు తిరిగి చూడకుండా వెళ్లిపోయాడు.

– కె.బి.కృష్ణ

---

## మెలుకువ

మా చింటుగాడి బర్త్‌డే! వాడికి ఓ మంచి పెన్ను ప్రజంటు చేద్దామని మారుతీ ఫ్యాన్సీ స్టోర్సుకి వెళ్లాను. ఆ స్టోర్సు యజమాని నారాయణగారు నాకు మిత్రులు కావడంవల్ల తరచుగా వాళ్ల షాపుకు వెడుతుంటాను. ఆ షాపులో పనిచేసే సేల్సుమెన్‌లు శ్రీను, జిలానీ నాతో బాగా చనువుగా వుంటారు.

నేను షాపుకు వెళ్లేసరికి కౌంటరు బిజీగా వుంది. నేను జిలానీ దగ్గరకువెళ్లాను. జిలానీ నాకు పెన్నులు చూపిస్తున్నాడు.

"ఇది ప్రేమలేఖలు రాసే పెన్నండి. ఇది అమితాబచ్చన్ ఆటోగ్రాపులిచ్చే పెన్నండి. ఈ పెన్నుతో మూడు గంటల పేపరు అర గంటలో రాసెయ్యొచ్చండి" అంటూ టీవీ యాడ్‌లను గుర్తు చేస్తూ హుషారుగా పెన్నులు చూపిస్తున్నాడు. అప్పుడే నారాయణగారు కౌంటరు నుంచి "జిలానీ! మీ బంధువు వచ్చారు చూడు" అన్నారు. ఆ బంధువు మా దగ్గరకు వచ్చి నిలబడ్డాడు. జిలానీ నాకు చూపిస్తున్న పెన్నులలో ఓ ఖరీదైన పెన్నును ఆ బంధువు వైపుకు తోసాడు. అతను ఆ పెన్నును తన జేబులో పెట్టేసుకున్నాడు. నా కళ్లముందు దొంగతనం జరిగిపోయింది. నేను చురుగ్గా జిలానీ కళ్లల్లోకి చూశాను. జిలానీ కంగారు పడ్డాడు. కళ్లతోనే నన్ను చెప్పవద్దన్నట్లుగా ప్రాధేయపూర్వకంగా బేలచూపులు చూశాడు. నేను నాకు కావలసిన పెన్ను కొనుక్కొని బయటకు వచ్చేశాను.

ఇంటికి వచ్చేసినా ఇంకా నా కళ్లముందు జరిగిన దొంగతనం మెదలుతూనే వుంది. నేను ఎందుకు మౌనం వహించానో,



ఎందుకు అడ్డుకోలేకపోయానో ఇప్పటికీ నాకు అర్థం కాకుండా వుంది. జిలానీ ఈవిధంగా నారాయణగారిని ఎంతకాలంగా మోసం చేస్తున్నాడో! జిలానీ విషయం నారాయణగారి దృష్టికి తీసుకువెళ్లడం నా కర్తవ్యం అనిపించింది. వెంటనే దొంగను పట్టి ఇవ్వకపోవడం నా వల్ల జరిగిన తప్పిదం అనిపించింది. అంచేత బాగా ఆలోచించి జరిగినదంతా పోస్టు కార్డు మీద రాసి జిలానీ విషయంలో మెలుకువగా వుండమని హెచ్చరిస్తూ ఆకాశరామన్న ఉత్తరం రాసి పోస్టుచేశాను.

మర్నాడు సాయంకాలం మారుతీ ఫ్యాన్సీ స్టోర్స్‌కి వెళ్లాను. నా కళ్లు జిలానీ కోసం వెదికాయి. లేదు. అమ్మయ్య పనిలోంచి తీసివేసి వుంటారు. అయినా ఆ విషయం నారాయణగారి ద్వారా విందామని "జిలానీ ఏడీ? " అన్నా.

"పోస్టులో ఏమైనా యల్.ఆర్‌లు వుంటే తీసుకుని, బ్యాంకులో పదివేలకు డి.డి. తీసుకు రమ్మని పంపిస్తే ఆ డబ్బుతో ఉడాయించాడు. కాలం ఎలా వుందో చూశారా? " అన్నాడు నారాయణగారు.

నా ఉత్తరం ఎవరిని మెలుకువ చేసిందో నాకు స్పష్టంగానే అర్థమయ్యింది.

– రతన్‌బాబు

## అదీ సంగతి!

"మనం కాకినాడలో చదువుకునేటప్పుడు నిరుద్యోగులుగా వున్నప్పుడు మన గోడు విన్న ఈ గాంధీనగరం పార్క్ ఇప్పుడు ఎంతో అందంగా కనిపిస్తోందిరా" అన్నాడు అనిల్ తన మిత్రులతో.

ఆరోజు విజయదశమి. హైదరాబాద్‌లో ప్రైవేటు కంప్యూటర్స్ కంపెనీల్లో పనిచేస్తున్న నలుగురు మిత్రులు అనిల్, సురేష్, కమల్, మధులు కాకినాడ గాంధీనగరం పార్క్‌లో కలిశారు.

"ఏదైనాసరే మనం చూసే దృష్టిలో తేడా వుంటుంది. మనం ఉద్యోగాలు చేస్తూ ఇప్పుడు హేపీగా వున్నాం. ఇప్పుడు ఏం చూసినా అందంగానే వుంటుంది. అది మన మానసిక స్థితిని బట్టి వుంటుందిరా" అన్నాడు సురేష్.

"అది సరే సురేష్ నీకు పెళ్లి కుదిరిందని

తెలిసింది. ఎంతకి అమ్మేస్తున్నారేమిటి నిన్ను మీవాళ్ళు" అన్నాడు మధు.

"అరేయ్ చూడండి. మనం చదువుకునేటప్పుడు ఎన్నో అనుకుంటుంటాం. కట్నం లేకుండా పెళ్ళి చేసుకుని కనీసం ఒక్క అమ్మాయినైనా సంతోషపెట్టాలి, ఆదర్శంగా నిలబడాలి అని అనుకుంటాం. కానీ వాస్తవంలోకి వచ్చేటప్పుడు ఆచరణలో పెట్టడం సాధ్యంకాదు. జీవితం ఇంతే. మమ్మీ, డాడీ పిల్లని చూసి, నచ్చితే చెప్పమన్నారు. చూసి చెప్పాను" అన్నాడు సురేష్.

"అమ్మాయిది ఏ ఊరు? "

"రావులపాలెం. ఒక్కతే కూతురు. బోల్డు ఆస్తి వుందట"

"అయితే నువ్వు సోల్డ్ అవుట్ అన్న మాట. ఈరోజునుండే అలవాటు చేసుకో. నీకు అంటూ ఒక వ్యక్తిత్వం వుండదు. నువ్వు ఆమె చెప్పినట్లే వినాలి"

"ఎందుకు వినాలి? "

"ఎందుకంటే నిన్ను ఆమె కొనుక్కుంది కాబట్టి"

"కొనుక్కోవడమేమిటి? "

"బాబూ... మీవాళ్ళు నీ పెళ్ళికి కట్నం తీసుకున్నారంటే నిన్ను అమ్మేసినట్లేరా పిచ్చోడా? "

"నో... నెవ్వర్. మీరే చూద్దురుగాని. నేను నా వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకుంటాను. పైగా నా మాటకు ఎదురుచెప్తే నల్లిని నలిపేసినట్లు నలిపేస్తాను. తెలుసా? "

"సురేష్ కంగారుపడకు"

"కంగారేమిటిరా, ట్రాష్, కట్నం తీసుకుంటే బానిసలా పడివుండాలా? నథింగ్ డూయింగ్. నేను చేసి చూపిస్తాను. మీరందరూ నన్ను ఫాలో అవ్వండి. మనం నలుగురం హైదరాబాదులో మల్టినేషనల్ కంపెనీల్లో జాబ్ చేస్తున్నామని మన తల్లి దండ్రులు మంచి రేటుకు అమ్మేస్తారు. అంతవరకూ ఓ.కే. అలాగని మన వ్యక్తిత్వాలు చంపుకోనక్కరలేదు" అన్నాడు సురేష్ ఉద్రేకంతో.

"అయినా మాటలకు, చేతలకు చాలా తేడా వుంటుందిరా. ఈ విషయం ఇంతటితో ఆపెయ్యండి" అన్నాడు మధు.

వాళ్ళు ఆరోజు ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు.

మళ్ళీ విజయదశమి పండగ వచ్చింది.

గాంధీనగరం పార్కులో అనిల్, కమల్, మధులు కూర్చుని వున్నారు. సురేష్‌కోసం ఎదురుచూస్తున్నారు.

గేటుదగ్గర శాంత్రో కారు దిగి మిత్రులకు సైగ చేశాడు రమ్మని.

ముగ్గురూ కారు దగ్గరకు వెళ్ళారు.



ఆరోజు జల్సా చేయచ్చని.

"సారీరా... నేను ఇప్పుడు అర్జంటుగా రావులపాలెం వెళ్ళాలి. లేకపోతే నా స్వీటీ ఊరుకోదు" అంటున్నాడు సురేష్. రేమండ్స్ సూటింగ్స్‌లో టకప్ చేసుకుని యువరాజులా వున్నాడు. ఒకచేతికి గోల్డ్ వాచ్, మరోచేతికి బ్రాస్‌లెట్, వేళ్ళకు ఉంగరాలు, మెడలో తాడులాంటి బంగారుగొలుసు, కళ్ళకు గోల్డ్ ప్లేటెడ్ రేమండ్ గ్లాసెస్. ఓహ్... చాలా ఖరీదుగా వున్నాడు.

"అదేంటిరా మాకోసం ఒక గంట స్పేర్ చెయ్యలేవా? "

"నో... సారీ"

"ఫర్లేదులే. కారు పార్కింగ్ చెయ్యి"

అనిల్ మాటలు పూర్తి కాకుండానే కారు వెనుక డోర్‌లోంచి ఒక యువతి దిగింది. "డార్లింగ్ కమాన్. డోన్ట్ వేస్ట్ టైమ్" అంది నవ్వుతూ. ఆమె కనకాంబరం రంగు పట్టు చీర కట్టింది. ఒక కిలో బంగారం నగలున్నాయి ఆమె వంటిమీద. ఆమె బంగారు రంగుకన్నా మిన్నగా మెరిసిపోతోంది. ఎంతో అందంగా వెలిగిపోతోంది, తాజ్‌మహల్ లైట్ల కాంతిలో మెరిసిపోతున్నట్లుగా.

అంతే... వెంటనే సురేష్ కారు ఎక్కి వెళ్ళిపోయాడు పెంపుడు కుక్కలాగా.

కనీసం వెళ్తున్నాననైనా చెప్పకుండా వెళ్ళిపోయిన తమ మిత్రుణ్ణి నిశ్చేష్టులై చూస్తున్నారు మిత్రులు.

– క్రిష్ణ

---

## ఆశ

విశాఖపట్నం విరగదీసుకొని బంగాళఖాతం ఒడ్డున ఒంటరిగా ఉంది. సూర్యుడు తన ప్రతాపాన్ని చూపెట్టే పనిలో ఉన్నాడు. ఎండకు నల్లని రోడ్లన్నీ నీగ్రో అమ్మాయిల్లా నిగనిగలాడుతున్నాయి. వాటిని నిమురుతూ ఆటోలు పరుగెడుతున్నాయి. రైల్వే స్టేషను రాజఠీవి వెలగబెడుతోంది. ఛాతీ విరుచుకొని నిలబడుతోంది. ఏదో ఒక ట్రెయిను వస్తూనే ఉంది, పోతూనే ఉంది. జనానికి ఏమీ పనిలేనట్లు వస్తున్నవారు వస్తున్నారు, పోతున్నవారు పోతున్నారు. మధ్యాహ్నం రెండయ్యింది. నాలుగు మెతుకులు కడుపులో పడ్డవాళ్ళు మాగన్నుగా నిద్దరోతున్నారు. చిద్విలాస్ స్టేషను ఎంట్రన్సులో ఉన్న హాలులో నిలబడి ఉన్నాడు. జీన్‌ప్యాంటు, దానిమీద పొట్టి షర్టు, కళ్ళకు రేబాన్ కళ్లద్దాలు. అతను వెళ్ళాల్సిన ట్రెయిను రావడానికి ఇంకా చాలా టైముంది. రైళ్ల రాకపోకలు సూచించే డిస్‌ప్లే బోర్డుని మళ్ళీ చూశాడు. అప్పటికి అలా చూడ్డం అయిదోసారి. తన ట్రెయిను గంటలేటు. విసుగ్గా వాచీ చూసుకొన్నాడు. గంటలేటు అంటే రెండు గంటలవ్వొచ్చు మూడు గంటలవ్వొచ్చు తేదీ అయినా మారొచ్చు భారత రైళ్ల సంగతి తనకు తెలియదా? రైల్వే డిపార్టుమెంటు మీద బోల్డంత కోపం వచ్చింది. ఇదే విదేశాల్లో అయితే ఆలస్యానికి నిమిషానికి ఇంతని డబ్బు లెక్క కట్టేసి ఇస్తారు. ఇండియాలో అడుగడుగునా అవినీతి, అరాచకం, అన్యాయం. దీన్ని ఎదిరించేవాళ్లు రావాలి. అప్పుడే ఈ దేశం బాగుపడుతుంది. కసిగా పెదవి కొరుక్కున్నాడు. ఉప్పగా తగిలింది నాలిక్కి. చివుక్కుమంది ప్రాణం ఆపాటి రక్తపాతానికి. అటువంటిది వ్యవస్థ రూపుమాపాలంటే రక్తపాతం అనివార్యం అని తమ కామ్రేడ్సు అంటుంటారు. తనలాంటి అర్భకుడికి అది సాధ్యమేనా!

ఫ్రాకు వేసుకొన్న పదేళ్ళ పాప తనముందునుండి నడిచివెళ్తోంది. చిద్విలాస్ చూపులు ఆ అమ్మాయిమీద నిలిచాయి. పెద్దగా ఆకర్షించే రూపం కాదామెది. కాని ఆ పిల్ల నడుస్తుంటే రిబ్బను కట్టిన

జడతమాషాగా ఊగుతోంది. ఆమె వెళ్ళి వెయింగు మిషనుమీద నిలబడింది. రంగు రంగుల చక్రం తిరిగి తిరిగి ఆగిపోయింది. చేతిలో ఉన్న కాయిన్ కన్నంలో వేసింది. నాణెం స్లాటులోపడి శబ్దం చేసింది. లైటారలేదు. బరువు సూచించే టికెట్ పడలేదు. నిరాశ, నిస్పృహలు ఆమె ముద్దుల మోముని ఆవరించాయి. ఏడుపు తన్నుకు రావడంతో తలవంచేసుకుని వెనక్కు మరలి పోయింది. చిద్విలాస్ అంతా చూస్తూనే ఉన్నాడు. మెషీను దగ్గరగా వెళ్ళి చూశాడు. ఇన్‌స్ట్రక్షన్స్ రాసి ఉన్నాయి. రెండు



రూపాయి నాణేలు వేయమని రాసుంది. చిద్విలాస్ అటూఇటూ చూశాడు. పాసింజర్సు ఎవరి బిజీలో వాళ్లున్నారు. ఎవ్వరూ చూడ్డంలేదని నిర్ధారించుకొని జేబులో చెయ్యి పెట్టాడు. రూపాయి కాయిన్ తీశాడు. చిద్విలాస్ ఆర్థికశాస్త్రం చదివాడు. ఇప్పుడు కేవలం ఒకేఒక్క రూపాయితో తన బరువుని సూచించే టికెట్ పొందుతాడు. 'బ్రేవో చిద్విలాస్' అని రూపాయి నాణాన్ని స్లాటులో వేశాడు. కాయిన్‌పడ్డం, చక్రం తిరగడం, లైటారి వెలగడం, బ్లూ ట్రేలో టికెట్ పడ్డం జరిగింది. చిద్విలాస్‌కి సరదాతో పాటు కించిత్ గర్వం కూడా కలిగింది.

బరువు ఎలానూ చూసుకోవచ్చు ముందు టికెట్ వెనుక రాసున్న జోస్యం చూడాలన్పించింది. 'ఆశ చెడ్డది. దురాశ మరీ చెడ్డది.' వీడి బొంద ఇటువంటిది రాస్తే కష్టమర్సు ఎవ్వరూ రారు. వెయింగుమెషిను కేజీల లెక్కనే అమ్ముకోవాల్సిందే. కసిగా పెదవి కొరుక్కోబోయి చటుక్కున ఆ పనికి స్వస్తి చెప్పి టికెట్ తిప్పి బరువు చూశాడు. 25 కేజీలు అని వుంది. తన బరువు అంత తక్కువేమాత్రం కాదు. గత నెలలో చూసుకొంటే ఏభయికేజీలుంది. అంటే... అంటే... ఈ బరువు తనది కాదు, పాపది!

కోపం, నిరాశ కలబోసుకొని ముఖాన్ని ఎర్రబరుస్తుండగా మిషన్ దిగి వెనుదిరగబోయాడు.

"25 కేజీలనే వచ్చిందా అంకుల్!"

వెనకనే నిల్చున్న ఒంటిజడ పాప అడిగింది. ఆమె చేతిలో ఇంకో రూపాయి కాయిన్ ఉంది.

చిద్విలాస్‌కి నోటమాట రాలేదు.

– ఆనందరావ్ పట్నాయక్

# రిస్క్

సుబ్బారావు సూపర్‌మార్కెట్లో కొన్న టికెట్‌కి లాటరీలో 'జరూసలానికి ఫ్యామిలీతో సహా ఫ్రీ జర్నీ' తగిలింది. సుబ్బారావు అత్తగారితోసహా విమానమెక్కేశాడు. ప్రయాణం చివరిరోజు అత్తగారు ఆ వాతావరణం ఒత్తిడికి తట్టుకోలేక అక్కడే గుటుక్కుమంది. డెడ్‌బాడీని ఇండియాకు తీసుకురావాలంటే చాలా ఖర్చయ్యేటట్లుంది. "పోనీ ఇక్కడే పూడ్చిపెడదామండీ... జీసస్ క్రీస్ట్‌ని పూడ్చిపెట్టిన స్థలం. చాలా




హోలీ!" అంది భార్యామణి. సుబ్బారావు రాత్రంతా తెగ మథనపడ్డాడు. చివరికి ఒక నిర్ణయానికి వచ్చి మర్నాడు కాన్సులేట్ ఆఫీసుకెళ్ళి "ఎంత ఖర్చయినా సరే... మా అత్తగారిని ఇండియాకే తీసుకెళతాను. ఇక్కడ పూడ్చిపెట్టడానికి ఎంత మాత్రం వీలులేదు" అన్నాడు. వాళ్ళు లెక్కలు అవీ కట్టి "ఇరవైవేలు కట్టండి. డెడ్‌బాడీని పంపే ఏర్పాటు చేస్తాం" అన్నారు. సుబ్బారావు వంటిమీదున్న చివరి సెంటుతోసహా మొత్తం ఇరవైవేల డాలర్లు కట్టి బయలుదేరాడు.

కాన్సులేట్ ఆఫీసర్ చాలా మూవయ్యాడు. "ఎన్నో ఏళ్ళబట్టి నేనిక్కడ ఉద్యోగం చేస్తున్నాను. మీలాగా సంప్రదాయాన్ని, కుటుంబసభ్యులను, ముఖ్యంగా పెద్దవాళ్లను, అందులోనూ అత్తగారులాంటి బయటి వ్యక్తులను బతికున్నప్పుడే కాదు. చనిపోయిన తరువాత కూడా ఇంతలా అభిమానించే వ్యక్తులను చూడలేదు. ప్రాణం లేని కట్టెకు కూడా ఇన్నివేల డాలర్లు వెచ్చించి శ్రమదమాదులకోర్చి విమానంలో తీసుకెళ్ళటానికి మీరు సిద్ధపడ్డారంటే నిజంగా మీ ప్రేమకు హేట్సాఫ్!" సుబ్బారావా డైలాగ్‌ని మధ్యకలాగే కట్‌చేసి "ప్రేమా... గోంగూరా! కొన్నివేల ఏళ్ళకిందట ఇదే జెరూసలామ్‌లో క్రీస్తుని పూడ్చిపెట్టినప్పుడేమయిందో అందరికీ తెలుసుగదా! మూడోరోజే లేచొచ్చాడు. మా అత్తగారితో నేనలాంటి రిస్క్ తీసుకోదల్చుకోలేదు. అందుకే ఎంత ఖర్చయినాసరే ఇండియాకే తీసుకెళదామని డిసైడయిపోయాను" అన్నాడు.

– కర్లపాలెం హనుమంతరావు



# 'ఇది జీవితం' పై సమీక్షలు

జూలై 'చతుర'లో ప్రచురితమైన కె. ప్రవీణారెడ్డి నవల 'ఇది జీవితం' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## గుప్పిటలో ఇసుక




*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

ప్రవీణారెడ్డిగారి జూలై నెల చతుర నవల 'ఇదీజీవితం' ప్రేమ కథ చాలా బాగుంది. అపూర్వ-మయూర్‌ల ప్రేమ అభినందనీయం, హర్షణీయం. అన్ని ఏళ్ల తర్వాత కూడా ఆ ప్రేమలో మార్పు రాకపోవడం ప్రశంసనీయం. అపూర్వ తండ్రి రాంభూపాల్ చౌదరి మేనమామపై వున్న గౌరవంతో మరదల్ని పెళ్ళిచేసుకున్నా తను కోరుకున్న విధంగా లేదన్న నెపంతో ఆమెను చిన్న చూపు చూసినా, అతణ్ణి ఏరకంగానూ తప్పుపట్టకుండా సహచారిణిగా మసలిన వైజయంతి అభినందనీయురాలు. అపూర్వ ఒక కూతురుగా కాక మంచి స్నేహితురాలిగా తల్లిని తండ్రికి అనుగుణంగా తీర్చిదిద్దడం చక్కగా వుంది. తాను పొందలేని దాన్ని కూతురు పొందాలనుకుంటే ఆమెను ఆశీర్వదించలేకపోవడం రాంభూపాల్ చౌదరి మేల్ ఈగోని, ధనగర్వాన్ని తెలియజేస్తోంది. ప్రేమ, ప్రేమకు వ్యతిరేకత, అతిసహజంగా సాగింది. అంతే సహజంగా వైజయంతి కూడా భర్తమాటే జరగాలనుకోవడం, మయూర్‌ను ఆవిధంగా కోరడం ఊపిరాడని విధంగా వుంది. చివరికి విడిపోవడం, మళ్ళీ కలవడం. మధ్యలో ఆమె అహం. దాన్ని మార్చడానికి ఆదిత్య, నిరాలీ, మయూర్ అందరూ ఆడిన నాటకం రక్తికట్టింది. కథ సుఖాంతం అయింది.

తల్లిదండ్రులు పిల్లల్ని అదుపులో పెట్టాలనుకోవడం తప్పుకాదు. మరీ మితిమీరితే అది వికటించే పరిస్థితులు ఎదురవచ్చు. పిల్లలు గుప్పిటలో ఇసుకలాంటివాళ్ళు. బిగించనంతవరకూ ఫరవాలేదు. గుప్పిట బిగించాలని చూస్తే వేళ్లమధ్యనుంచి జారిపోతారు. అపూర్వ విషయంలో కూడా అలా

## చందాదారులకు విజ్ఞప్తి

**విపుల, చతుర** ఒక్కొక్కటి విడిప్రతి
రు.7-00
సంవత్సర చందా రు. 72-00
**విదేశాలకు**
సంవత్సర చందా (ఎయిర్ మెయిల్)
రు. 360/- డాలర్లు 8
మేనేజర్, వసుంధర పబ్లికేషన్స్
పేరిట M.O.గాని, డి.డి.గాని
పంపించండి.
**చిరునామా:** మేనేజర్, వసుంధర
పబ్లికేషన్స్, చతుర, విపుల
ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ,
హైదరాబాద్- 500 082

జరగవలసిందే. అదే జరిగితే కథ ఎలావుండేదో. రాంభూపాల్ ప్రమాదంలో మరణించడంతో కథ అనుకోనివిధంగా మలుపు తిరిగింది. కథలో మరో గుర్తించవలసిన పాత్ర నవ్యది. తను ప్రేమించిన వ్యక్తి ఇంకొకరిని, అదీ తన స్నేహితురాలినే ప్రేమిస్తున్నాడని తెలిసీ ఏవిధమైన ఈగో లేకుండా వారి ప్రేమకు సహకరించి వారినొకటిగా కలపడానికి తొలినుండి చివరిదాకా ప్రయత్నించిన నవ్యలాంటి స్నేహితురాల్ని ప్రతి ఒక్కరూ తమకూ అలాంటి ఫ్రెండ్ ఉంటే బాగుండును అని కోరుకుంటారు. చివరిలో అనురాగ్ పాత్రను ప్రవేశపెట్టి మయూర్, అపూర్వల ప్రతిరూపమేనన్న సస్పెన్స్, చివరివరకు తెలియపర్చకపోవడం బాగుంది.

ఆస్థి-అంతస్తుల అంతరాలు ప్రేమకు అంతరాయం కాదు అన్న విషయాన్ని మరోసారి రుజువుచేస్తూ అనుకోని సంఘటనల కలయికే జీవితం అని నిరూపించిన ప్రవీణారెడ్డిగారికి అభినందనలు.

– కె.జె.ఎస్. కుమారి
తణుకు

## 'విభిన్న ప్రేమ కథ!'

*(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

ఇప్పటి ట్రెండుకు తగ్గట్టు ఒక లవ్‌స్టోరీని కథాంశంగా తీసుకొని ఒక చిన్నపాటి అపార్థం కారణంగా జీవితంలోని అమూల్యమైన కాలం ఎలా వృధా అవుతుందో తెలియపరుస్తూ ఈ నవలని మలచిన తీరు అద్భుతం!

'కావలసినవన్నీ సమకూర్చుతున్నాంకదా మరి వీళ్ళకేం లోటు' అనుకునే రాంభూపాల్ చౌదరిలాంటి తండ్రులెందరో ఉన్నారీలోకంలో. వారు తమ బిడ్డలకు ఏమేమిస్తున్నామో చూసుకుంటున్నారేగానీ ఏమి ఇవ్వలేకపోతున్నామో తెలుసుకోలేకపోతున్నారు. వారి క్రమశిక్షణ పిల్లల స్వేచ్ఛకెంతో విఘాతం కల్గిస్తుంది. తన భార్యలోని మానసిక సౌందర్యాన్ని గ్రహించలేని చౌదరిగారు సమీరతో ఏర్పరచుకున్న అక్రమసంబంధంవలన ఆ తరువాత పశ్చాత్తాపపడవలసి వస్తుంది.

మారుతున్న కాలానికనుగుణంగా తల్లి ప్రవర్తనలో, నడవడికలో మార్పును తేగలిగిన అపూర్వ ఆమెను తండ్రికి మరింత దగ్గరచేసింది. చావుబతుకుల మధ్య ఉన్న చౌదరిగారడిగిన మాటను కాదనలేక గొప్ప మనసుతో త్యాగానికి పూనుకున్న మయూర్‌ని అర్థం చేసుకోలేని అపూర్వ పది సంవత్సరాల అమూల్యమైన జీవితకాలాన్ని వృథా చేసుకుంది.

ఏ సంఘటన కారణంగా అయితే మయూర్, అపూర్వల జీవితం అస్తవ్యస్తమైందో అటువంటి సంఘటననే వారిద్దరినీ కలిపేందుకు ఉపయోగించుకోవడం రచ

యిత టాలెంట్‌కి నిదర్శనం.

తన కారణంగానే వారిద్దరూ ఎడబాటుకు గురయ్యారని గ్రహించిన వైజయంతి వారిద్దర్నీ కలిపేందుకు ఆడించిన నాటకం అపూర్వ అహం వదిలేయడానికీ, కథ చక్కని మలుపు తిరగడానికి దోహదపడింది. పరిస్థితుల ప్రభావం మనిషిని ఎంతటి త్యాగానికైనా సిద్ధపడేలా చేస్తుంది.

అపూర్వ, మయూర్‌ల ప్రేమకోసం తన ప్రేమను త్యాగం చేసిన నవ్య చివరికి వారిద్దరినీ ఒకటి చేయడంలో కృతకృత్యురాలయ్యింది.

తన జీవితంద్వారా పాఠం నేర్చుకున్న మయూర్, ఆదిత్య, నిరాలీలను కంట్రోల్ లో ఉంచగలిగాడు. సాధారణ కథే అయినప్పటికీ ఎక్కడా బోర్ అనేదే లేకుండా వేగంగా ఓ ప్రవాహంలా సాగిపోతూ మనల్ని చదివింపచేసింది.

ముచ్చటైన పదాల పొందికతో అవసరమైనంతవరకే సంభాషణలతో, చక్కటి హిందీ పాటలతో, అద్భుత వర్ణనలతో నవల ఆద్యంతం అలరించింది.

**– పి. కిషోర్‌కుమార్**

బుచ్చిరెడ్డిపాలెం

## ప్రేమ శక్తి

***(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)***

ప్రతినెల చతుర ద్వారా మంచి నవలలు పాఠకులకు అందిస్తున్నందుకు మా ధన్యవాదాలు. జులై నెల ప్రవీణారెడ్డిగారి నవల 'ఇది జీవితం' ఆద్యంతం ఆసక్తికరంగా ఉంది. కొంత సస్పెన్స్‌తో నవల పూర్తిగా చదివేయాలనే అభిలాషను కల్గించింది. నవల ఇతివృత్తం నిజజీవితానికి అంత దగ్గరగా లేనప్పటికీ పాత్రల మనస్తత్వాలు, వాటి విశ్లేషణ రమ్యంగా కొనసాగింది. రచయిత్రి ప్రేమ శక్తి గొప్పదని తెలియచేయాలని ప్రయత్నించి సఫలీకృతులైనారు. ధనవంతుల కుటుంబాలలో ఎక్కువగా కన్పించే దురభిమానాన్ని చౌదరి పాత్ర ద్వారా చూపించి దానిని ఖండించగలిగారు. అపూర్వ-మయూర్‌ల ప్రేమను సహజంగా చిత్రించగలిగారు. నేటి తరానికి ప్రతిరూపాలైన నిరాలీ, ఆదిత్యల మధ్య ప్రేమను భిన్నంగా చూపగలిగారు. హిందీ సినిమా పాటలను మయూర్ ద్వారా పాఠకలోకానికి మధురస్మృతులుగా అందించారు. ఇది ఒక వినూత్న ప్రయోగం. ప్రవీణారెడ్డిగారి రచనా కౌశల్యం కొన్ని సంభాషణలలో ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. ఫ్లాష్‌బాక్‌ను, ప్రస్తుతానికి అనుసందించడంలో ఆమె ప్రయత్నం విజయవంతమై మంచి ముగింపునిచ్చింది. మంచికాలక్షేపాన్నిచ్చే నవలను అందించినందుకు శుభాభినందనలు.

**– ఎస్. ఇందిర**

ఒంగోలు

## సందర్భోచిత పాత్రాభినయం

***(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)***

కథ ఓ జీవితం కావచ్చేమోగానీ జీవితం ఓ కథ కాకూడదు. అలా జరిగితే... అసలు జీవితానికే అర్థం మారిపోతుంది. తాను ప్రేమించిన అమ్మాయికోసం డబ్బును కూడా లెక్కచేయకుండా తన జీవితాన్నే ఫణంగా పెట్టి ప్రేయసి సుఖపడాలనే కోరికతో ప్రేమనే త్యాగం చేసిన మయూర్ లాంటి వ్యక్తులు ఈ సమాజంలో ఎంత మంది? తన మంచితనమే చివరికి తన ప్రేయసిని కలిసేలా చేసింది విధి. అందరి

తండ్రుల్లాగానే ఆలోచించిన అపూర్వ తండ్రి మూర్ఖత్వంవల్ల కూతురి ప్రేమ జంట విడిపోయినా కాలానుగుణంగా కలపడం రచయిత్రి ప్రతిభ చాటిచెబుతుందీ నవల.

పోకిరి వేషాలతో అమ్మాయిల వెంటపడి డబ్బుకోసం పెళ్ళికి రెడీ అంటున్న నేటి యువతరానికి మయూర్‌లాంటి హీరో ఆదర్శప్రాయుడు. ఇక హీరోయిన్ అపూర్వ తప్పు అసలులేదు. అనుకోని పరిస్థితిలో అపార్థం చేసుకోవడం తన జీవితాన్నే మలుపు తిప్పుకుంది. చివరికి పాత్రలన్నీ సందర్భోచితంగా నాటకమాడి ఈ నవలని, కాదుకాదు ఓ జీవితాన్నే విజయవంతం చేశాయి.

థీం చిన్నదయినా సందేశం చాలా గొప్పది. తమ పిల్లల ప్రేమల్ని అర్థం చేసుకోకుండా విడదీయాలనుకునే తల్లిదండ్రులది ఎంత తప్పో, నిజానిజాలు తెలుసుకోకుండా ప్రేమికులు అపార్థం చేసుకొని విడిపోవడం కూడా అంతే తప్పు. అది ప్రేమే కాదు స్వార్థం అనిపించుకుంటుంది.

మయూర్ ఆలపించిన పాత హిందీ ప్రేమగీతాలు వాటి తెలుగు వివరణ నవలకే హైలైటు. ఉన్నత కుటుంబాల తీరుతెన్నుల్ని మధ్యతరగతివారి అనురాగాప్యాయతల్ని చక్కగా తెలియచేశారు. కథనం, శైలి చాలా బాగున్నాయి. ఓ చక్కని స్క్రీన్‌ప్లే ఉన్న సినిమా లవ్‌స్టోరీ ఈ 'ఇదీ జీవితం'.

*– అవుసలి ఆంజనేయులు*

మూసాపేట

## రొమాంటిక్ సిన్మా

***(అయిదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)***

'ఇది జీవితం' నవల ఓ రొమాంటిక్ సిన్మాలా ఆహ్లాదంగా సాగిపోయింది. మయూర్, అపూర్వలమధ్య ప్రేమ సన్నివేశాలు పాఠకులకి రక్తికట్టేలా సాగాయి.

కథ పాతదిలా వున్నా కథనం నవీన పోకడలతో సాగింది. మయూర్, అపూర్వని డబ్బుకోసమే ప్రేమిస్తున్నాననే సన్నివేశం పాఠకుల్ని దిగ్భ్రాంతికి గురిచేసింది. క్లైమాక్సు పాఠకుడ్ని సంతోషపెట్టేలా వుంది. (హీరోహీరోయిన్లు కలవడం ఆనందమేగా)

కేవలం పాత చింతకాయ పచ్చడిలాటి ప్రేమనే గాకుండా, కష్టపడి ఎలా పైకి రావాలో 'మయూరి' పాత్ర చెబుతోంది. రచయిత్రికి ఉర్దూ పాటలపై ఎంతో పట్టు వుంది. అవన్నీ చక్కగా అర్థవంతంగా చెప్పారు.

పాతతరం ప్రేమకీ (వైజయంతి, చౌదరి), యువతరం ప్రేమకీ (మయూర్, అపూర్వ), ఆధునిక నవతరం ప్రేమకీ (అనురాగ్, నీరూ) తేడాని సన్నివేశ కల్పనలో రచయిత్రి చిత్రించడం అమోఘం.

నవల పాత్రల చిత్రణ బావుంది, దానితోపాటు వారి అంతరాళాల చిత్రణ కూడా చూపిస్తే ఓ యద్దనపూడి నవలలా... కలకాలం నిలిచిపోయేది.

*– డా॥ కె. సుబ్బారావు*

బుట్టాయిగూడెం

✦

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328.
Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Chennai: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060; .Cuddapah: 70011; Tadepalli gudem: 28881; Warangal: 59933. Khammam: 55661; Ongole: 56777; Nizamabad: 45661; Mahabubnagar:77438; Mumbai: 022- 4703700; Chennai: 044-2314980; Bangalore: 080- 3503498

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2003-2005 RN1/32186/78